# గ్రంథాలయ సదస్సు

(ప్రత్యేక సంచిక)

★

ఆవిష్కరణ:

నీలంరాజు వెంకటశేషయ్య

ఎడిటర్, ఆంధ్రప్రభ, విజయవాడ.

★

సభా వేదిక:

రైస్ మిల్లర్స్ అసోసియేషన్ భవనం

విజయవాడ.

ఆగస్టు 31, 1963.

★

లోకల్ లైబ్రరీ అథారిటి - కృష్ణా.

మచిలీపట్నం

# కృష్ణా లోకల్ లైబ్రరీ అథారిటీ కమిటీ సభ్యులు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ కలపాల సూర్యప్రకాశరావు, (అధ్యక్షులు,) | ముదునూరు |
| 2. | " అట్లూరి వీర రాఘవయ్య | పులపర్రు |
| 3. | " పి. బి. వి. కె. ధర్మారావు | పోలుకొండ |
| 4. | శ్రీమతి పి. రత్నమాల | గుడివాడ |
| 5. | " ఇ. బాపమ్మ | " |
| 6. | శ్రీ సి. హెచ్. రాజ గోపాలరావు | చిట్టిపాలెం |
| 7. | " కె సత్యన్నారాయణ | బందరు |
| 8. | " యమ్. రామచంద్రరావు | మాజేరు |
| 9. | " టి. నాగభూషణరావు | మల్లవోలు |
| 10. | " జి. గోపాలరావు | కోసూరు |
| 11. | " యస్. రాఘవయ్య | మోదుమూడి |
| 12. | " జి. పుల్లారెడ్డి | తేలప్రోలు |
| 13. | " యస్. టి. పి. వరదాచారి | గొల్లపల్లి |
| 14. | " కె. సత్యన్నారాయణ రెడ్డి | బూరుగపూడి |
| 15. | " కె. పి. వి. రాఘవరావు | తిరువూరు |
| 16. | " కె. సుబ్బారావు | గంగినేనిపాలెం |
| 17. | " ఎ. వెంకట రమణయ్య | విజయవాడ |
| 18. | " పి. నాగభూషణం | పటమటలంక |
| 19. | " సి. హెచ్ వెంకటేశ్వరరావు | పరిటాల |
| 20. | " బి. నారాయణరావు | బందరు |
| 21. | " కె. విశ్వనాథం | కొణకంచి |
| 23. | " యమ్. శేషయ్య | పెనుగంచిప్రోలు |
| 23. | " వి. రంగారెడ్డి | జనార్థనపురం |
| 24. | " బి. ఈశ్వరరావు | కవుతవరం |
| 25. | " ఎ కాంతారాయుడు | నూజివీడు |

# విషయ సూచిక



గ్రంథాలయములు : శ్రీ కాకాని నరసింహారావు

గ్రంథాలయోద్యమ చరిత్ర : శ్రీ గోనుగుంట్ల నాగేశ్వరరావు

గ్రంథాలయములు - సమాజ విద్య : శ్రీ నాగులపల్లి సీతారామయ్య

మన గ్రామీణ గ్రంథాలయములు-

కొన్ని సూచనలు : శ్రీ విజయకుమార్ సిన్హా

గ్రంథాలయాలు - స్త్రీలు : శ్రీమతి రాజ్యం సిన్హా

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయోద్యమం - శాసనపరిపాలనా - ప్రజాఉద్యమం సమ్మిళితంగా నడవాలి

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య

గ్రంథాలయోద్యమము - నవశకము : శ్రీ కోపూరు వెంకటసుబ్బారావు

సందేశము : శ్రీ గోపరాజు రామచంద్రరావు

గ్రంథాలయములు - విజ్ఞానప్రచారం శ్రీ యస్. వీరయ్య చౌదరి

గ్రంథాలయాలు - గ్రామసేవ : శ్రీ యలమంచిలి వెంకటేశ్వరరావు

అభినందన తీర్మానము : ప్రతిపాదకులు: శ్రీ జాస్తి వెంకటనరసయ్య

ఆమోదకులు : శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్య

గ్రంథాలయ సదస్సు సూచనలు :

ప్రతి గ్రామానికి గ్రంథాలయం.

---



## శ్రీ కలిపాలి సూర్యప్రకాశరావు

చైర్మన్

లోకల్ లైబ్రరీ అథారిటీ, కృష్ణా

మచిలీపట్టణము



**శ్రీ వేములపల్లి చంద్రశేఖరరావు,**

B. A., D. L. SC.,

కార్యదర్శి

లోకల్ లైబ్రరీ అథారిటీ, కృష్ణా

మచిలీపట్టణము

INDIAN NATIONAL CONGRESS

*President ;*

D. SANJIVAYYA

NEW DELHI - 1


August 22, 1963.

Dear Shri Suryaprakash Rao,

Thank you very much for your letter dated 3rd August, 1963. I am glad that you are holding a Seminar of the Local Library Authority. I wish the Seminar all success.

Thanking you,

Yours sincerely,

(Sd.) D. Sanjivayy

GOVERNMENT OF INDIA

NATIONAL LIBRARY,

BELVEDERE.

Calcutta-27

14th August 1963.

Dear Sir,

Please refer to your letter sans date to Shri Kesavan.

Shri Kesavan has been appointed Director, INSDOC' National Physical Laboratory, Hillside Road, New Delhi-12, and Shri Y. M. Mulay has taken over as Librarian of this Library. The Librarian highly appreciates the great service which is being rendered by the Local Library Authority, Krishna District, Andhra Pradesh, under your Chairmanship in placing recorded knowledge at everybody's door in your locality. The cultural upliftment of the people of your locality which you are aiming at achieving through a net-work of Library service will undoubtedly be a distinct service not only to your locality but also to the country as a whole. The success you will achieve at your centre will draw the attention of the er parts of the country which will naturally try to follow ur example. The Librarian wishes your endeavour an un-ualified success.

*Yours faithfully,*

(Sd.) **D. L. BENERJEE**

Deputy Librarian.

MINISTER OF DEFENCE PRODUCTION
GOVERNMENT OF INDIA
NEW DELHI

August 20, 1963.

*My dear Suryaprakasa Rao,*

*I am thankful to you for your letter of 17th August. I am very happy that a Seminar is being conducted by the Local Library Authority in Krishna District. It is an excellent idea and I am sure the discussions in the Seminar will be very helpful. I wish the Seminar all Success.*

Yours sincerely,

*(Sd.) K. Raghu Ramaiah*

MINISTER
INFORMATION & BROADCASTING
INDIA.

New Delhi,

August 19, 1963.

My dear Sri Suryaprakasarao,

I am happy to learn that you are conducting a Seminar of the Local Library Authority, Krishna Dt., on the 31st August and 1st September, 1963. I am sure the Seminar will help in the promotion of your activities. I wish the Seminar every success.

*With regards,*

Yours sincerely,

(Sd.) **B. GOPALAREDDI**

# Indian Statistical Institute

DOCUMENTATION RESEARCH
AND
TRAINING CENTRE
**112, 11th Cross Road - BANGALORE-3.**

*23rd August 1963.*

1. I am glad to hear that the Local Library Authority of Krishna is conducting a Seminar on 31st August and 1st September 1963 at Vijayawada. The Chairman asks me for a message for inclusion in the Souvenir to be released during the time of the conference. I am glad to concede to his request.

2. The number of libraries and delivery stations maintained by the Local Library Authority of Krishna is really gratifying.

3. But these libraries cannot produce the desired result unless the books are activated by the librarian. I hope that each branch has got at least one trained librarian who can help each reader to find his book whenever he comes to the library.

4. A scheme for the viable number of branch libraries for each district and for the necessary staff to be maintained by each Local Library Authority was worked out in the Andhra Pradesh Library Seminar held in March 1962. Within a few days after the Seminar, I sent to the Director of Public Libraries and also to the Education Minister a full copy of all the decisions arrived at during the Seminar.

5. I wonder whether any steps have been taken to implement the findings so arrived at. If not, I hope you will use your influence to see that they are implemented, since otherwise the costly seminar that we held would virtually prove to have been a waste.

Wishing every success to your Seminar,

(Sd.) S. R. RANGANATHAN.

గొట్టిపాటి బ్రహ్మయ్య, M. L. C.
(ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటి అధ్యక్షులు)
గాంధీభవన్ - హైదరాబాదు-1.
14-8-'63.

ప్రియమిత్రులు సూర్యప్రకాశరావుగారికి,

నమస్కారములు.

కృష్ణాజిల్లా లైబ్రరీ అథారిటీ యాజమాన్యాన అనుభవజ్ఞులైన పెద్దల అమూల్య సలహాలను, సందేశాలను పొంది గ్రంథ, పత్రికా పఠనంలో ప్రజల కాసక్తి కల్పించు సంకల్పంతో మీరు 'గ్రంథాలయ సదస్సు'ను జరుపనున్నందుకు చాలా సంతోషం.

గ్రంథాలయాల ప్రాముఖ్యాన్ని గూర్చి సహజంగా రెండు అభిప్రాయాలు ఉండబోవు. వాటి ఆవశ్యకతను ప్రపంచం ఏనాడో గుర్తించింది. ముఖ్యంగా మన దేశపరిస్థితులు, అవసరాల దృష్ట్యా గ్రంథాలయోద్యమ వ్యాప్తి నిర్వివాదమైన ఆవశ్యకత. ఒక విధంగా పండితులుకూడా విద్యార్థులే. విజ్ఞానము అంతుపొంకని మహాసముద్రము వంటిది. అట్టి విజ్ఞానాభివృద్ధి ధ్యేయంగా గల గ్రంథాలయాల స్థాపన ఎంతో అవసరం. మన జిల్లాలో 1913 సంవత్సరమున విజయవాడలో రామమోహన గ్రంథాలయ స్థాపనతో గ్రంథాలయోద్యమము పల్లె గ్రామములకు సహితం వ్యాపించినది. ఆనాడు ఈ గ్రంథాలయోద్యమము యువకుల నాకర్షించి తద్వారా రాజకీయ రంగమున ఆ యువకులను ఆరితేరిన రాజకీయవేత్తలుగా సృష్టించినది. మహాత్ముని నాయకత్వమున స్వరాజ్య సంరంభమున పాల్గొన్న యోధులు చాలమంది ఈ గ్రంథాలయోద్యమమున ఆరితేరినవారే.

మన జిల్లాకు సంబంధించినంతవరకు గ్రంథాలయోద్యమ వ్యాప్తిని ప్రణాళికా బద్ధంగా సాగించుచున్న మీ కృషిని అభినందించుచున్నాను. గ్రంథపఠనము, పత్రికా పఠనములయందు ప్రజల కాసక్తి కల్పించు మీ ప్రత్యేక పథకములు జయప్రద మగుగాక. మన 'జిల్లా గ్రంథాలయ సదస్సు' మార్గదర్శకమైన నిర్ణయాలు చేసి నిర్మాణాత్మకంగా వ్యవహరించగలదని ఆశించుచున్నాను.

(సం.) గొట్టిపాటి బ్రహ్మయ్య,
అధ్యక్షులు.

**Sri B. S. MURTHY**
Dy. Minister:
COMMUNITY DEVOLOPMENT
PANCHAYATRAJ CO-OPARATION
NEW DELHI

విజ్ఞానానికీ, వినోదానికీ గ్రంథ పఠనము ముఖ్యసాధనము. కాని మన దేశంలో అక్షరాస్యుల సంఖ్య తక్కువ చదువుకున్నవారిలో చాలామందికి ఖరీదైన గ్రంథాలు కొనగలిగే ఆర్థిక స్తోమత లేదు. నిరక్షరాస్యతను నిర్మూలించడానికి సులభ శైలిలో వ్రాయబడిన పుస్తకాలు అత్యవసరం. ఈ పరిస్థితులలో వివిధ విషయాలపై తేలికభాషలో ప్రచురించబడిన గ్రంథాలతోపాటు దిన వార పత్రికలను బహుళ ప్రజానీకానికి సులభంగా లభ్యమయ్యేలాగు ఏర్పాటుచేయడం ఎంతైనా ఆవశ్యకము. ఈ లక్ష్యసాధనలో గ్రంథాలయాలు ప్రముఖపాత్రను వహించవలసి వుందనడంలో సందేహం లేదు.

గడిచిన దశాబ్దములో ఆంధ్రరాష్ట్రము సాధించిన గ్రంథాలయ విస్తరణ కార్యక్రమము ప్రశంశనీయం. గ్రంథాలయాల సేవగ్రామ గ్రామానికి విస్తరింపచేసి, పుస్తకాలను ప్రతి పౌరునికీ అందజేయాలంటే గ్రంథాలయోద్యమం సాధించవలసిన పని ఇంకా చాలా వున్నది. దీనికి ప్రభుత్వ ప్రజా సంస్థల తోడ్పాటు విరివిగా కావలసివుంది. ఈ వుద్యమం ప్రజల సహకారముతో పంచాయతీ సంస్థల సానుభూతితో బలము పుంజుకొని పరిపూర్ణ ఆశయ సాఫల్యత నొందగలదని నే నాశిస్తున్నాను.

ఈ సందర్భంలో కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీవారు చేస్తున్న కృషి ప్రశంసనీయము. ఆంధ్రప్రదేశ్‌లో తక్కిన జిల్లాలవారందరకీ అనుసరణీయము.

(సం.) బి. యస్. మూర్తి

గ్రంథాలయాలను ఉపయోగించుకొని, విజ్ఞానాన్ని పెంపొందించండి.

దేశ సమైక్యతను కాపాడండి.

అధికోత్పత్తికై నిరంతరం కృషి చేయండి.

## కృష్ణా లోకల్ లైబ్రరీ అథారిటీ మాజీ అధ్యక్షులు







డా॥ రాళ్ళపల్లి అచ్యుతరామయ్య, 1950—54 M. B., B. S.

శ్రీ కె. జి. బాబూరావు, 1954-57 M. A., L. L. B.



1957 1962

గోసుగుంట్ల నాగేశ్వరరావు. B. A.,




# లోకల్ లైబ్రరీ అథారిటీ బ్రాంచి గ్రంథాలయం

మ హి ళా శా ఖ

**గు డి వా డ.**

చట్టాలనుకూడా
క్రమాలలో సాంఘి
నది. అందు కనుగు
ములు కల్పించుటకు
అయినది. ఇన్ని రం:
అభివృద్ధిని సాధించ
ప్రస్తుతచట్టం ప్రకార
బాధ్యత చాలగలము.
పోయియున్న అనాచార

# స్వాగతోపన్యాసము

శ్రీ కలపాల సూర్యప్రకాశరావు.
ఛైర్మన్
లోకల్ లైబ్రరీ అథారిటీ, కృష్ణాజిల్లా.

అధ్యక్షా!
పెద్దలారా!
సోదర గ్రంథాలయ కార్యకర్తలారా!
గ్రంథాలయాభిమానులారా!

మీకందరికు కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ తరఫున నా హృదయపూర్వక సుస్వాగతము.

నేడు దేశం ఎదుర్కొంటూవున్న అతిక్లిష్ట పరిస్థితులలో గ్రంథాలయోద్యమ విధులను ప్రజలకు అందుబాటులో నుంచు విధానాలను యోచించు నిమిత్తం మనం యిచ్చట సమావేశమైనాము. దేశస్వాతంత్ర్యము, ప్రతిష్ఠను, స్థిరత్వము నొందుటకుగాను, జాతీయైక్యతకు విజ్ఞాన ప్రబోధము కలిగించుట గ్రంథాలయముల ధర్మమైయున్నది. ఇట్టి ప్రధానమైన ఐక్యతాభావం ఒక్క సాహిత్యరంగం ద్వారానే సాధించగలము. ఈ రంగంలో నిష్ణాతులై వున్న మీబోటి పెద్దలు తగిన నిర్ణయములు చేయవలసినదిగా కోరుచున్నాను. ఇందుకు అవసరమైన ప్రశ్నావళిని కూడా తయారు చేసి యున్నాము. ఈ సెమినారు జరుగు రెండుదినాలలో, వానిపై సాంగోపాంగముగా చర్చలుజరపి మాకు మార్గోపదేశకులు కాగలరని ఆశిస్తున్నాను.

ఆధునిక విజ్ఞాన యుగంలో గ్రంథాలయాల స్థానం అత్యున్నతమైనది. జీవితరంగంలో ఏ ఉద్యమాన్ని ప్రారంభించాలన్నా, ఏవిధమైన అభివృద్ధిని సాధించాలన్నా జ్ఞానం అవసరం. ఈ జ్ఞానంకూడా కాలానుగుణ్యమైన సాంకేతిక జ్ఞానమై యుండాలి. ప్రపంచం ప్రతిక్షణం మార్పుచెందుచున్నది. ఊహకందని పరిశోధనలు ఒకదానికి మించి మరొకటి నిత్యము గోచరమగుచున్నవి. దీనికంతకు కారణం మానవుని మేధా సంపత్తి అభివృద్ధి చెందడమే.

ఆదిమ సమాజ జీవితం నుంచి పరంపరాగతంగా అభివృద్ధిచెందుతూ వచ్చే మానవుని అను
విజ్ఞానం. ఈ ఆలోచనలు ఒకప్పుడు
మౌఖికంగాను, తర్వాత తాళపత్రము
కాలానికి కాగితము, అచ్చు వగైరా
గ్రంథస్థంకాబడి నేటి విజ్ఞాన ప్రపంచ
ములో ఘనత నుద్ధరించుచున్నది.
సాహిత్య గ్రంథాల క్రోడీకరణమే నేటి

భారతదేశం అతి పురాతనమై
జాతులు, మతములు సంస్కృతులు
గావించినవి దానిలో కొన్నికాలగర్భ

అయినను గొప్పచరిత్రను సృష్టించ గలిగిన జాతిగా భారత జాతి నేటి విజ్ఞాన ప్రపంచంలో నిలువగలిగినది. ఎన్నో అన్యజాతుల దాడులను ఎదుర్కొన్నది. ఆధ్యాత్మిక తత్త్వ విచారణకు పేరెన్నికగన్నది. ఆధునిక శాస్త్రీయ విజ్ఞానంలో వికసించిన పాశ్చాత్యుల తాకిడికిలోనై జానిసత్వం పాలయినది. తద్విమోచనార్థం జాతిపిత అడుగు జాడలలో నవ చైతన్య విజృంభణచెంది స్వాతంత్ర్య సంసిద్ధి నందినవి.

స్వాతంత్ర్యప్రాప్తికై చేయబడిన కృషిలో గ్రంథాలయ వుద్యమముకూడా ఒక భాగంగా స్వీకరించబడినది. అనేకమంది సంఘసేవకులైన దేశభక్తులు స్వతంత్రపోరాట విరామ కాలంలో ప్రజలను చైతన్యవంతులునుగా చేయుటకు, వారిలో దేశభక్తి బీజాలు నాటుటకు, గ్రంథాలయోద్యమమును ఒక సాధనముగా ఎంచుకున్నారు వీరుగాక కొందరు స్వచ్ఛంద సంఘసేవకులు తమ యావజ్జీవితమును ఈ ఉద్యమమునకు అంకితం చేసుకున్నారు. మొత్తం మీద యీవుద్యమము దేశభక్తి ప్రబోధితమై భారతదేశమున దిన దినాభివృద్ధి గాంచినది. ఎన్నో గ్రంథాలయాలు ఆనాడు స్వాతంత్ర్య యోధులకు ఆశ్రయనిలయాలుగా వుపకరించినవి

స్వాతంత్ర్యానంతరం దేశం ప్రణాళికా బద్ధంగా అభివృద్ధి చెందవలసిన అవసరమున్నదని దేశనాయకులు గ్రహించినారు. అందుకై ఏర్పరచిన ప్రణాళికలను వివిధ భాగములుగా విభజించినారు. అందు సాంఘిక విద్యా ప్రణాళికలో గ్రంథాలయములకు విశేష ప్రాముఖ్యమును కల్పించి[...]ను. ఆధునిక పరిస్థితుల కనుగుణంగా నూతన గ్రంథాలయ [...]లయారు చేశారు. సమాజ అభ్యున్నతి కార్య[...]క సేవకు అతి ప్రధానపాత్ర కల్పించబడి [...]ణ్యమైన కార్యకర్తలకు కొన్ని సదుపాయ [...]మాత్రమే గ్రంథాలయ చట్టం ఏర్పా[...]లవలె ఈ రంగంకూడా క్రమబద్ధమైన [...]టకు ఈ చట్టం ఉపకరించగలదు. [...] నడుపబడే పౌర గ్రంథాలయముల [...] సమాజంలో యింతవరకు పాతుకు[...] పద్ధతులను అవి నిర్మూలించవలసియున్నది. సాంస్కృతిక వికాసమునకు దోహదము కల్పించవలసియున్నది. నవసమాజ నిర్మాణమునకు గ్రంథాలయములు పునాదిరాళ్ళుగా రూపొందవలెనని మన నాయకుల ఆశయం.

అన్ని రంగాలలోను ప్రణాళికాబద్ధంగా దేశం పురోభివృద్ధి గాంచవలసియున్నది. గనుక పంచాయితీ రాజ్ విస్తరణ సేవాపథకాలు వేయబడినవి. ఈ పథకంద్వారా ప్రజావసరములను తమకు తామే తీర్చుకొను బాధ్యత ప్రజలపై పెట్టబడినది. పరిమితమైన కొన్ని అధికారములను కూడా ప్రజలకివ్వడం జరిగింది. ఈ పథకాల నిర్వహణకు కొన్ని ఆర్థిక వనరులు కల్పించబడినవి. అందు ముఖ్యమైనది గ్రంథాలయ సెస్సు ఒక భాగం. ఇంటిపన్ను చెల్లించే ప్రతి పౌరుడు యీ సెస్సు చెల్లించాలి. ఇలా చెల్లించగా వచ్చిన మొత్తం సెస్సును వినియోగించు కొనుటకు జిల్లా సంస్థలు ఏర్పాటయినవి ఇక జిల్లాలోకల్ లైబ్రరీ అథారిటీలు. వీటికి గ్రామపంచాయితీలకు సన్నిహిత సంబంధం ఏర్పాటు చేయబడింది. ఈ ప్రణాళిక ప్రకారము ప్రతి పంచాయితీ ఒక గ్రంథాలయమును ఏర్పర్చవలయును. తాను వసూలు చేసిన సెస్సును జిల్లా కేంద్ర గ్రంథాలయమునకు చెల్లించి, దాని ద్వారాతమ గ్రంథాలయమునకు గ్రాంటును పొందవచ్చును. ప్రభుత్వం యీ వసూలైన మొత్తంపై మరింత సొమ్మును గ్రాంటుగా యిస్తుంది. ఈ విధంగా పరస్పరాశ్రితమైన క్రమపద్ధతిలో గ్రంథాలయాలు అభివృద్ధి చెందవలసియున్నవి.

పూర్వం దేవాలయంలేని గ్రామంలో కాపుర ముండరాదని మన పూర్వీకులలో ఒక నానుడి గలదు. నేటి పరిస్థితుల నాలోచించిన గ్రంథాలయములేని గ్రామం నివాసయోగ్యం కాదు. జనసామాన్యమునకు విద్యా సౌకర్యములు లేక నిరక్షరాస్యులుగావున్న రోజులలోను, ముద్రణా సౌకర్యములు లేక గ్రంథ పఠనమునకు సౌకర్యములు లేని కారణం చేత ఆనాటి సమాజ పరిస్థితుల కనుగుణ్యంగా గ్రామానికి ఏ ఒక్కరో, ఇద్దరో తప్ప విద్యాధికులుండేవారు కారు. వారుకూడా ఏ తాళపత్ర గ్రంథాలనో, వ్రాతపతులనో తప్ప ఉపయోగించు సావకాశము లేకుండెను. అందుచేత సాహిత్య

గోష్ఠులు, భజనలు, సాంస్కృతిక ప్రదర్శనలు, వివిధ కళా వినోదములు అన్నీ ఒకే ఒకచోట దేవాలయలగా మూర్తీభవించి వుండెడివి.

గ్రామస్థులంతా భక్తిరస ప్రపూరితులై నిర్ణీత సమయానికి దేవాలయమునకు విధిగా వెళ్ళుచుండెడివారు. అప్పుడు ఆ పండితులు తాము చదివి అందరకు వినిపించి, అర్థసహితముగా వివరించెడువారు. ఆనాటికి అదే వారి గ్రంథాలయంగా వుండెడివి. పైగా ఆనాడు దైవభక్తి చరమదశ నందుకుని యున్నందున ప్రతిదీ దైవీభావంతో ఆలోచించెడు వారుగనుక అదే వారి దేవాలయంగా వుండెడిది ఇట్టి సత్కాలక్షేపం జరుగు పవిత్రస్థలము దేవాలయము కనుక అట్టి దేవాలయంలేని గ్రామం నివాసయోగ్యం కాదని వారు నమ్ముటలో సత్యమున్నది నేడు అలాకాదుగదా! దినదినము మార్పులుచెందు విజ్ఞానయుగంలో మనమున్నాం విద్యాభ్యాస సౌకర్యములు పెరిగినవి. అచ్చుయంత్రాలు కొల్లలుగా వచ్చినవి. చిత్రలేఖనము, లలితకళలు, సాహిత్యము ప్రజలు కందుబాటులోనికి వచ్చినవి. ప్రతివిషయముపైన వేలకువేలు గ్రంథాలు, పత్రికలు నిత్యము ప్రకటించ బడుచున్నవి. ఈ వాఙ్మయము నంతను ప్రతివ్యక్తి సంకలనముచేయుట కష్టతరమైనపని. నిన్నటి క్రొత్త నేడు ప్రాతగా కనుపించే రోజులు. అందుచేత ప్రతిగ్రామాన సాముదాయక గ్రంథ సంకలన కేంద్రం వుండుటవసరమైనది. ప్రతి సామాన్య మానవునకు అందుబాటులోవుండు నిమిత్తం ప్రతిగ్రామాన గ్రంథాలయం వుండితీరవలెను. అందువల్లనే ప్రతి గ్రామంలోను దేవాలయమేగాక గ్రంథాలయంకూడ ఉండవలయును.

దేశ పునర్నిర్మాణ పథకాలలో అతికీలకమైన గ్రంథాలయ పథకం అభివృద్ధి చెందటం చాలా ముఖ్యం. గ్రంథాలయం విజ్ఞాన భాండాగారము విజ్ఞానము లేనిదే వివేకముండదు. వివేకములేనప్పుడు మానవుడు తన కర్తవ్యాన్ని తాను గ్రహించలేడు. దానిసత్వం అనే చీకటిలో పడిపోతాడు. కనుక అంధకారంలోనుంచి వెలుగులోకి తేగలిగిన సాధనం గ్రంథాలయం మాత్రమే. అట్టి గ్రంథాలం విజ్ఞాన కేంద్రంగా వుండవలయును. గ్రంథాలయం ప్రతిపౌరుని ఆకర్షించునట్లుగా గ్రంథాలయ సేవకుడు దానిని తీర్చి దిద్దవలయును ప్రతి పౌరునికి కాలు పెట్టినంత నే గ్రంథాలయం హాయి చేకూర్చునదిగా తోచవలెను. ప్రజల అభిరుచుల కనుగుణ్యమైన సాహిత్యమును గ్రంథాలయములో చేర్చి, సబ్జక్టువారీగా విభజనచేసి బీరువాలలో వుంచవలెను అందలి విషయ జాలమును గ్రంథాలయ సేవకు ముందుగా తాను గ్రహించి, పఠితలకు వివరించవలెను. అలాగే పత్రికల విషయంలోకూడా జాగ్రత్త వహించి, ప్రజల పఠనాశక్తిని అభివృద్ధి చేయవలెను.

ప్రపంచములో నేడు అభివృద్ధిచెందిన దేశాలు అన్నీ గ్రంథాలయ వుద్యమమును బాగుగా వుపయోగించుకున్న వారే. ఉదాహరణకు అమెరికా దేశంలో గ్రంథాలయాల స్థాయి అత్యున్నత దశకు వెళ్ళినది. అక్కడ నిరక్షరాస్యత అనునదిలేదు. మానవుని క్షుద్బాధా నివారణకు ఆహారము ఎంత అవసరమో తన మస్తిష్కం అభివృద్ధి పొందుటకు సాహిత్యము అంత అవసరమని ప్రతి అమెరికా పౌరుని విశ్వాసము, నిజానికి ఒకపూట భోజనం లేకపోయినా వుండగలడుగాని పేపరు చూడనిదే వుండలేని స్థితిలో ఆ దేశ వాసులు తయారయినారు. ఇటీవల మన ప్రధాని నెహ్రూ గారు కూడా మార్పు చెందుతున్న యీ ప్రపంచ నూతన విషయాలు తెలుసుకొనుటకుగాను, కొంతకాలం విశ్రాంతి తీసుకొని గ్రంథపఠనము చేయవలయునని వుందని వెల్లడించినారు. కనుక సాహిత్యపఠనం ఎంత అవసరమో దీనివల్ల మనకు తెలియగలదు. ఇంగ్లండు, జర్మనీ, ఫ్రాన్సు, రష్యా మొదలయిన అభివృద్ధి చెందిన అన్ని దేశాలలోను గ్రంథాలయవుద్యమం యిలాగే అభివృద్ధి చెందినది. ఆ దేశాలలో రోజుకు కొన్నివేల గ్రంథాలు అచ్చగుచున్నవి. అక్కడ ప్రజలలో పఠనాశక్తి హెచ్చుగా వున్నందునే అలా జరుగుచున్నది. మనదేశంకూడా అనతికాలంలో గ్రంథాలయ వుద్యమంద్వారా అభివృద్ధి గాంచగలదని విశ్వసిద్దాం.

లోకల్ లైబ్రరీ అథారిటీల చరిత్రలో ఈ సెమినార్ కార్యక్రమం మా ప్రథమ ప్రయత్నం. ఈ ప్రయత్నమే, నూతనోత్సాహం పురికొల్పి, గ్రంథాలయ చరిత్రలో విప్లవాత్మకమైన పరిణామములు తెచ్చునదిగా రూపొందగలదని మాఆశ. శ్రమయని తలంచక ఈకార్యక్రమాన్ని పైదృక్పథములతో ఆలోచించి, నిర్మాణాత్మకము, ప్రజా శ్రేయోదాయకము ఆచరణయుక్తమగు సూచనలు చేయవలసినదిగా ప్రార్థించుచున్నాను.

జైహింద్ !

విజయవాడ.
31—8—1963

కలపాల సూర్యప్రకాశరావు, ఛైర్మన్, (కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ)

# అందరికీ పుస్తకాలు

శ్రీ పాతూరి నాగభూషణం
ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ కార్యదర్శి,
లోకల్ లైబ్రరీ అథారిటీ సంఘ సభ్యులు.

## కీర్తన

అందరకు పుస్తకాల్ - అంధులకు పుస్తకాల్
పిల్లలకు పెద్దలకు - ఎల్లరకు పుస్తకాల్

నారీమ తల్లులకు - నోర్లేని వారలకు
కలవారలకు - లేని కటిక బీదలకును ||అం||

పనిచేసి తిరిగేటి - పట్టణ వాసులకు
పగలెల్ల పాటుబడు - పల్లె జనముల కెల్ల ||అం||

పేటలో గ్రంథాలు - కోటలో గ్రంథాలు
బాటలో గ్రంథాలు - బోటులో గ్రంథాలు ||అం||

స్వేచ్ఛగా తిరిగేటి - స్వచ్ఛంద వాదులకు
రైలులో ప్రయాగేటి - బైసికిల్లో సహా ||అం||

రోగములతో కుళ్ళు - రోగిష్టులకే గాక
శారీరమున మంచి - ఆరోగ్యమున్ గల్గు ||అం||

చదువ నేర్చిన యట్టి - చదువ జాలని యట్టి
పండిత పామర - మండలికి సంతాను ||అం||

# జాతీయోద్యమము- గ్రంథాలయములు

శరణు రామస్వామి చౌదరి



భారతదేశమున వంగదేశ విభజనతో జాతీయోద్యమము ప్రారంభమైనది. హిందూ మహమ్మదీయులు ఏక మాతృ గర్భసంజాతులవలె సోదరులుగా ఐకమత్యముతో మెలగుచున్న రోజులవి. 1857 వ సంవత్సరమున జరిగిన ప్రథమ భారతీయ స్వాతంత్ర్య సంగ్రామమున, హిందూమత పీఠాధిపతులు, మహమ్మదీయ మత ప్రవక్తలగు ముల్లాలు ఏకలక్ష్యముతో, దీక్షతో, భారతజాతిని, స్వాతంత్ర్యయోధులై, స్వాతంత్ర్యము సంపాదించి భారతమాతను పరదేశ దాస్యమునుండి విముక్తి గావింపుమని భారతీయులను ప్రబోధించిరి. ఆంగ్ల ప్రభుత్వమువారు చివర భారత చక్రవర్తి యగు బహదూర్‌షాను ఢిల్లీ నగరమున బందీగా నుంచిరి. మీరట్ నగరమున సిపాయీలచే ప్రారంభింపబడి, ఢిల్లీనగరమునకు వెళ్ళి ఆంగ్ల సేనానాయకులను, ఆంగ్లేయులను హతమార్చిన స్వాతంత్ర్య యోధులు హిందూ-మహమ్మదీయులను భేదము అణుమాత్రము లేక నిర్బంధములోనున్న భారత చక్రవర్తియైన బహదూరుషాను తిరిగి భారత చక్రవర్తిగ ప్రకటించి ఏనుగుమీద నెక్కించి ఢిల్లీ పురవీధులలో ఉత్సాహముగ ఊరేగించి సింహాసనముమీద నెక్కించి ఫర్మానాలు జారీచేయించిరి. ఆ జాతీయ భావముతోనే మెలగుచున్న భారతజాతిని విడదీసి హిందూ-మహమ్మదీయులను భేదము కల్పించుటకే మహమ్మదీయులు ఎక్కువగనున్న తూర్పుబెంగాలును విడదీసి వేరు రాష్ట్రముగ జేసి వంగరాష్ట్రమున చిచ్చుపెట్టిరి. అప్పటికి భారతదేశమున ఆంగ్ల విద్య హిందువులే అభ్యసించి ప్రభుత్వ కచ్చేరీలలో ఉద్యోగములు చేయుచుండిరి. ఆంగ్ల విద్య వ్యాప్తి చెందుటకు శ్రీ రామమోహనరాయ ఎక్కువ కృషి చేసి వంగదేశీయులలో మంచి ప్రబోధము, ఉత్సాహము పట్టుదల కలుగజేసెను. మహమ్మదీయులు పూర్వాచారమును వీడక ఆంగ్ల విద్య నభ్యసించక, ఆధునిక యుగమున రాజకీయముగ వెనుకబడిరి. ఆ యవకాశమును తీసికొని ఆంగ్ల ప్రభుత్వమువారు, హిందువులవలె రాజకీయముగ, విద్యాభివృద్ధి, విజ్ఞానము, అధికారము పొందవలయునన్నచో మహమ్మదీయులు ఎక్కువగనున్న రాష్ట్రము ప్రత్యేకముగ లేనిచో మహమ్మదీయులు అభివృద్ధి చెందజాలరని వారిని హెచ్చరించిరి, బుజ్జగించిరి. ఏ కొందిమంది మహమ్మదీయులలో తప్ప బహుసంఖ్యాకులగు మహమ్మదీయ సోదరులు వంగదేశ విభజన అన్యాయమని ఘంటాపథముగ ఆందోళన గావించిరి. పెక్కురు మహమ్మదీయ నవాబులు, జాగీరుదారులు, సామాన్య ప్రజానీకము విభజనకు వ్యతిరేకముగ సురేంద్రనాథ బెనర్జీ, రాష్‌బిహారీ ఘోష్, బిపినచంద్ర పాల్ మొదలగు నాయకులకు అండగనుండి వంగవిభజనను రద్దుచేయించిరి. అప్పుడే స్వదేశీ ఉద్యమము, విదేశ వస్తు

బహిష్కరణ ఉద్యమములు తీవ్రముగ ప్రచార మయ్యెను. భారతదేశమున ప్రథమ రాష్ట్ర మహాజన సభ తూర్పు బెంగాల్ బారిసాల్ పట్టణమున సురేంద్రనాథ్ బెనర్జీ అధ్యక్షతను సమావేశమై భారతదేశమునకు నూత్నోత్సాహము, ఉత్తేజము కలిగి భారతీయులు జాతీయ ప్రబోధితులైరి. వంగదేశ విభజన రద్దయినదిగాని భారతదేశమున జాతీయ భావము దినదినాభివృద్ధి గాంచుచుండెను. ముఖ్యముగ వంగదేశమున విద్యార్థులు, యువకులలో తమ జననియగు భారతదేశమును స్వాతంత్ర్యముగ జేయవలయునను దృఢ సంకల్పము, దీక్ష మెండాయెను. అనేక వేలమంది యువకులు తమ దేశమునకు స్వాతంత్ర్యము వచ్చువరకు బ్రహ్మచారులుగ నుండ దీక్ష గైకొని రాజకీయ ఆశ్రమములు స్థాపించుకొనిరి. అనేకవందలమంది పాశ్చాత్య దేశములకు వెళ్ళి బాంబులు చేయుట, రైఫిల్లు, తుపాకులు ప్రయోగములలో శిక్షణపొంది వచ్చిరి. ఈ స్వాతంత్ర్య యోధులు జాతీయ ఉద్యమ ప్రచారము గావించుటకు, పఠన మందిరములు, గ్రంథాలయములు స్థాపించిరి. పెక్కు రాజకీయ గ్రంథములు, పత్రికలు ప్రచురించి ప్రజలను ప్రబోధించిరి ఈ పఠన మందిరములు, గ్రంథాలయములు అప్పటినుండియు దినదినాభివృద్ధి గావించెను.

బెంగాలు జాతీయ ఉద్యమ ప్రచారము, ఉత్సాహము, ఉద్రేకము, దీక్షను జూచి మహారాష్ట్రదేశమునుండి లోకమాన్య బాలగంగాధర తిలక్ మహాశయుడు, పాంచాల రాష్ట్రమునుండి, పాంచాల కేసరి లజపతిరాయ్ మహాశయుడు స్వయముగ వంగదేశమున కరిగి ఆ స్వాతంత్ర్య యోధులను దీవించి ఉత్సాహపరచిరి. అదేవిధముగ ఆ మహనీయులు తమతమ రాష్ట్రములలో పఠనమందిరములు, గ్రంథాలయములు స్థాపించియు ఫ్రెంచిదేశము, అమెరికాదేశము, ఐరిష్ దేశములయొక్క స్వాతంత్ర్య పోరాటముల చరిత్రలు, స్వాతంత్ర్య ప్రబోధము గావించు వార్తాపత్రికలు, కరపత్రములు ప్రచురించి యువకుల నుత్తేజపరచిరి. వంగదేశమువలెనే మహారాష్ట్ర, పాంచాల దేశములలోగూడ గ్రంథాలయోద్యమము దినదినాభివృద్ధి గాంచెను.

## ఆంధ్రప్రదేశ్

మన జన్మభూమియగు ఆంధ్రదేశమునందు సువర్ణయుగమగు బౌద్ధయుగమునందు బౌద్ధారామము లన్నిటియందు గ్రంథాలయము లున్నటుల చరిత్రలు చాటుచున్నవి ముఖ్యముగ అమరావతి, నాగార్జునకొండ సమీపమున విజయపురియందు గొప్ప గ్రంథాలయము లున్నటుల రుజువగుచున్నది. ఈ గ్రంథాలయములు కొన్ని వందల గజముల బారును, నాలుగు అంతస్థులు గల రమణీయ సౌధములయందు కొన్ని లక్షల గ్రంథరాజములతో నెలకొల్పబడినవి. ఈ గ్రంథాలయములు చైనా విజ్ఞాన యాత్రికుడగు ఫాహియాన్ దర్శించి కొన్ని సంవత్సరము లచట నివసించి బౌద్ధమత మహా గ్రంథములు చదివి తన్మయుడాయెను. తదుపరి చాళుక్యుల కాలమున రామరాయన ప్రభువు స్వయముగ తన దేశమున గ్రంథాలయములు స్థాపించి గ్రంథాలయ నిర్వాహకులకు మాన్యములిచ్చి పోషించెను.

నవ్య భావోదయ కాలమున ఆంధ్రప్రదేశ్‌యందు నూతనోద్యమములు తలలెత్తినవి. ప్రాచీన కాలమున మన మాతృభాషయగు ఆంధ్రభాషయందు భక్తి ప్రేరిత పురాణములు, రసవంతములగు కావ్యములు పెక్కులు గలవు. ఇవి విద్యావంతులకు మాత్రము చదువుటకు వీలుగనుండెడివి సామాన్య జనులకు పనికివచ్చు వచన గ్రంథములు మన భాషలో లేవు. ఆంధ్ర యుగపురుషుడగు శ్రీ కందుకూరి వీరేశలింగకవి వచన గ్రంథములు రచించి ఆంధ్రమాత నలంకరించిరి. ఇవియేగాక పలు సంస్కృత నాటకములు మన భాషలోనికి తర్జుమాజేసి ఆంధ్ర భాషా దేవిని పూజించెను. ఈ మహాపురుషుడు ఆంధ్రులను విద్యావంతులజేయుటకును. సాంఘిక దురాచారములు మాన్పుటకు నిరంతర కృషి చేసి ఆంధ్రుల కాదర్శప్రాయు డయ్యెను. శ్రీ గురిజాడ అప్పారాయ కవిచంద్రుడు వాడుకభాషలో

గ్రంథములు రచించి ఆంధ్రుల నుత్సాహపరిచెను. ఆంధ్ర సరస్వతీదేవిని నూత్నాభరణములతో నలంకరించెను. ఆ కవిచంద్రుని శిష్యుడైన గురిజాడ రామమూర్తి పంతులు వాడుకభాషా ప్రచారము తీవ్రముగ జేసి పెక్కు గ్రంథములు ప్రచురించి యీ మధ్యకాలముననే కన్నుమూసెను ఆ కవి చంద్రుల పవిత్ర ఉద్దేశములను సాఫల్య మొనర్చుటకు, సాహితీ సమితి, నవ్య సాహిత్య పరిషత్తులు, పెక్కు గ్రంథ ప్రచురణ సంస్థలు నేటికిని కృషి చేయుచుండుట ముదావహము.

భారత జాతి రాజకీయముగ వృద్ధిపొందించుటకు 1885 సంవత్సరమున ప్రభుత్వాదరణమున మొదటి కాంగ్రెస్ మహాసభ బొంబాయి నగరమున సమావేశమై, తమకు కావలసిన పలు రాజకీయ హక్కులను గూర్చి యేకగ్రీవముగ తీర్మానించిరి. అప్పటినుండియు భారతదేశమున రాజకీయ భావములు పెంపొంది జాతీయ భావములు మొలకలెత్తెను అప్పటినుండియు భారతీయు లందరికి ఏక జాతి యాభిప్రాయము కలిగి నూతనోత్తేజము కలిగెను. ఆ శుభ సమయముననే విశాఖపట్టణమున 1896 సంవత్సరమున సరస్వతీ పఠనమందిరమును మరిడెన ఆదినారాయణమూర్తిగారు స్థాపించి ఆంధ్రుల విజ్ఞానాభివృద్ధికి ప్రోత్సహించిరి. 1897 సం॥న పశ్చిమ గోదావరిజిల్లా భీమవరం తాలూకా కుముదవల్లి గ్రామములో నారోజీ గ్రంథాలయము స్థాపించి గ్రామ ప్రజలను తేజు గావించిరి. 1898 సం॥న గౌతమీ తీరమున శ్రీ వీరేశలింగ కవి గ్రంథాలయము రాజమహేంద్రవర నగరమున నెలకొల్పిరి. తదుపరి 2 సం॥లకు వసురాయ పుస్తక భాండాగారమును స్థాపించిరి. రెండును కలిపి గౌతమీ గ్రంథాలయముగా మార్చిరి 1901 సం॥న హైదరాబాదు నగరమునందు శ్రీ కృష్ణ దేవరాయ ఆంధ్ర భాషా నిలయమును స్థాపించిరి. 1889 సం॥న కడపజిల్లా పులివెందల గ్రామములో గ్రంథాలయమును స్థాపించిరి. ఆ సంవత్సరమున పశ్చిమ గోదావరిజిల్లా "ఉండి" అను గ్రామమునగూడ నొక గ్రంథాలయమును నెలకొల్పిరి. వందేమాతర ఉద్యమము భారత జాతిని మేల్కొల్పెను. ఆ యుత్సాహముతోనే భారతీయులు దేశభక్తి ప్రపూరితులై దేశమున విజ్ఞానాభివృద్ధి గావించ కృతనిశ్చయులై ఆంధ్రభూమియందు పట్టణముల లోను, గ్రామసీమలలోను పెక్కు గ్రంథాలయములు స్థాపించిరి. ఈ గ్రంథాలయము లన్నియు జాతీయభావము కల్గించి ప్రజలను స్వదేశీ యుద్యమాభిలాషుల గావించెను. హోంరూల్ లీగ్ ఉద్యమమును శ్రీ తిలక్, శ్రీమతి అనిబిసెంటు స్థాపించి భారత దేశమున ప్రచారము గావించినపుడు ఈ గ్రంథాలయములే యీ పవిత్ర ఉద్యమమునకు నిళయములై దేశీయులను దేశాభిమానులుగ పురిగొల్పెను. గుంటూరుపట్టణమున యువజన సాహితీ సంఘమును శ్రీయుతులు ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు, గొల్లపూడి సీతారామశాస్త్రి (స్వామి సీతారాం), వెలగపూడి వెంకట సుబ్బారావుపంతులు మొదలగు యువకులు 1903 సంవత్సరమున స్థాపించి యువకులలో నూతనోత్సాహము, జాతీయభావములు, దేశభక్తి కలిగించి, యిచటనే ప్రథమ ఆంధ్ర మహాసభ బాపట్లలో జరుపుటకు ఆహ్వాన సంఘ మేర్పడి, జయప్రదముగ శ్రీ బయ్యా నరసింహశర్మగారి యాధిపత్యమున ఆంధ్ర మహాసభ జరిపి ఆంధ్రదేశమునకు నూతన సందేశమును నవ్యభావములు, భాషా ప్రయుక్త రాష్ట్రములు యేర్పడవలయుననియు, ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రము యేర్పరచవలయుననియు 1913 సం॥న యేకగ్రీవముగ తీర్మానించి విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులు, కోపల్లె హనుమంతరావు పంతులు, పట్టాభి సీతారామయ్య పంతులు, ముట్నూరి కృష్ణారావు పంతులు, బులుసు సాంబమూర్తి మొదలగు దేశభక్తులు విశ్రామకృషిచేసి 1953 సం॥న ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారి నాయకత్వమున మన భారత జాతి ప్రియతమ నాయకులగు శ్రీ జవహర్‌లాల్ ఆశీర్వాదముతో, ప్రత్యేక ఆంధ్రరాష్ట్రమును కర్నూలు పట్టణమున సంతోషముగ నెలకొల్పుకొని మనము ధన్యుల మైతిమి. విజయవాడ నగరమున 1901 సం॥న రామమోహనరాయ గ్రంథాలయమును శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుపంతులు, శ్రీ సూరి నరసింహశాస్త్రి, శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగార్లచే స్థాపించి ఆంధ్రదేశము

నకు నూతనోత్తేజమును కలుగజేసిరి. 1914 సం॥న విజయవాడ పురమున ద్వితీయ ఆంధ్ర మహాసభ జరుగు శుభ సమయమున, ప్రథమ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహ కవిచంద్రుని యాధిపత్యమున జయప్రదముగ జరిపి, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమును స్థాపించి తదాది విశ్వదాత కాశీనాధుని నాగేశ్వరరావుపంతులు శ్రీ సూరి నరసింహంపంతులు, శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగార్లు నిర్విరామ కృషి మూలముగ ఆంధ్రదేశమున వేలకొలది గ్రంథాలయములు ఆంధ్ర యువకులు స్థాపించి, యీ పవిత్ర సరస్వతీ మందిరములద్వారా ప్రజలలో జాతీయభావములు, దేశభక్తి, విద్యాభిలాష కలుగజేసి ఆంధ్రదేశ స్వరూపమునే మార్చివేసిరి. ఆంధ్రదేశమున అన్ని జిల్లాలయందును ముఖ్యమగు పట్టణములలోను, గ్రామసీమల యందును గ్రంథాలయము లేర్పడెను. బ్రిటిష్ ప్రభుత్వము నిషేధించిన రాజకీయ గ్రంథములు పుస్తకముల జాబితాలో వ్రాయక వేరేవుంచి ప్రజలకు అందించుచు జాతీయ భావములు ప్రజలలో గల్గించిరి. గాంధిమహాత్ముడు భారత జాతీయ స్వాతంత్ర్య పోరాటమునకు నాయకత్వమును 1920 న వహించిరి. అప్పటినుండియు స్వాతంత్ర్య ఉద్యమమునకు గ్రంథాలయములే స్థావరముయ్యెను. జాతీయ పోరాటములలో స్వాతంత్ర్య యోధులు యీ సరస్వతీ మందిరము లున్న గ్రామముల నుండియే వేలకొలది యువకులు, యువతులు కారాగారములకు సంతసముగ వెళ్ళి పాశ్చాత్య దేశవాసుల నాశ్చర్యచకితుల గావించిరి మా స్వగ్రామమగు అమృతలూరు నందు 1917 సం॥ గ్రంథాలయము స్థాపించి పరిసర గ్రామముల నుత్తేజపరచెను. గ్రంథాలయమునకు ప్రతి సంవత్సరము ప్రభుత్వమువారు రు 400 లు విరాళము లిచ్చుచుండిరి. గ్రాంటు యిచ్చు సందర్భమున జిల్లా విద్యాశాద్యాశాధికారి గ్రంథాలయములు జూచి సిఫార్సు చేయుచుండెడివారు. ఒక సంవత్సరము సిఫార్సు చేయు సందర్భమున మా గుంటూరుజిల్లా విద్యాశాఖాధికారి (ఆంగ్ల దేశములో విద్య నభ్యసించిన భారతీయుడు) గ్రంథాలయము తనిఖీ చేయుటకు వచ్చి గ్రంథాలయమున నున్న దేశనాయకుల చిత్తరువులుజూచి, ఇది కాంగ్రెస్ కార్యాలయముగాని గ్రంథాలయము గాదని ప్రభుత్వ విరాళమును యిచ్చుట మానివేసిరి. ఇదేవిధముగ కృష్ణాజిల్లా అంగలూరు తూర్పు గోదావరిజిల్లా ఆలమూరు, పశ్చిమగోదావరిజిల్లా ఉండిగ్రామ గ్రంథాలయము, నెల్లూరిజిల్లా పొట్లపూడి గ్రంథాలయములును, ఇంకను కొన్ని వందల గ్రామములలో, యిదేవిధముగ గ్రంథాలయము లుండి ఆంధ్రదేశమున వేలకొలది స్వాతంత్ర్య యోధులు, స్వాతంత్ర్య సంగ్రామమున పాల్గొని భారతమాత దాస్య శృంఖలములు త్రెంచి, స్వాతంత్ర్య భారతమును నెలకొల్పుకొని ప్రపంచ వాసులచే కీర్తింపబడుచున్నాము.

ప్రజా నాయకుల ఆందోళన ఫలితముగ నేర్పడిన రాష్ట్ర గ్రంథాలయ శాసనము ననుసరించి ఆంధ్ర ప్రదేశమున అన్ని జిల్లాలలో కేంద్ర గ్రంథాలయములు, శాఖా గ్రంథాలయములు, కొన్ని వందలు స్థాపించి ప్రజలలో విజ్ఞానాభివృద్ధి గావించుట ముదావహము. ఎచట జిల్లా గ్రంథాలయ అధారిటీలకు దేశభక్తులు, ప్రజానాయకులు అధ్యక్షులుగ యెన్నుకొనబడిరో ఆ జిల్లాలలో గ్రంథాలయములు సంతృప్తికరముగ పనిచేయుచు ప్రజల మన్ననలను బడయుచుండెను. కాన జిల్లా అధారిటీలవారు ప్రజాసేవకులనే అధ్యక్షులుగ నెన్నుకొన హెచ్చరించుచున్నాను. గ్రంథాలయ శాసనము యిదివరకున్న గ్రంథాలయము లన్నిటికి ధన సహాయము చేయు వీలు కల్పించి గ్రంథాలయ సిబ్బందికి తగిన వేతనము లిచ్చినగాని ఉద్యమము అభివృద్ధి జెందదు.



# గ్రంథాలయోద్యమములో సహజీవన విధానం

శ్రీ కోదాటి నారాయణరావు, B. A., L. L. B.,





ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘాధ్యక్షులు, హైదరాబాద్ (సిటీ) యల్ యల్. ఎ., ఛైర్మన్ గారైన శ్రీ కోదాటి నారాయణరావుగారు

## అధ్యక్షోపన్యాసము

ఉత్తర సర్కార్లు కానీయండి, తెలంగాణము కానీయండి, రాయలసీమ కానీయండి, ఆంధ్రదేశ మంతటిలోను గ్రంథాలయోద్యమము ప్రజాఉద్యమముగా వర్ధిల్లింది. తాను ప్రజా ఉద్యమంగా వర్ధిల్లటమే కాదు అనేక సదుద్యమాలకు మాతృక అయిన గౌరవాన్నికూడా గడించుకొన్నది. పూర్వపుతరము రాజకీయ, సాంఘిక ఉద్యమాల నాయకు లందరూ దాదాపుగా గ్రంథాలయోద్యమంతో సన్నిహిత సంబంధము గలవారే. నేటి సాంఘిక, రాజకీయ ఉద్యమాలలోని ప్రముఖులలో చాలమంది గ్రంథాలయోద్యమంద్వారా ప్రజా సేవా రంగముతో పరిచయము కలుగజేసుకొన్నవారే. 20 వ శతాబ్దారంభంనుండి నేటివరకు అవిచ్ఛిన్నమైన ప్రజా ఉద్యమ స్వరూపం దక్కించుకొని పురోగమిస్తున్న ఏకైక ఉద్యమము గ్రంథాలయోద్యమము. అట్టి ఉద్యమానికి కాణాచియైన ప్రతిష్ఠను గడించుకొన్నది ఆంధ్రదేశము. ప్రకృతి ప్రసాదించిన సహజ సౌకర్యాలు తప్ప ప్రయాణాది సౌకర్యాలు కూడా లేని, చివరకు 15 రోజులదాకా టపాకూడా చేరని మారు మూలలలో అత్యల్ప విద్యాగ్రంథం గల నిరుపేద యువకులచేత నెలకొల్పబడినవి. అనేక గ్రంథాలయాలు. ఆంధ్ర పితామహులు మాడపాటి హనుమంతరావు గారన్నట్లు ఆంధ్ర దేశంలో గ్రంథాలయం అంటే దేశం నిమిత్తం పరితపించే ఒక ప్రాణి అని అర్థం. ప్రజలకొరకు ప్రజలచేత నెలకొల్పబడిన ప్రజాస్వామ్య మహోద్యమం గ్రంథాల యోద్యమం ఎట్టి ప్రభుత్వ సహాయాన్ని కోరక, పైగా ప్రభుత్వ నిరసనకు కొన్నిసార్లు ఆగ్రహానికి కూడా - గురియై అర్ధ శతాబ్దము పాటు పురోగమించింది యీ ఉద్యమం తిన్నగా.

గ్రంథాలయ శాసనావతరణంతో నూతన ఘట్టం ప్రారంభం అయింది గ్రంథాలయోద్యమ చరిత్రలో. ముక్కుసూటిగా వెళ్ళిన గ్రంథాలయోద్యమం మలుపు తిరిగింది. ప్రభుత్వ ఆగ్రహానికి నిరసనకు గురియైన గ్రంథాలయోద్యమం అనుగ్రహానికి, ఆదరానికి గురియైనదని సంతోషిం

చాము. అర్ధశతాబ్దపు ప్రజలకృషికి ప్రభుత్వపు గుర్తింపు లభించిందని సంతృప్తిపడినాము. తామర తంపగా గ్రంథాలయోద్యమం వర్ధిల్ల గలదని ఉవ్విళ్ళూరినాము.

స్వర్గీయులు కోదాటి రామకృష్ణారావుగారన్నారు ఒక పద్యంలో "సత్యధర్మ ప్రకాశకుని కంఠధ్వని ప్రాభవ్యక శాసన బద్ధమయ్యె" నని నట్లే యెట్టి లాంఛనములులేక సేవాభావమే ప్రధానంగా గల ఈ ఉద్యమం ప్రాభవ్యక శాసనబద్ధమైనదికాగా ప్రభుత్వ ఉద్యమాలకు సహజమైన లాంఛనప్రాధాన్యతా, బాహ్యాడంబరమూ, ముఖ్యమైన వాటికి నానాటికి ఈ ప్రాముఖ్యత హెచ్చుజొచ్చినది. ఐచ్ఛికమైన సేవా ప్రవృత్తి సన్నగిల్లుతున్నది. ఆ నివృత్తిలోనే ప్రజల ఆదరాభిమానలన్నూ, తగ్గుతున్నట్టు కనిపిస్తున్నది.

కాలానుగుణ్యంగా వచ్చే మార్పు సహజమైంది. ఒక ప్రత్యేక వాతావరణంలో ప్రజాసేవను ఆరంభించిన తరంవారికి ఈ మార్పు కొంత బాధగా అనిపించదు. సహజము కాని మార్పు అనివార్యమైనది. రామరాజ్యమును తిరిగి స్థాపింతుమని ఉవ్విళ్లూరిన స్వాతంత్ర్య యోధులలో చాలామందికి ప్రస్తుత పరిస్థితులు ఆశాభంగం కలిగించినా ఏమి చేయగలరు? అట్లే గ్రంథాలయోద్యమంలో

---

మనకన్నా ముందు జీవించిన ప్రతిభావంతులైన, గొప్పవారైన, విశిష్టులైన మహా మనీషుల యొక్క సలహాలు లభించేది గ్రంథాలయం-అదే ఒక పవిత్రారామం!

—జి. దాసన్

---

నానాటికి కరిగిపోతున్న సేవా భావపుస్థితినిచూస్తే గ్రంథాలయోద్యమపు పాత సేవకులు వేదనపడవచ్చు కాని ఈ నాడది మనకు సమస్యకాదు. కాలానుగుణ్యమైన అనివార్యమైన మార్పు అది.

ఇప్పుడొకటే మనను ఎదుర్కొన్న సమస్య: ఆంధ్రదేశమంతటా ప్రజలు నెలకొల్పుకున్న గ్రంథాలయాలు నిర్వర్తిస్తున్న సేవను ఈ నాడు ఆంధ్రప్రదేశ గ్రంథాలయ శాసన ప్రకారము నెలకొన్న లోకల్ లైబ్రరీ అధారిటీలు ఒంటరిగా నిర్వహించగలవా? అని. ఆ విధంగా ప్రజా గ్రంథాలయాలు నిర్వర్తిస్తున్న సేవాస్థానాన్ని లోకల్ లైబ్రరీ అధారిటీల గ్రంథాలయాలు ఆక్రమించగలిగితే, కానున్న పనిని గంధర్వులు తీర్చినట్లని మనము సంతోషించవచ్చు.

కాని అది అసంభవము కాదని తేలిపోయినది. ప్రస్తుతము లభిస్తున్న లైబ్రరీ సెస్ వలన ప్రభుత్వ సహజమైన లాంఛనలతో లోకల్ లైబ్రరీ అధారిటీలు నిర్వర్తించగల సేవ అత్యల్పమైనది. పైగా నానాటికీ, విపరీతముగా పెరిగిపోతువున్న విద్యాతృష్ణతో పోల్చిచూస్తే మన లోకల్ లైబ్రరీ అధారిటీల పురోగమన వేగం తాబేటి నడక కన్న మందమైనది.

ప్రజలు తమంతట తాము గ్రంథాలయాలు స్థాపించుకొన్ననాటి ఉత్సాహము నానాటికి సన్నగిల్లుతోంది. నిర్బంధముగా సెస్ తీసుకుంటునప్పుడు ఐచ్ఛికమైన ఔదార్యము ఎందుకు చూపవలెనని చందా దారులు అనుకుంటున్నారు. సెస్ యివ్వటంవల్ల ఉచిత గ్రంథాలయ సేవను పొందే హక్కూ, అధికారమూ తమకు శాసనమూలంగా

లభిస్తున్నప్పుడు ఎందుకని డబ్బివ్వడం మరి? గ్రంథాలయ సేవచేసినందువల్ల జీత భత్యాలు హోదా ఒక ప్రక్కన లభిస్తున్నప్పుడు తానెందుకు ఉచితంగా రెక్కలు బొక్కలు విరుచుకొని చాకిరి చేయడం అని గ్రంథాలయ సేవకుడు అనుకొంటున్నాడు. ఈ విధమైన భావాలు ఉత్పన్నమౌతున్నవి గ్రంథాలయోద్యమ క్షేత్రంలో. ఐతే ఈ పరిస్థితి అన్ని సేవా రంగాలలోను ఇంతకంటె ఎక్కువగానే ప్రస్ఫుటమౌతున్నది.

గ్రాంటుల రూపముగా లభిస్తున్న సహాయము సముద్రంలో నీటి బిందువులాగున్నది. నూరు రూపాయలకు మించిన గ్రాంటులు లభించే గ్రంథాలయాల సంఖ్య వేళ్ళపై లెక్క పెట్టవచ్చు. లోకల్ లైబ్రరీ అధారిటీలు తమ గ్రంథాలయ నిధులనుండి గ్రంథాలయాలకు గ్రాంటుల నిస్తున్నట్టు కనిపించటంలేదు. స్వల్పమైన ప్రభుత్వపు గ్రాంటులు పొందాలన్నా ఎన్నో నిర్బంధాలు లాంఛనలతో కృత్యాద్యవస్థ పడవలసివస్తున్నది. ఈ గ్రాంటులవలన గ్రంథాలయాలకు లభించే సహాయము చెప్పుకోదగినంత ప్రయోజనకారిగా లేదు. లోకల్ లైబ్రరీ అధారిటీల సేవ ప్రజావసరాలను తీర్చే స్థాయిలో కాదు, సరికదా ప్రస్తుతము ప్రజా గ్రంథాలయాలు నిర్వర్తిస్తున్న సేవా స్థానాన్ని ఆక్రమించవలెనన్న రెండు దశాబ్దాలకు కూడ కాని పని అనిపించుచున్నది. గ్రంథాలయాలను నెలకొల్పటము నిర్వహించటముపట్ల ప్రజలకుగల ఉత్సాహము క్రమేణా సన్నగిల్లుతున్నది. ప్రజా ఉద్యమాల పట్ల ఆదరభావము తగ్గకున్నా, ఔదార్యము తగ్గుతున్నట్టే కన్పిస్తున్నది. ఈ పరిస్థితులలో గ్రంథాలయోద్యమ సేవకులమైన మనము నిర్వహించగల పాత్ర యేమిటి? ప్రజా గ్రంథాలయాలకు, లోకల్ లైబ్రరీ అధారిటీలకు మధ్య సహజ జీవనాన్ని నెలకొల్పగల మార్గం యేమైనా ఉన్నదేమో పరిశీలించాలి. ప్రజా గ్రంథాలయాల నిర్వహణలో కలిగే ఆర్థిక యిబ్బందిని తట్టుకోవడం కష్టం. చందాలు పూర్వమువలె వసూలు కావు. లోకల్ లైబ్రరీ అధారిటీ గ్రంథాలయాలలో సేవా భావము కొద్దిగా క్రొత్తగా అగుపిస్తున్నది. నిర్వర్తించే సేవకన్న ఆడంబరం ఖర్చు జాస్తి. ప్రజా గ్రంథాలయాలలో గల సేవాభిలాషకు ప్రజాదరణకు లోకల్ లైబ్రరీ అధారిటీలలోగల గ్రంథాలయ నిధికి లంకెను కలుపలేమా? ప్రజా గ్రంథాలయాలను క్రమబద్ధంచేసి ఉచిత గ్రంథాలయ సేవను కొంతవరకైనా వాటిద్వారా నిర్వర్తించుట అసంభవము కాదు.

> పుస్తకాల ప్రేమికునికి ఒక మంచి గ్రంథాలయానికన్నా మించింది లేదు.
>
> —జె. ఎ. లేంగ్ ఫర్డ్

గ్రంథాలయ శాసనరీత్యా ప్రజలకు చెందవలసినది ఉచిత గ్రంథాలయసేవ, ప్రజా గ్రంథాలయాలు యిదివరకే ఉచిత పఠన మందిరాలను నిర్వర్తిస్తున్నది. ఇక నిర్వహించవలసినది పుస్తకాలను ఉచితంగా అరువివ్వటము. ప్రస్తుతం కొంత మేరకు ఈ పనినికూడ నిర్వర్తింప జేయవచ్చు లోకల్ లైబ్రరీ అధారిటీల తోడ్పాటుతో.

చందాలతోనూ, విరాళాలతోనూ నిర్వహింపబడే గ్రంథాలయాలను లోకల్ లైబ్రరీ అధారిటీలకు అనుబంధించే ఒక పద్ధతిని ఏర్పరచవొచ్చు. ఈ విధంగా అనుబంధను చేయుటంవలన గ్రంథాలయాల వ్యక్తిత్వానికి, స్వాతంత్ర్యానికి భంగము కలుగరాదు. అవి స్వేచ్ఛగా చందాలను

వసూలు చేసుకొనవచ్చును. తమ నియమావళి రీత్యా నిర్వహింపబడవచ్చు. ఇట్టి పద్ధతి ఒకటి స్థూలంగా ఆలోచించి గ్రంథాలయ శాస్త్రవేత్త అయిన శ్రీ ఆచార్య యస్. ఆర్ రంగనాథన్ గారికి నివేదించగా వారు తమ అంగీకారాన్ని వెల్లడించారు. హైదరాబాదు సెమినార్ సందర్భములో అందులో కొన్ని ముఖ్యమైన అంశాలను స్థాలీపులాకంగా సూచిస్తున్నాను. వీటిపై ఆలోచించవలసిందిగా మిమ్ములను కోరుతున్నాను. నచ్చితే వివరాలలో కొన్ని మార్పులు చేసుకొన్నా చేసుకొనవచ్చు పరిస్థితులననుసరించి.

అనుబంధిత గ్రంథాలయాలకు కావలసిన మౌలికమైన కొన్ని అర్హతలను నిర్ణయించవచ్చు. ఉదాహరణంగా గ్రంథాలయ శాసనంలో గల పబ్లిక్ లైబ్రరీ నిర్వచనం అన్వయింపబడగల్గి ఉండాలి. (2) అట్టి గ్రంథాలయము ఆంధ్ర ప్రదేశ్ గ్రంథాలయ సంఘంలో సభ్యత్వము వహించాలి. (3) జాతి మత వివక్షత లేకుండా అందరికి ప్రవేశం ఉండాలి. (4) ఉచిత పఠన మందిరాన్ని నిర్వహించాలి మొదలయినవి.

ఇట్టి కనీస అర్హతలుకలిగిన గ్రంథాలయాలు అనుబంధముకొరకు లోకల్ లైబ్రరీ అథారిటీను అభ్యర్థించాలి. పరిశీలన పిదప లోకల్ లైబ్రరీ అథారిటీలు అనుబంధించు కొనవచ్చును. అనుబంధిత గ్రంథాలయాలు లోకల్ లైబ్రరీ అథారిటీలు అందించు పుస్తకాలను లోకల్ లైబ్రరీ అథారిటీల నియమాలప్రకారము ప్రజలకు అందించాలి. అంటే అంతమేరకు లోకల్ లైబ్రరీ అథారిటీల ఏజన్సీగా వ్యవహరించవలెనన్నమాట. మిగతా విషయాలలో అనుబంధిత గ్రంథాలయం తన స్వంత నియమాల ప్రకారం ప్రవర్తించవచ్చు.

---

ఈ రోజుల్లో ఒక మంచి గ్రంథాలయమే ఒక విశ్వ విద్యాలయం.

—కార్ లైల్

---

లోకల్ లైబ్రరీ అథారిటీలు ఈ అనుబంధిత గ్రంథాలయాలకు వారానికో పక్షానికో మరీ దూరమైతే, నెలకో ఒకసారి పుస్తకాలను పంపించటము తెప్పించుకోవటము జరుపాలి. అందుకయ్యే ఖర్చు తామే భరించవలెను ఎప్పుడు 100 పుస్తకాలయినా అనుబంధిత గ్రంథాలయంలో నిలువ ఉండేట్లు చూపవలెను. తడవకు కనీసము 30 పుస్తకాలయిన పంపిస్తూ ఉండవలెను. స్థానికావసరాలనుబట్టి లోకల్ లైబ్రరీ అథారిటీ స్థోమతనుబట్టి ఈ సంఖ్యను పెంచుకొనవచ్చును.

కేంద్ర గ్రంథాలయం లేక శాఖా గ్రంథాలయంనుండి అన్ని రకాలైన ముఖ్య గ్రంథాలను అనుబంధిత గ్రంథాలయాలకు అందునట్లు చూడవలయును. కేంద్ర గ్రంథాలయంలో గల కేటలాగును వీలైతే పుస్తకరూపములో ఈ గ్రంథాలయాలకు అందించవలయును. నిఘంటువుల వంటి అత్యవసర ఆచూకి గ్రంథాలను కనీస సంఖ్యలోనైనా ఎల్లప్పుడు ఉంచవలయును. స్థానికావసరాలనుబట్టి ప్రజల నభిలాషను ఉన్నతపరిచే పత్రికలను కొన్నిటిని తెప్పించి గ్రంథాలయాలకు అందించవలయును, లేదా పఠనమందిర నిర్వహణలో కొంత భాగం ఖర్చును భరించవలయును. గ్రంథాలయ సేవకుని అలవెన్సు క్రింద నెల 1 కి కనీసము రు 30 యివ్వవలయును. సంపూర్ణంగా సమయంవచ్చే అర్హత గల గ్రంథ పాలకుడై వేతనములో సగ

భాగము వరకున్నూ భరించవచ్చును. స్థలం విశాలము లేకపోతే గ్రంథాలయాన్ని అర్హమైన వసతికి మార్చే పక్షములో అద్దెలో సగము భరించవచ్చును. ఈ విధమైన సబ్సిడీలు గ్రంథాలయాల కిచ్చే యితర గ్రాంటులకు అభ్యంతరకరం కారాదు.

## ప్రయోజనాలు

ఈ పద్ధతి ఆచరణలో పెట్టటంవల్ల కలిగే ప్రయోజనాలలో, అన్నిటికన్న అగ్రగణ్యమైనది, సంప్రదాయ సిద్ధంగా గ్రంథాలయంగా గౌరవింపబడుతున్న సంస్థ ద్వారా, గ్రంథాలయ సేవ జేయుటము. అక్కడి గ్రంథాలయానికిగల చారిత్రిక ప్రశస్తి ఏమైనావుంటే దానిలో భాగస్వామ్యం లోకల్ లైబ్రరీ అథారిటీకి లభిస్తుంది. పాత ఉద్యమాన్ని తుడిచివేసి ఆ సమాధిపైన క్రొత్త గ్రంథాలయాన్ని నిర్మిస్తున్నారనే అనుమానం గ్రంథాలయ కార్యకర్తలకు రాకుండా కాపాడగలుగుతున్నాము. చిరకాలంగా, గ్రంథాలయోద్యమ సేవనే ఆదర్శంగా పెట్టుకొని, అనుభవం గడించి స్థానికంగా అభిమానం చూరగొన్న కార్యకర్తలు సేవాభావంవల్ల లాభం పొందగలుగుదుము. చిరకాలంగా ఉద్యమానికి గల చరిత్ర మన కన్ను చెదురుతుంది

చివరకు ఆర్థికంగాను చాలా మిగులు చేకూరగలుగుతుంది. ఒక సామాన్యమైన అనుబంధిత గ్రంథాలయానికి కృష్ణాజిల్లాలో ఇవ్వవలసిన సబ్సిడీలు లెక్కవేసి చూదాము.

---

నా వద్ద ఏమైనా డబ్బు వుంటే దానితో పుస్తకాలు కొంటాను. పుస్తకాలు కొనగా డబ్బు మిగిలితే దానితో తిండి, బట్ట సమకూర్చుకుంటాను

—ఎరాస్ మస్

---

గ్రంథపాలకుని అలవెన్సు నెల 1 కి రు 30/

| | |
|---|---|
| సంవత్సరానికి | రు 360-00 |
| పత్రికలకు సంవత్సరానికి | రు 150-00 |
| రిజిష్టర్లు, ఫారాలు స్టేషనరీ మొ॥ | రు 50-00 |
| అద్దెలో సగం వంతు నెల 1 కి రు 25/ | రు 300-00 |
| ఇతరములు | రు 140-00 |
| మొత్తం | రు 1000-00 |

కృష్ణాజిల్లాలో 24 గ్రంథాలయాలను లోకల్ లైబ్రరీ అథారిటీ అనుబంధించుకుంటే అయ్యే ఖర్చు, సబ్సిడీలు కాక అదనపు సిబ్బంది.

| | |
|---|---|
| 1 గ్రేడు III గ్రంథ పాలకులు 2 | రు 2,000-00 |
| 2 పుస్తకాలు పంపించుటకు 2 | |
| మెసెంజర్సు | రు 1,400-00 |
| మొత్తం వేతనాలు | రు 3,400-00 |
| ప్రయాణం ఖర్చులు | రు 250-00 |
| రిజిష్టర్లు స్టేషనరీ మొ॥ | రు 250-00 |
| ఇతరములు | రు 250-00 |
| షుమారు | రు 3,950-00 |
| పుస్తకాలు ప్రతి గ్రంథాలయానికి 100 చొ॥ 24 గ్రంథాలయాలకు 2,400. ప్రతి పుస్తకానికి సగటు ఖరీదు రు 3 చొ॥ | రు 4,000-00<br>రు 7,200-00 |
| బైండింగు మొ॥ | రు 800-00 |
| మొత్తం | రు 12,000-00 |
| సబ్సిడీలు మొత్తం | రు 24,000-00 |
| | రు 36,000-00 |

సగటున ప్రతి గ్రంథాలయంపైన రు 1500/- లోకల్ లైబ్రరీ అథారిటీకి ఖర్చు అవుతుంది. దానితో ఒక మంచి గ్రంథాలయాన్ని నడిపిన

వారమవుతాము. 24 శాఖా గ్రంథాలయాలు నెల కొల్పితే, అయ్యే ఖర్చు చూదాము. ప్రతి శాఖా కార్యాలయానికి కనీస సిబ్బంది.

| | | |
|---|---|---|
| 1 గ్రేడు 3 గ్రంథ పాలకుడు | రు | 1,000-00 |
| 1 బుక్ బేరరు లేక అటెండరు | రు | 750-00 |
| 1 నైట్ వాచరు | రు | 500-00 |
| | రు | 2,250-00 |
| అద్దె నెం 1 కి రు 50/- కనీసం చొ॥ | | 6,00-00 |
| పత్రికలకు కనీసం | | 2,400-00 |
| 500 పుస్తకములు సగటున పుస్తకం 1 కి రు 3/- | | 1,500-00 |
| రిజిష్టర్లు, స్టేషనరీ ఫారాలు టపా మొ॥ | | 200-00 |
| ప్రయాణం ఖర్చులు నాదకు | | 200-00 |
| | రు | 7,150 |

ఇదిగాక, సూపర్వైజరు సిబ్బంది కనీసం ఈ దిగువ విధంగా అవసరం కాగలదు.

| | | |
|---|---|---|
| గ్రేడు I గ్రంథ పాలకులు 2 | రు | 3,600-00 |
| గ్రేడు II గ్రంథ పాలకులు 2 | రు | 2,000-00 |
| మెస్సెంజర్సు 2 | రు | 1,400-00 |
| ప్రయాణం ఖర్చులు మొ॥ | రు | 1,000-00 |
| స్టేషనరీ | రు | 2,000-00 |
| కంటింజెన్సీ | రు | 500-00 |
| | రు | 10,500-00 |
| ప్రతి శాఖా గ్రంథాలయానికి రు 7,150 చొ॥ 24 గ్రంథాలయాలకు | | 1,71,600-00 |
| | రు | 1,82,100-00 |

సగటున ప్రతి గ్రంథాలయానికి రు 7,587 చొ॥న ఖర్చు కాగలదు. ఒక శాఖా గ్రంథాలయానికి పట్టిన ఖర్చుతో 5 అనుబంధిత గ్రంథాలయాలను నిర్వహించవచ్చును. ఫర్నిచరు మొదలైన కాపిటల్ పద్దులు ఉభయత్రా చూడవలెను.

## అనుబంధిత గ్రంథాలయాలకు ప్రయోజనాలు

ప్రతి గ్రంథాలయానికి సగటున రు 1000/- లభించటమే కాకుండా పుస్తకాలపైన అధిక వ్యయం తెలియకుండా లోకల్ లైబ్రరీ అథారిటీ వారు పంపే గ్రంథాలు లభించగలవు. ఈ విధంగా చాలా లాభం తగ్గిపోతుంది. లాభం పొందే పాఠకులను సభ్యులుగా కూడా చేర్చుకోవచ్చు. పుస్తకాలు చాల దొరుకుతున్నప్పుడు సంప్రదాయం చొప్పున చందాదార్లుగా చేసుకోటానికి వెనుదీయరు. సంవత్సరానికి సగటు ఖర్చు తగ్గుతుంది. ఆదాయం పెరుగుతుంది.

అన్నిటికన్న పెద్ద ప్రయోజనం లోకల్ లైబ్రరీ అథారిటీకి, ప్రజా గ్రంథాలయోద్యమానికీ సహజీవనం ద్వారా పరస్పర సహకారం ద్వారా అభివృద్ధిచెందే అవకాశం లభిస్తుంది.

ఈ విషయాన్ని సానుభూతితో ఆలోచించవలసిందిగా గ్రంథాలయ సేవకులకు హృదయపూర్వకముతో అర్థిస్తున్నాను.

---

మించు విజ్ఞాన జలధిఁ దేలించు నావ
మంచి చెడ్డల గతు లేర్పరించు త్రోవ
మానసిక రోగముల నెల్ల మాన్పుమందు
పొగడఁదగు విందు నీకెందుఁ బుస్తకంబె.

—వెంకట పార్వతీశ్వర కవులు

# కార్యదర్శి నివేదిక

శ్రీ వేములపల్లి చంద్రశేఖరరావు, B. A. D. L. SC.,

గ్రంధాలయోద్యమమును రాష్ట్ర మందంతటను వ్యాప్తిచేసి ప్రజలందరకు గ్రంధముల నుపయోగించు నవకాశ మేర్పరచి వారి జ్ఞానాభివృద్ధికి దోహదం చేయుటయే ప్రభుత్వంవారి ఆశయము. నిర్మాణాత్మకంగా, సమగ్ర పధకాలు రూపొందించి యీ కార్యక్రమమును చేపట్టుటకు మద్రాసు ప్రభుత్వమువారు 1950 లో గ్రంధాలయ శాసనములు తయారుచేసి అమలులోకి తెచ్చిరి.

ఈ శాసనం ద్వారా ఏర్పడినవే లోకల్ లైబ్రరీ అధారిటీ కమిటీలు 1950 సంవత్సరములో ప్రధమముగా కృష్ణాజిల్లాలో యీ కమిటీకి ఎన్నికలుజరిగి, డాక్టర్ ఆర్. అచ్చుతరామయ్యగారు M. B. B. S., ఛైర్మన్‌గా ఎన్నిక అయిరి. శ్రీ యమ్. నాగేశ్వరరావుగారు (D. E. O.) యీ కమిటీకి సెక్రటరీగా నుండిరి.

ప్రభుత్వము, ప్రజల సహకారముతో గ్రంధాలయాభివృద్ధి చేయుటకు యీ కమిటీ కృషిచేయ నారంభించినది. జిల్లా యందు బ్రాంచి గ్రంధాలయములు ప్రారంభించుటకు, బందరులో జిల్లా కేంద్ర గ్రంధాలయమును స్థాపించుటకు పబ్లిక్ గ్రంధాలయములకు ప్రభుత్వ గ్రాంటు సంపాదించుటకు కృషిచేసిరి

ఆర్థికస్థోమత తక్కువగా నుండుటచే సంస్థ కార్యక్రమములు చురుకుగా సాగనందున ప్రభుత్వంవారు, 8000 రూపాయలు గ్రాంటు మంజూరుగా అడ్వాన్సు యిచ్చియున్నారు.

1953 - 54 సంవత్సరములకు ప్రధమ బడ్జెట్టు 80,000 లకు అంగీకరించబడినది. ఒక గుమాస్తా, ఒక జవాను పోస్టులతో ది. 3-7-53 న బందరులో జిల్లా కేంద్ర గ్రంధాలయమును ప్రారంభించిరి.

ఈ కమిటీవారు వారి పదవీ కాలమందు జిల్లా యందు గ్రంధాలయ వుద్యమ వ్యాప్తికి గట్టి పునాదులువేసి ఆర్థిక స్థోమతను చేకూర్చి గ్రంధాలయ ప్రగతికి దోహదకారులైరి. ఇట్లుచేసిన ఆ కమిటీవారు యెంతయు అభినందనీయులు.

## రెండవ కమిటీ

ది. 20-2-54 న జరిగిన ఎన్నికలో రావుబహద్దూర్ శ్రీ కె. జి. బాబురావు M. A L L B., (Retired Judge) గారు ఛైర్మన్ అయినారు. యీ కమిటీ హయాంలో కొంత కాలం శ్రీ పాత్రోగారు తర్వాత శ్రీమతి శీతారావమ్మగారు (డి. ఇ ఓ' లు) సెక్రటరీలుగా పనిచేసియున్నారు.

ఈ కమిటీవారు ది. 3-4-54 న సమావేశమై 1954-55 సం॥ బడ్జెట్ అంచనాలు ఆమోదించి జిల్లాలోని తాలూకా కేంద్రములలో బ్రాంచి గ్రంధాలయములు స్థాపించుటకు కేంద్ర గ్రంధాలయ భవనమును కట్టించుటకు తీర్మానములు చేసినారు.

గ్రంధాలయ సక్రమ పరిపాలనకు నిబంధనలు తయారు చేయుటకు ది. 31-8-55 సమావేశమందు ముగ్గురు సభ్యులతో ఒక సబ్‌కమిటీని ఏర్పరచిరి. గ్రంధాలయోద్యమము నిర్మాణాత్మకంగా వ్యాప్తిచేయుటకు కమిటీవారు కృషి చేసి రనుటకు ఇదొక నిదర్శనము.

ఈ మూడు సం॥ము లలో ఛైర్మన్‌గారు, సభ్యులు, సెక్రటరీగార్లు గ్రంధాలయ అభివృద్ధికి చక్కని కృషి సల్పి 12 బ్రాంచి గ్రంధాలయములను, డెలివరీ స్టేషన్‌లను నెలకొల్పి జిల్లా ప్రజలలో చైతన్యమును కలుగచేసిరి.

## మూడవ కమిటీ

1957 లో మూడవదఫా తిరిగి ఎన్నికలు జరిగినవి. శ్రీ జి నాగేశ్వరరావు బి. ఏ., గారు ఛైర్మన్‌గా కమిటీ ఏర్పడినది. వీరికాలములో శ్రీమతి సీతారావమ్మ, శ్రీరాయర్ గారు, శ్రీ యు. సత్యన్నారాయణ చౌదరి, శ్రీ గురునాథం, శ్రీవీరయ్యచౌదరిగార్లు సెక్రటరీగా పనిచేసిరి. ఎ పి.పి.యల్. ఆక్టు 1960 ప్రకారముగా జిల్లా కేంద్ర గ్రంథాలయ అధికారులే కార్యదర్శు లైనందున అప్పటి జిల్లా లైబ్రరియన్ అయిన శ్రీ టి. సుబ్రమణ్యంగారు తదుపరి సెక్రటరీగా నుండిరి.

ఈ కమిటీవారు జిల్లా కేంద్ర గ్రంథాలయములో పిల్లల గ్రంథాలయము, గుడివాడలో మహిళా గ్రంథాలయమును ప్రప్రథమముగా ప్రారంభించి మహిళలకు, పిల్లలకు గ్రంథముల నుపయోగించు నవకాశము నేర్పరిచిరి. ఇది గ్రంథాలయ ఉద్యమ వ్యాప్తికి లోకల్ లైబ్రరీ అథారిటీ చరిత్రలో హర్షించదగిన విషయము.

ప్రతి గ్రంథాలయమునకు సం॥నకు 500 రూపాయలు దిన, వార పత్రికలకూ మంజూరుచేసిరి. ఇందువల్ల చదువరులకు ఎక్కువ సౌకర్యములు కలుగుటయేగాక వారిలో పఠనాభిలాషవృద్ధి చెందినది.

గ్రంథాలయోద్యమము మారుమూలనున్న గ్రామములకు వ్యాప్తిచేయుటకు 16 డెలివరీ స్టేషనులు స్థాపించిరి. పంచాయితీలనుండి గ్రంథాలయ సెస్సును రాబట్టుటకు యీ కమిటీవారు యెంతయో కృషి సల్పినారు.

గ్రంథాలయ స్థాపనోద్దేశమును వాటి ఉపయోగములను ప్రజలకు తెలియబర్చుటకు వీలుగాను, వారిని గ్రంథాలయములవైపు ఆకర్షించి, వారి విజ్ఞానాభివృద్ధికి అవకాశము కల్గించుటకుగాను యీ ఉద్యమవ్యాప్తికి ముఖ్య కార్యక్రమమైన వార్షికోత్సవములు జరిపించి, సాంస్కృతిక ప్రదర్శనలు ఏర్పాటు చేయుటకు ధనమును కేటాయించినారు. ఇట్టి చర్యలద్వారా ప్రజలకు గ్రంథాలయములకు సన్నిహిత సంబంధము కల్గించినారు.

గ్రంథాలయ విస్తృత కార్యక్రమము క్రింద జిల్లా కేంద్ర గ్రంథాలయములో రేడియోను నెలకొల్పి యున్నారు. లోకల్ లైబ్రరీ అథారిటీ ఖర్చులపై గ్రంథాలయోద్యోగులను గ్రంథాలయ శాస్త్రమందు తర్ఫీదుపొందు నిమిత్తం ఆంధ్ర యూనివర్సిటీ కాలేజీలకు డెప్యూటు చేసియున్నారు. మరియు డిపార్టుమెంట్ ప్రారంభము నుండియు గ్రంథాలయోద్యోగులకు మంజూరు చేయవలసిన యింక్రిమెంట్లను క్రొత్త స్కేల్సు పరికారము ఇవ్వవలసిన బకాయీ జీతములను కొద్దిమందికితప్ప చెల్లించి గ్రంథాలయోద్యోగులకు యెంతో మేలుచేసి నిరాశా, నిస్పృహలతో నున్న వారికి నూతనోత్సాహమును కలుగచేసిరి. వారి విద్యుక్త ధర్మములను ఉత్సాహముతో నెరవేర్చుటకు దోహదమిచ్చిరి

గ్రంథాలయోద్యమములో స్త్రీలకు ప్రత్యేక గ్రంథాలయమును స్థాపించి పురుషులతో సమానావకాశములు కలుగచేసిన ఖ్యాతి యీ జిల్లాకు వచ్చునటుల చేసిరి.

1953 - 54 సం॥ము నందు 85,000 రుపాయలతో బడ్జెట్టు తయారుచేసిన యీ సంస్థ 1960-61 సం॥ములో రు. 3,70,907 - 57 తయారుచేసి గణనీయమైన అభివృద్ధి గాంచుటకు సర్వవిధముల కృషిచేసి యున్నది.

విజయవాడ మున్సిపాలిటీవారు 1 లక్ష రూపాయల ఖర్చుతో చిరస్మరణీయులైన రాజర్షి రవీంద్రనాథ్ టాగూర్ పేర ఒక గ్రంథాలయ భవనమును నిర్మించి లోకల్ లైబ్రరీ అథారిటీవారికి స్వాధీనము చేయుటకు నిర్ణయించి అందుకు స్థలమును కూడ సేకరించినారు. లోకల్ లైబ్రరీ అథారిటీ వారు ఈ నిర్ణయమును అంగీకరించి ఆ కమిటీ వాటాయైన 50,000 రూ॥లనుకూడ మున్సిపాలిటీవారికి యిచ్చియున్నారు. ఈసంస్థయీకార్యమునందు నేటివరకును ఎంత శ్రద్ధతీసుకొనినను యీకార్యము సాఫల్యము కానందుకు విచారించవలసి యున్నది. కాని త్వరలో యీభవన నిర్మాణము పూర్తియగునట్లు తెలియుచున్నది.

ఈ కమిటీవారుచేసిన మహత్తర కార్యములను చెప్పవలసిన అవసరమున్నది. వేలసంఖ్యలో విలువగల

గ్రంధములు, ఫర్నిచరుగల అనేక గ్రంధాలయములు భవనములతో స్వాధీనపరచుకొని యీ సంస్థకు ఆస్థులను చేకూర్చిరి ఈ కార్యము సాధించుటలోను జిల్లాయందు గ్రంధాలయవ్యాప్తికి అప్పటి సెక్రెటరీగారైన శ్రీసత్యన్నారాయణ చౌదరి ఛైర్మన్ అయిన శ్రీ జి నాగేశ్వరరావుగార్ల కృషియే కారణము. ఇందులకు వీరిని అభినందించవలసియున్నది నిద్రావస్థలోనున్న గ్రంధాలయోద్యమ వ్యాప్తికి వీరు చేసిన కృషి లోకల్ లైబ్రరీ అథారిటీ గ్రంధాలయ చరిత్రలో మరువరానిది.

## నాల్గవ కమిటీ

1962 వ సం॥ములో యీ కమిటీ ఎన్నికలు జరిగి 20-6-62న శ్రీ కలపాల సూర్యప్రకాశరావుగారు ఛైర్మన్‌గా ఎన్నికైరి. అప్పటినుండి మే 61 వరకు శ్రీ టి. సుబ్రమణ్యంగారు సెక్రటరీగా యుండిరి. తదుపరి శ్రీ వి. చంద్రశేఖరరావుగారు సెక్రటరీగా పనిచేయుచున్నారు.

శ్రీ సూర్య ప్రకాశరావుగారు కమిటీవారి సహాయంతో నిస్వార్ధసేవ చేయుటకున్నూ, గ్రంధాలయోద్యమమును జిల్లా కంతకు వ్యాప్తిచేయవలయునని సంకల్పముతో నిరంతరకృషి చేయుచున్నారు. పంచాయితీలనుండి సెస్సును వసూలుచేయుటకు వీరు చేయుచున్నకృషి శ్లాఘనీయమైనది.

గ్రంధాలయోద్యోగులను సమావేశపరచి గ్రంధాలయ వ్యాప్తికి వారి అభిప్రాయములను తెలిసికొని, నిస్వార్ధముతో నిజాయతీగాను, తమ ఉద్యోగ ధర్మములు నిర్వర్తించి ప్రజలు, గ్రంధాలయములను ఉపయోగించుకొనుటకు వారిలో చైతన్యము కలుగచేయవలసినదిగా వారికి తెలియచేసినారు. దేశ ఆత్యయిక పరిస్థితి యందు గ్రంధాలయోద్యోగుల పాత్రనుగురించి విశదీకరించి రక్షణనిధికి కొంతధనమును ఉద్యోగుల తరుపున వసూలుచేసిరి.

పల్లె ప్రాంతములందు మారు మూలలందు ప్రజలకు సైతము గ్రంధాలయమును ఉపయోగించు అవకాశమును కల్పించుటకు యీ కమిటీవారి ఆశయము. అందులకై చల్లపల్లి, కానుమోలు బ్రాంచి గ్రంధాలయములకు అనుబంధముగా సంచార గ్రంధాలయములు ప్రారంభించి ఆ పరిసర గ్రామవాసులకు పుస్తకములు సరాఫరా చేయబడుచున్నవి. మరియు యీ సంవత్స రాంతములోగా 5 సంచార గ్రంధాలయములు స్థాపించుటకు ఆలోచనలో నున్నది.

గృహకార్యములలో నిమగ్నులై గ్రంధాలయములకు వచ్చుటకు మహిళలకు తీరికయుండదు. అందువలన ప్రప్రధమముగా గుడివాడ గ్రంధాలయమునకు అనుబంధముగా సంచార గ్రంధాలయము ప్రారంభించి టాక్సీసహాయంతో గుడివాడ మహిళలకు గ్రంధాలయము నుపయోగించు నవకాశము చేకూర్చబడినది. ఇవిగాక 45 డెలివరీ స్టేషనులను యీ సంవత్సరము ప్రారంభింప నిర్ణయించ బడినది.

పంచాయితీ, ప్రవేటు గ్రంధాలయములకు 1962-63 సంవత్సరములో ప్రభుత్వపు గ్రాంటును 11000 రూ॥ లకు పైగా మంజూరు చేయించబడి 150 గ్రంధాలయములకు గ్రాంటు ఇవ్వబడినది. ఇంత మొత్తము లోగడ ఎప్పుడూ మంజూరు కాలేదు. ముఖ్యముగా ఛైర్మన్‌గారి శ్రద్ధవలననే యీ కార్యము నెరవేర్చబడింది.

జిల్లాకేంద్ర గ్రంధాలయ భవనము చాలక చదువరులకు సదుపాయములునరిగాలేనందున మే నెలలో వేరొక భవనములోనికి మార్చబడినది. దీని ఫలితముగా చదువరుల సంఖ్య 200 నుండి 400 వరకు పెరిగినది.

1962-63 సం॥నకు షుమారు 35,000 ఖరీదు చేయు ఉత్తమ గ్రంధములు ఖరీదు చేయబడెను.

గవర్నమెంటువారి ఉత్తర్వు ప్రకారము గ్రంధాలయాధికార్లకు యివ్వవలసిన బకాయి జీతములు షుమారు 10,000 రూపాయలకుపైగా మంజూరు చేయబడి చెల్లించడమైనది.

ప్రస్తుతం యీ జిల్లాలో కేంద్ర గ్రంధాలయంగాక, 45 బ్రాంచి గ్రంధాలయములు, 24 డెలివరీ స్టేషనులుకలవు. ఇందులో 13 గ్రంధాలయములు గిఫ్టుగా యివ్వబడినవి.

8 గ్రంథాలయ భవనములకు ఆ గ్రామ పంచాయితీవారు అద్దె లేకుండా ఏర్పాటుచేసిరి.

ఈ గ్రంథాలయములలో మొత్తము 138 మంది సిబ్బంది పనిచేయుచున్నారు. గ్రేడు 1 లైబ్రరీయన్స్ 4 గురు, గ్రేడు 2 లైబ్రరీయన్స్ 7 గురు గ్రేడు 3 లైబ్రరీయన్స్ 37 గురు అటెండర్లు 31, జవాన్లు 14, నైటువాచర్లు 45 గురు కలరు.

జిల్లాకేంద్ర గ్రందాలయములో షుమారు 8000 ప్రతి బ్రాంచి గ్రంథాలయములోను 3000 నుండి 5000 వరకు పుస్తకములుకలవు. క్రొత్తగాప్రారంభించిన గ్రంథాలయములకు కాక మిగతా గ్రంథాలయములన్నిటికి సరిపడు ఫర్నిచరు సప్లయి చేయబడినది. క్రొత్తగా ప్రారంభించిన గ్రంథాలయములకు యీ సంవత్సరములో ఫర్నిచరు సప్లయిచేయుటకు నుద్దేశింపబడినది. అదియును గాక గ్రేడు 1 గ్రంథాలయాలైన, విజయవాడ, గుడివాడ జిల్లా కేంద్ర గ్రంథాలయములకు ప్రత్యేకమైన ఆధునిక సదుపాయములుగల రాక్సు, రీడింగ్ టేబుల్సు ఖరీదుచేయుట గురించి పరిశీలించుచున్నాము.

సిబ్బందికి జీత భత్యములక్రింద షుమారు లక్ష రూపాయలు, పుస్తకములకు 80 వేలు, పర్నిచరుకు 20 వేలు భవన అద్దెలకు టి. ఎ. లకు, పత్రికలు మొదలైన వాటికి 1 లక్ష రూపాయలు. మొత్తము 3 లక్షలుపైచిలుక ఖర్చు అగును.

## ప్రస్తుతమున్న బ్రాంచి గ్రంథాలయములు అవి స్థాపించిన సంవత్సరములు

కృష్ణాజిలా కేంద్రగ్రంథాలయ స్థాపితం 3_7_1953

| గ్రామము పేరు | పుస్తకముల సంఖ్య |
|---|---|
| **1954** | |
| తిరువూరు | 4,795 |
| అవనిగడ్డ | 4,952 |
| గన్నవరం | 4,845 |
| గుడివాడ | 5,566 |
| నూజివీడు | 4,259 |
| కైకలూరు | 4,789 |
| నందిగామ | 4,778 |
| **1955** | |
| పామర్రు | 4,461 |
| జగ్గయ్యపేట | 4,432 |
| చల్లపల్లి | 4,378 |
| పెడన | 4,231 |
| విజయవాడ | 4,856 |
| ఇనకుదురు | 4,362 |
| కపిలేశ్వరపురం | 4,307 |
| **1956** | |
| మైలవరం | 4,156 |
| పెనుగంచిప్రోలు | 4 491 |
| గుడ్లవల్లేరు | 4,211 |
| ఉయ్యూరు | 4,352 |
| **1957** | |
| తేలప్రోలు | 2,742 |
| కవుతరం | 3,319 |
| చిలకలపూడి | 3,153 |
| చందర్లపాడు | 3,371 |
| **1959** | |
| ఆతుకూరు | 5,322 |
| వెంట్రప్రగడ | 2,480 |
| పెదకళ్ళేపల్లి | 2,370 |
| ఘంటసాల | 4,825 |
| డోకిపర్రు | 3,491 |
| చౌటపల్లి | 4,784 |
| కానుమోలు | 2 959 |
| పురుషోత్తమపట్నం | 2,700 |

| | |
|---|---|
| మల్లవోలు | 2,467 |
| కొణకంచి | 4,087 |
| **1960** | |
| పిల్లల గ్రంథాలయం (బందరు) | 230 |
| **1961** | |
| మహిళా గ్రంథాలయం | 1,786 |
| జొన్నగొల్వేపల్లి | 5,536 |
| సత్యన్నారాయణపురం (విజయవాడ-2) | 2,598 |
| అనిగెళ్ళపాడు | 1,400 |
| కంచికచెర్ల | 1,202 |
| **1962** | |
| విస్సన్నపేట | 1,420 |
| గంపలగూడెం | 1,411 |
| పెనుగొలను | 2,429 |
| యలమర్రు | |
| **1963** | 5,418 |
| తెన్నేరు | 2,700 |
| ముదునూరు | 3,800 |
| గండ్రాయి | 500 |

## సంచార గ్రంథాలయములు

చల్లపల్లి

కానుమోలు

గుడివాడ (మహిళా గ్రంథాలయం)

బ్రాంచి గ్రంథాలయములు ఎక్కువగా స్థాపించుటకు ఆర్థిక కారణములచే వీలుపడదు. జిల్లా అంతటకు గ్రంథములను అందరు ఉపయోగించునట్లు చేయవలెనని మా ఆశయము. ఈ ఆశయము నెరవేర్చుటయే ఎలాగనేది ప్రస్తుత సమస్య. గ్రంథాలయోద్యమాన్ని జిల్లా అంతటకు వ్యాపింపజేసి అందరకు గ్రంథములు చదువుకొను అవకాశము కల్పించి వారి జ్ఞానాభివృద్ధికి తోడ్పడుటయే మా లక్ష్యము. ఈ ఆశయంతో అనేక పథకములు రూపొందించుచున్నాము. ఈ ఆశయ సాఫల్యతకే తమబోటి పెద్దల సలహాలుపొంది, నిర్మాణాత్మక పథకములు రూపొందించుట 'ఈ సెమినారు' ఏర్పాటు చేయబడినది. ఈ సభలో ఎందరో పెద్దలున్నారు. గ్రంథాలయోద్యమంలో తమ జీవితములను అంకితంచేసిన మహనీయులున్నారు మీ అందరి సలహాలు, సహాయం లభించగలదని ఆశిస్తున్నాను.



# గ్రామాలలో గ్రంథాలయాలు



శ్రీ కాకాని వెంకటరత్నం, M. L. A.

ఆంధ్ర ప్రదేశ్‌లో గ్రంథాలయాభివృద్ధిని గూర్చి నూతనముగా మార్గాలు అన్వేషించి సామాన్య ప్రజానీకానికి "ఉపయోగపడు విధముగా మారుమూలలకు గ్రామాలకు కూడ తీసుకొని పోవలసిన బాధ్యత ప్రతివారిపైన ఉన్నది. ముఖ్యముగా పంచాయితీలకు పంచాయితీ సమితులకు హెచ్చు బాధ్యత లున్నవి.

1. ప్రతి పంచాయితీ తన ఆఫీసుతోపాటు, చిన్నది గాని, పెద్దది గాని గ్రంథాలయమును ఏర్పాటు చేసి చదువరులు వచ్చునటులు ప్రోత్సహించాలి.

2. ప్రభుత్వము చేసిన గ్రంథాలయ చట్టము ననుసరించి లోకల్ లైబ్రరీ అథారిటీవారు నెలకొల్పు గ్రంథాలయాలు కాక, ఫిర్కాకో, సమితికో, ఒక సెంటరును తీసికొని వారానికొకసారి ప్రతి గ్రామానికి వెళ్ళి గ్రంథాలు యిచ్చి పుచ్చుకొను ప్రచార పద్ధతి అవలంబించాలి.

3. ఇక సెకండరీ స్కూళ్ళలోనున్న గ్రంథాలయములు, ప్రభుత్వము విద్యార్థులకు ఎంతవరకు ఉపయోగపడుచున్నదనే విషయము ఆలోచించాలి. సెకండరీ స్కూళ్ళ విద్యార్థుల కుపయోగపడు విధముగా మానేజిమెంటు వారు సిలబసును మార్చాలి.

4. ఉన్నత విద్య నభ్యసించు కాలేజి విద్యార్థులకు ఆ కాలేజీలోనున్న గ్రంథాలయములు ఉపయోగపడుచున్నదనుటలో ఏ మాత్రము సంశయము లేదు. అన్ని రంగాలలో విజ్ఞానార్జనతో వారి కృషిని బట్టి పైకి పోతున్నారు. యిన్ని రకాలుగా గ్రంథాలయాలున్నాయి. అవి ప్రజల విజ్ఞానాభివృద్ధికి ఎంత తోడ్పడుచున్నను అంతగా చాలలేదంటే అతిశయోక్తి ఏమియూ లేదు

గ్రంథాలయాలకు వెళ్ళుచున్న వారిలో అనేక రకాలవారుంటారు. వారి అభిరుచులకు తగిన గ్రంథాలను, గ్రంథాలయపాలకవర్గమువారు సాధ్యమైనంతవరకు సమకూర్చి పెట్టాలి.

స్వాతంత్ర్యానంతరం దేశ కాల పరిస్థితులను బట్టి రాజకీయ, ఆర్థిక, సాంఘిక విషయాలలో గ్రంథ పఠనాసక్తితో గ్రంథాలయాల సంఖ్య

దాని ననుసరించి పాఠకుల సంఖ్య దిన దినాభివృద్ధి చెందుచున్నది.

యీ నాడు గ్రామాలలోగాని, పట్టణాలలో గాని గ్రంథాలయాలకు పఠనాసక్తితో వెళ్ళువారిని ఐదు తరగతులుగా విడదీయవచ్చును.

1. ఆర్థిక, సాంకేతిక విజ్ఞాన రంగాలలోను, శాస్త్రి విజ్ఞానముతోను తమ తమ జీవితమంతయు గ్రంథాలయాలలో వెళ్ళబుచ్చుచూ విజ్ఞాన వేత్తలుగా నూతన దృక్పథాలతో ప్రజలకు మార్గము చూపించగల ధీశాలురైన కోవకు చెందు విజ్ఞాన వేత్తలు.

2. దేశ రాజకీయ, అంతర్జాతీయ, ఆర్థిక, సాంఘిక విజ్ఞాన రంగాలలో ముందంజవేస్తూ చక చక సాగిపోతున్న అభివృద్ధికరమైన చరిత్రాత్మకమైన ప్రపంచ విజ్ఞాన అనుభవము సంపాదించి దేశ సేవా రంగములలో సేవాభావముతో పని చేయుచున్న విజ్ఞానవేత్తలు

3. నవలలు, నాటకాలు, కథలు చదువుటలోనే తృప్తిచెంది విద్యాభివృద్ధి పెంపుచేసుకొను ఆసక్తిగలవారు కొందరు.

4. గ్రంథాలయాలున్న ప్రదేశాలకు వెళ్ళి పాఠకులనడిగి రాజకీయమైన దేశీయ, అంతర్జాతీయ వార్తలు తెలిసికొను నిరక్షరాస్యులు, పెద్దలు, యువకులు, తెగకు చెందినవారు. గ్రామాలలో యీ నాటికి కొందరు బుద్ధిమంతులు వార్తలు తెలిసికొనుటకు గ్రంథాలయాలకు వెళ్ళేవారున్నారంటే ఆశ్చర్యపడనవసరము లేదు.

5. పై నుదహరించిన నాల్గు వర్గాలవారు గ్రంథాలయాలవల్ల ఎంతటి విజ్ఞానాన్ని సంపాదించుతున్నారో, తాను ఆర్జించిన విజ్ఞానాన్ని ప్రజా సేవకు ఏ విధముగా వినియోగించు చున్నారో మనము చూస్తున్న విషయమును అందరికి తెలిసినదే కదా ? కాలేజి, సెకండరీ, ప్రైమరీ స్కూళ్ళలో కొలది విద్యార్థులు విద్యను పొందుచున్నారు.

అనేక కారణాలతో విద్యను ముగించువారు గ్రామాలలో గ్రంథాలయ సౌకర్యాలు లేక తాము చదివిన చదువులను గ్రంథాలయాలకు అప్పగించు చున్నారు.

విజ్ఞాన రంగానికి నిలయమైన గ్రంథాలయాలుంటే, విద్యార్థి దశలో పొందిన విద్యను మరింత పెంపొందించుకొనుటకు అవకాశములుంటవి.

ఇంతేగాక గ్రామాలలోగాని, పట్టణాలలోగాని ఉదయము లేక సాయంత్రము తీరిక వేళలలోకూడ గ్రంథాలయాలకువెళ్ళి, రాజకీయ, ఆర్థిక, సాంఘిక రంగాలలో పరస్పరము చర్చించుకొనుట అవసరం.

వందలకొలది సోదరీమణులు తాము పొందిన విద్యను ముగించి, సాంఘిక మర్యాదల ననుసరించి సంసారిక జీవితాలు గడుపుచున్నారు. అట్టి వారందరికి గ్రామాలలోగాని పట్టణాలలోగాని ఏ

---

పుస్తకాలను సేకరణం చేటలో కాని పుస్తకాలను సేవ కాని. చదవటానికి బ్రతుకు కాని బ్రతకటానికి చదవవద్దు.

—బుల్వర్

మాత్రమూ గ్రంథపఠనావకాశములులేవు. గ్రంథాలయ పాలక వర్గము ప్రచారము ననుసరించి వారానికొకసారి గ్రంథాలు యిచ్చి పుచ్చుకొను ఏర్పాటు చేయించిన ఎనలేని సౌకర్యము కలిగి స్త్రీలలో విజ్ఞాన మెంతో అభివృద్ధి చెందుతుంది.

కృష్ణా జిల్లా లోకల్ లైబ్రరీ అధారిటీవారు ప్రచారము ద్వారా జిల్లాలో కలిగించు చున్న విజ్ఞానాభివృద్ధిని మిక్కిలి ప్రశంసించు చున్నాను.

త్రోపుడు బండ్లపై యింటింటికి గ్రంథాలను తీసికొనివెళ్ళి యిచ్చి పుచ్చుకొను ఏర్పాట్లు చేసినందుకు వారినెంతో అభినందించు చున్నాను. అంతటితో చాలదు. గ్రంథాలయాభివృద్ధికి విప్లవకరమైన మార్పు తీసుకురాదలచినందుకు సంతోషించుచున్నాను.

ప్రతి గ్రామ పంచాయితీ తన ఆర్థిక పరిస్థితుల ననుసరించి ప్రతి పల్లెలోను గ్రంథాలయమును స్థాపించి ప్రజలలో విజ్ఞానాభివృద్ధికి పూర్తిగా తోడ్పడవలెనని మనవి చేయుచున్నాను.

జై హింద్!

---

ఈ రోజుల్లో ఒక మంచి గ్రంథాలయమే ఒక విశ్వవిద్యాలయం.

—కార్ లైల్

---

# పుస్తకాల తస్కరణ సమస్య

వెలగా వెంకటప్పయ్య, B. A., D. L. SC.

తెనాలి

ప్రజలలో విజ్ఞాన ప్రచారం చేసి సాంఘికంగా, నైతికంగా వారి స్థాయి పెంచేందుకు గ్రంథాలయాలు కృషిచేస్తున్నవి. ఇందునిమిత్తం గ్రంథాలయాలలో పుస్తకాలు, పత్రికలేగాక ఫిల్ములు, పటాలు, ఆటల పరికరాలు మొదలయినవి ప్రవేశపెట్టబడి విజ్ఞాన వ్యాప్తికి యితోధికంగా తోడ్పడుతున్నాయి. పుస్తకాలకు, పరికరాలను క్రమబదంలో పెట్టేందుకు, చదువరి కీ పఠన సామగ్రికి సంధానం కలిగించేందుకు గ్రంథాలయాధికారి తోడ్పడుతున్నాడు. కనుక పుస్తకాలు, చదువరి, గ్రంథాలయాధికారి-యీ త్రయం కలయిక వలన, గ్రంథాలయంవలన ఆశించిన ఫలితం పొందటానికి అవకాశం కలుగుతోంది.

తాను బాగుపడి పరులను బాగుచేయాలనే పవిత్ర సంకల్పంగల యీ గ్రంథాలయ వ్యవస్థలో కొంతకాలంగా కారుచీకట్లు అలముకొంటున్న వాతావరణం కనిపిస్తోంది. ఇది గ్రంథాలయానికే గాక, గ్రంథాలయంలో పనిచేస్తున్న సిబ్బందికి కూడ యిబ్బంది కలిగించి, విజ్ఞాన ప్రచారమందు నిస్పృహా, జీతమందు నిరాశ కలిగిస్తున్నాయి. ఈ బృహత్తర సమస్య గ్రంథాలయాలు నిర్వహించువారికి తెలియనిదికాదు. అదే గ్రంథాలయంలో దొంగిలించబడుతున్న పుస్తకాల సమస్య. దీనినిగురించి కొన్ని విషయాలు ఎప్పుడు తెలుసుకుందాం. కేవలం ప్రజల బాగుకోసం ఏర్పడిన గ్రంథాలయంనుంచి పుస్తకాలను, పత్రికలను చదువుకోడానికి వచ్చిన ప్రజలు తస్కరించే అలవాటు మన దేశంలోనే కాదు, అన్ని దేశాలలో ఉంది. ప్రజలలో నైతికస్థాయి యెంతో హెచ్చుగా ఉంటుందనుకొన్న అమెరికా, బ్రిటన్, మొదలయిన దేశాలు సైతం యీ దురాగతాన్ని సమూలంగా అరికట్టలేకపోయినవి. వాస్తవానికి దీనిని పూర్తిగా అరికట్టే శక్తి ఆ యా దేశాలకు లేకపోలేదు. పుస్తకాల ఉపయోగంలో మరెన్ని కట్టుదిట్టాలుచేసి ఒక్కటికూడ పోకుండా చేయటం చేతగానిపనిగాదు. కాని యీ ప్రయత్నాలు తీవ్రతరం అయ్యేకొలది విజ్ఞాన ప్రచారం సన్నగిల్లే ప్రమాదం ఉన్నది. ఏ పవిత్ర ఉద్దేశంతో గ్రంథాలయాన్ని స్థాపించామో అది వాస్తవము అయ్యే పరిస్థితి ఏర్పడుతుంది. అందుకోసమే పాశ్చాత్య దేశాలలో విజ్ఞాన ప్రచారం, పుస్తకాలు పోవటం, యీ రెంటిలో మొదటిదానికే విశేష ప్రాధాన్యం యివ్వటంవలన రెండవదాని విషయం అట్టే పట్టించుకోవటంలేదు.

కాని మన దేశంలోని గ్రంథాలయాలలో పుస్తకాలు ఏ కారణంచేతయినా పోయినప్పుడు ఉద్యోగరీత్యా బాధ్యులుగావున్న వ్యక్తులపై అపరాధం పడక తప్పటంలేదు. గ్రంథాలయంలో ఉద్యోగంవలన జీవితానికి ఏది ఉపయోగమున్నా

లేకపోయినా ఉద్యోగం అంతానికి అష్టకష్టాలకు గురికావటం తప్పనిసరి అవుతోంది.

ఈ సందర్భంలో గ్రంథాలయంనుంచి పుస్తకాల పోకడకు సంబంధించిన కొందరి వ్యక్తులను గురించి కొన్ని విషయాలు చర్చించటం అవసరమని భావిస్తాను. సాధారణంగా పుస్తకాలయానికి వచ్చే చదువరులు మూడు తరగతులుగా ఉంటారు.

గ్రంథాలయ ప్రయోజనాన్ని పూర్తిగా తెలుసుకొనిన, నైతికస్థాయి గలవారు మొదటి తరగతికి చెందుతారు. విజ్ఞాన సముపార్జన వీరి జీవితాశయం. వీరిని గ్రంథాలయంలోని ఏ విభాగానికి పోనిచ్చినా, ఏ పుస్తకం తీసుకొన్నా వీరి విషయం ఆలోచించ పనిలేదు. వీరికి తస్కరణ ఆలోచన ఏ కోశాన ఉండదు. అనుభవంమీద యీ తాలూకు పెద్దలను సులభంగా గుర్తించవచ్చు.

అపరిపక్వ మనస్కులు, అపరిణత బుద్ధులు యీ రెండవ తరగతిలో మిక్కుటంగా ఉంటారు. వీరిలో ఎక్కువ భాగం విద్యార్థులుగూడ ఉంటారంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు. గ్రంథాలయానికి రావటం వీరు మంచి మనస్సుతోనే వస్తారు ఇచటగల వారికి నచ్చిన పుస్తకాలు, పత్రికలలోని బొమ్మలు, వీరి చర్యలను అంతగా గమనించని పరిసరాలు యీ దుశ్చర్యకు పురిగొల్పుతాయి. వీరికి పనికివచ్చిన ప్రతిదీ స్వంతం చేసుకోవాలనే తాపత్రయం యీ పనికి ప్రోత్సహించుతుంది. కాని వీరి చర్య యాదృచ్ఛికమైనది. స్వతస్సిద్ధమైనది, సహజమైనది కాదు. గ్రంథాలయ సిబ్బంది మరింత జాగ్రుతగా ఉండటం మూలంగా వీరి చర్యలను చాలవరకు తగ్గించవచ్చు.

ఈ చివరి తరగతివారు కేవలం చోరులు. అందరివలె గ్రంథాలయానికి వచ్చి పుస్తకాలను చదువుతున్నట్లు నటించి వాటిని కాజేస్తారు ఈ విధంగా దొంగిలించిన పుస్తకాలను తూకానికో, సెకండ్‌హ్యాండ్ పుస్తకాల షాపువానికో అమ్మి సొమ్ము చేసికొని జీవయాత్ర సాగిస్తూఉంటారు. వీరు గ్రంథాలయానికి నిజమైన శత్రువులు. దేశద్రోహులు వీరిని కనిపెట్టి కఠినమైన చర్య తీసుకోవటం చాల అవసరం. వీరిని గమనించటానికి కేవలం గ్రంథాలయ సిబ్బంది శక్తి చాలదు. పట్టపగలు కన్నుగప్పి దోచుకుతినే వీరిని పసిగట్టడానికి తెలివైన పోలీసుల సాయంగూడ అవసరం.

పైన వివరించిన చివరి రెండు తరగతుల వ్యక్తుల పరంగా ఎక్కువ పుస్తకాలు పోతూ ఉంటాయి మొదటి తరగతి వ్యక్తులవలన పుస్తకాలు పోవుగాని ఏమైనప్పటికి మన జాగ్రత్తలో మనం ఉండటం మంచిది. ఇప్పుడు పుస్తకాలు పోవటానికి కారణాలను తెలుసుకొందాము.

## స్వేచ్ఛోపలబ్ధి

విజ్ఞాన పరిధిలో విషయాలవారీగా అమర్చబడిన పుస్తకాలలో తనకు నచ్చినవాటిని చదువరి ఎంచుకొని తీసుకొనే సదవకాశాన్ని స్వేచ్ఛోపలబ్ధి (ఓపెన్ యాక్సెస్) అంటారు. ఇరవైయ్యో శతాబ్దంలో విశేషంగా ప్రచారంలోకి వచ్చిన యీ పద్ధతి పలువురి ప్రశంసల నందుకొన్నది. విజ్ఞాన ప్రచారం ప్రధానంగా పెట్టుకొన్నట్టి గ్రంథాలయము యీ పద్ధతికి స్వాగతం చెప్పక తప్పదు. పుస్తకాలు స్థానభ్రంశం

చెందటం, ఆతర్వాత మాయమవటం యీ పద్ధతిలో జరుగుతూఉంటాయి. దీనిలో అపూర్వమయిన ఉపయోగం వలన దీనిని వదలుకోలేకుండా ఉన్నారు. పుస్తకాలు పోతున్నవనే నెపంతో స్వేచ్ఛోపలబ్ధికి తిలోదకాలిస్తే గ్రంథాలయ ప్రయోజనమే దెబ్బతింటుంది.

## భవనాలు

నేడు మన రాష్ట్రంలోగల స్థానిక గ్రంథాలయ సంస్థలు నిర్వహించే భవనాలలో ఎక్కువ భాగం స్వంతవిగాని, అద్దెవిగాని గ్రంథాలయానికి ఉపయోగించే విధంగా నిర్మించినవికావు ఉన్న వానిలో ఏదోవిధంగా సర్దుకుపోతున్నారు. గ్రంథాలయంలో ప్రవేశానికి, బయటికి పోవటానికి ఒకే వాకిలి. పుస్తకాలకు, పఠనమందిరానికి, రికార్డులకు అనువైన గదులు లేకపోవటంవలన, వీటిని క్రమబద్ధంలో అమర్చటానికి అవకాశంలేక కప్పల తక్కెడగా వీటి ఏర్పాటు ఉంటోంది. ఈ లోపాలను పుస్తక తస్కరులు అవకాశంగా ఉపయోగించుకొంటున్నారు.

## సిబ్బంది

నేడు మన దేశంలోని ప్రతి శాఖ పునర్వ్యవస్థీకరణలో ఉంది. కనుక తగినంత ఆర్థిక స్థోమత లేకపోవటంచేత అవసరమయినంత సిబ్బందిని నియమించటానికి వీలులేకపోతున్నది. గ్రంథాలయాలకుగూడ యీ అవస్థ తప్పటంలేదు. అయిదారువేల పుస్తకాలు గలిగి, రోజుకు 400 వరకు చదువరులు వస్తున్న గ్రంథాలయాన్ని ఒక గ్రంథాలయాధికారి, ఒక ప్యూనుచే పనిచేయించిన సందర్భాలున్నవి. మామూలుగా ప్రతి గ్రంథాలయంలో ఉండే పుస్తకాలను ఎరువిచ్చు విభాగము, ఆచూకీ విభాగము, పఠన మందిరము, శాలల విభాగము, ఉత్తర ప్రత్యుత్తరాలు, మొదలయినవన్నీ ఒకే వ్యక్తి చూడాలంటే సాధ్యమా? అతను వేయికండ్లతో కనిపెట్టుకొని ఉన్నప్పటికి పుస్తకాలు కొన్ని తనకు తెలీకుండా పోతున్నప్పుడు గమనించటం సాధ్యమవుతుందా? అనేక బాధ్యతలతో పనిచేస్తున్న స్థానిక గ్రంథాలయ సంస్థల గ్రంథాలయాధికారి పరిస్థితిని తప్పక పరిశీలించాలి.

## ప్రజలు

గ్రంథాలయంలో పోతున్న పుస్తకాలకు కారణం అచటికి చదువుకోడానికి వచ్చిన పాఠక మహాశయులే! నిత్యం పల్లెలలో, పట్నాలలో జరిగే దొంగతనాలను ఏ చట్టం, ఏ సాంఘిక కట్టుబాటు ఆపలేకపోయినట్లే పుస్తకాల విషయంలో అరికట్టటం కష్టం. ప్రజలలో నైతికశక్తి పెరిగి గ్రంథాలయాన్ని ఒక పవిత్ర ఆస్థిగా భావితరాల వారికి ఉపయోగించే మహానిధిగా గుర్తించిననాడే యీ దురాగతం సన్నగిల్లడానికి అవకాశం ఉంది.

లోకమంతా బాగుపడిందాకా మనం వేచియుండక పుస్తకాల పోకడ మనం సాధ్యమయినంతవరకు తగ్గించటానికి యీలోగా కొన్ని ఏర్పాట్లు చేసుకోవాలి దీనికి గ్రంథాలయ పాలక వర్గమువారు పూర్తిగా సహకరించాలి. నిత్యం ఎదురౌతున్న సమస్యలను సానుభూతితో పరిశీలించాలి.

గ్రంథాలయంలో ఉన్న పుస్తకముల సంఖ్యనుబట్టి, పని ఒత్తిడినిబట్టి పని సాధ్యమయినంతవరకు తక్కువగానున్న రోజులలో సంవత్స

రానికి ఒకసారిగాని, రెండు సంవత్సరాలకు ఒక సారిగాని పుస్తకములను సరిజూడాలి. బాగా చిరిగి పోయినవి, యికముందు వాడుకకు పనికిరానివి, శాశ్వతంగా భద్రపరచటానికి అవసరం లేనివి పాలకవర్గమువారి అనుమతితో గ్రంథాలయం నుండి తొలగించాలి. పుస్తకములు సరిచూచి నప్పుడు కనిపించని పుస్తకములను అప్పటివరకు ఎరు వివ్వబడిన ప్రతి వెయ్యి పుస్తకములకు మూడిటివరకు స్వేచ్ఛోపలబ్ధిగల గ్రంథాలయంలో గ్రంథాలయంనుంచి తొలగించవచ్చునని గ్రంథాలయ శాస్త్ర తత్త్వవేత్త డాక్టర్ రంగనాథన్ అభిప్రాయపడుతున్నారు. అనుభవంతో చెప్పిన అపూర్వమయిన యీ అభిప్రాయాన్ని స్థానిక గ్రంథాలయ పరిస్థితులు అమలుజరిపిన ఎంతో సమంజసంగా ఉంటుంది.

అంతేగాక ఏ తరహాకు చెందిన పుస్తకములు పోతున్నవో గమనించి వాటిపై ప్రత్యేకంగా కన్నువేసి ఉంచటం అవసరం మామూలు పుస్తకములంటే మరీ చిన్న సైజు పుస్తకములను ఆర్టుపేపరుపై ముద్రించిన చిత్రకళా ఖండాలను, యింకను అపూర్వమయిన అసాధారణ గ్రంథాలను ప్రత్యేకంగా భద్రపరచి వాటిని యిచ్చి పుచ్చుకోవటంలో ఎంతో జాగ్రత్త వహించాలి. అప్పుడప్పుడు పుస్తక తస్కరులపై ప్రత్యేక నిఘా ఉంచి వారిని పట్టుకొని తీవ్రమయిన శిక్షలు వేయించాలి. వారి దురాగతాన్ని, సంఘ విద్రోహ చర్యను నలుగురికి తెలిసేట్టు ప్రచారం చెయ్యాలి కాని ఒకవిషయంలో మాత్రం కాస్త ముందు వెనుకలు ఆలోచించాలి. ఈ ప్రచార కార్యక్రమంలో చదువరి హృదయం ఏమాత్రం గాయపడకుండా చూడాలి.

గ్రంథాలయాలకు ఆధునిక పద్ధతులపై ప్రత్యేకమయిన భవనాలు నిర్మించాలి. అద్దె భవనాలకు సాధ్యమయినంతవరకు మనకు అవసరమయినట్లు మలచుకొనే ఏర్పాట్లు చేసుకోవాలి. గ్రంథాలయానికి ఉన్న అన్ని హంగులతోబాటుగా అవసరమయినంత సిబ్బందిని నియమించేందుకు పాలకవర్గమువారు పరిపూర్ణ సహకారము చూపాలి. గ్రంథాలయం ఒక స్వంత ఆస్తిగా చూచుకొనేట్లు, ముందుతరాలవారి కుపయోగించే మహత్తర నిధిగా ప్రజలు ఊహించేట్లు బాగా ప్రచారం చేయాలి.

ఇలాటివన్నీ అలాఉంచి, గ్రంథాలయంలో పుస్తకములు పోయినప్పుడు పాలకవర్గమువారు గ్రంథాలయాధికారియెడ తీవ్రమైన చర్యలు తీసుకొంటున్నారు. పోయినవాటికి డబ్బు కట్టమంటున్నారు ఇది చాల అన్యాయం. చాలీచాలని జీతాలతో, నిరంతరం పెరిగే ధరవరలను సుడిగుండంలో కొట్టుమిట్టాడుతూ కేవలం సేవా దృష్టితో ఉద్యోగం చేస్తున్న గ్రంథ పాలకుని యాదృచ్ఛికంగా జరుగుతున్న యీ పనికి బలి పీఠం ఎక్కించటం నాగరిక ప్రపంచం హర్షించదు. ఉన్నంతకాలం విరామ మెరుగని ఊడిగంచేసి, ప్రతిఫలం పరోక్షంగా ఆశించకుండా కృషిచేసిన మీదట ఆ సంవత్సర అంతానికో, ప్రమోషన్ మీద వెళ్ళేప్పుడో లేదా ఉద్యోగం విరమించేప్పుడో యిదివరలో "పనిచేసినప్పుడు పోయిన పుస్తకములు తాలూకు డబ్బు నయాపైసలతో సహా చెల్లించి మరీ కదులు" అని పాలకవర్గము వారు జారీచేసే హుకుం చూచినప్పుడు ఎంత బాధాకరంగా ఉంటుందో అనుభవించినవారికే తెలుసు. ఆ స్థితి ఎంత హృదయ విచారకంగా ఉంటుందో సానుభూతి చూపేవారు అనుభూతి

పొందగలను. ఈ చర్యపై గ్రంథాలయ క్షేత్రం నిరంతరాయంగా పనిచేస్తున్న పెద్దల, సంఘాల, కమిటీల అభిప్రాయాలను మచ్చుకు అయిదు మాత్రం సహృదయుల పరిశీలన కోసం పొందు పరుస్తున్నాను.

భారత ప్రభుత్వం బీహారు రాష్ట్ర మాజీ విద్యాశాఖ డైరెక్టర్ శ్రీ కె. పి. సిన్హా అధ్యక్షతన గ్రంథాలయ సలహా సంఘాన్ని నియమించింది ఈ సంఘం దాదాపు మూడు సంవత్సరాలు పరిశ్రమించి ప్రస్తుత ప్రజల పఠన అవసరాలను పరిశీలించి, దేశానికంతకు సరిపోను ఒక గ్రంథాలయ వ్యవస్థను రూపకల్పన చేసి ఒక నివేదికను 1958 సంవత్సరంలో ప్రభుత్వానికి సమర్పించినది. గ్రంథాలయాధికారి నైతిక వర్తనకు నష్టం కలిగించే చర్యలను విరమించాలని యీ నివేదికలో నొక్కి చెప్పబడింది. పుస్తకాల పోకడనుగురించి యిలా వివరింపబడింది "పుస్తకాల భద్రత వాటిని ఉపయోగించే చదువరుల నైతిక ప్రవర్తనపై ఆధారపడి ఉంటుంది. పుస్తకముల వినియోగాన్ని తీవ్రంగా తగ్గించితేగాని యీ సంఘ విద్రోహ కార్యం సమసిపోదు...గ్రంథాలయాధికారి తన బాధ్యత ఎడల తీవ్రమైన అశ్రద్ధ, అలక్ష్యం రుజువు అయితే తప్ప, ఏ రాష్ట్ర ప్రభుత్వము గ్రంథాలయాధికారినుండి హామీ కోరరాదు. పోయిన పుస్తకములకు సొమ్ము చెల్లించమనరాదు."

భారత ప్రభుత్వ సహకారంతో 1962 సంవత్సరంలో పదమూడవ అఖిల భారత గ్రంథాలయ మహాసభ కలకత్తాలో జరిగినది. పై సమస్యను గురించి ఆ సభా ముఖమున యీ దిగువ తీర్మానం చేయబడినది.

"గ్రంథాలయంలో పుస్తకములు దొంగిలించబడిన కారణంగా గ్రంథాలయ అధికారిపై వినాశకరమైన చర్యలు తీసుకొనే ఆచారాన్ని యీ సభవారు నిరసిస్తున్నారు. ఈ స్థితిలో నాగరిక ప్రపంచమంతా తీసుకొంటున్న చర్యలను పాలకవర్గమువారు గమనింపవలసినదని, అంతేగాక గ్రంథాలయ అధికారులను యీ నష్టానికి గురిచేయవద్దని యీ మహాసభ కోరుతూంది."

గ్రంథాలయాలలో పోతూన్న పుస్తకముల గురించి 1963 ఫిబ్రవరి, మార్చి నెల "గ్రంథాలయ సర్వస్వము"లో సంపాదకీయము వ్రాస్తూ సుప్రసిద్ధ గ్రంథాలయ సేవకులు శ్రీ పాతూరి నాగభూషణంగారు యిలా హెచ్చరించారు: "పుస్తకములవైపు ప్రజానీకాన్ని విరివిగా ఆకర్షించి హెచ్చుమంది గ్రంథాలయంలోని గ్రంథాలను తరచు ఉపయోగించునట్లు చూడవలసిన గ్రంథాలయాధికారి, అడుగడుగున తన పుస్తకములను ఎవరెప్పుడు ఎత్తుకుపోతారో అన్న భయంతో వాటి రక్షణ విషయమై హెచ్చు శ్రద్ధ వహించటంతో అసలే అంతంతమాత్రంగా ఉన్న గ్రంథాలయాలలోని పుస్తకముల ఉపయోగం సన్నగిల్లడం తప్పదని ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు.

"గ్రంథ ప్రచారానికంటె గ్రంథ రక్షణకే హెచ్చు ప్రాముఖ్యత నిచ్చు పరిస్థితి కలుగకుండ చూడవలసిన బాధ్యత గ్రంథ భండాగారులపై గలదు. దీనిని వారు గమనించనినాడు గ్రంథాలయాల ఉనికికే అర్థముండదు."

విజ్ఞాన ప్రచారంలో మనకు ఏమాత్రం

తీసిపోని మద్రాసు గ్రంథాలయ సంఘం తన 34 వ (1961) సంవత్సరిక నివేదికలో పై విషయాన్ని గురించి యిలా నివేదించింది: "తెలివైన దొంగలను ప్రపంచంలో ఏ శక్తి ఆపలేదు. పెద్ద పెద్ద జీతాలిచ్చి సాధారణ దుస్తులతో ఉన్న అపరాధ పరిశోధకుల నుండి గూడ వీరు సులభంగా తప్పుకో గలరు. కనుక ప్రతి గ్రంథాలయంలో ముఖ్యంగా స్వేచ్ఛోపలబ్ధిగల గ్రంథాలయాలలో కొన్ని పుస్తకములు పోక తప్పదు.

"సాంఘికంగా ఆలోచించినట్లయితే గ్రంథాలయంలో పోయిన ప్రతి పుస్తకం ఖరీదును చెల్లించమనటం అన్యాయం. ఇది ఎలా ఉంటుందంటే - దొంగతనం జరిగినప్పుడు అది పట్టుపడక పోతే పోయిన ప్రతి పైసాను పోలీసువారిని చెల్లించమన్నట్టు లుంటుంది అంతమాత్రాన గ్రంథాలయ ఉద్యోగులకు పూర్తిగా అలుసు యివ్వమనికాదు. ఏ ఉద్యోగి అయినా తన విధుల యెడ అలక్ష్యం చేస్తే చట్టరీత్యా అతనిని శిక్షింపవచ్చు, అంతేగాని ఏవో కొన్ని పుస్తకములు పోయినవను నెపంతో నిరపరాధియైన గ్రంథాలయాధికారిని యీ దారుణమైన చర్యకు గురి చేయడం అన్యాయం.

మరొక్క అభిప్రాయం మాత్రం చెప్పి ముగిస్తాను. గ్రంథాలయ శాస్త్రములో దధి డాక్టర్ రంగనాథన్ యీ విషయంపై యిలా చెప్పారు: "మంచి కట్టుదిట్టాలు చేసినా, మానవ మాత్రునికి సాధ్యమయినన్ని చర్యలు తీసుకొన్నా ఎంతో గొప్పగా కనిపెట్టుకొని ఉన్నా కొంత నష్టం తప్పదు. గ్రంథాలయ పాలకవర్గంవారు అందుకు సిద్ధంగా ఉండాలి."

అనుభవంతో చెప్పిన ప్రముఖులపై అభిప్రాయాలను నేటి గ్రంథాలయాలలో ఉన్న స్థితిగతులను పాలకవర్గమువారు సానుభూతితో పరిశీలించి, గ్రంథాలయ సిబ్బందిని బట్టి యిబ్బందులు పెట్టకుండా, వారికి విజ్ఞానప్రచారమందు ఆసక్తి కలిగించి గ్రంథాలయోద్యమానికి యితోధికంగా తోడ్పడతారని ఆశిస్తాను. సెలవు.











# గ్రంధాలయోద్యమ చరిత్ర

శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య

గ్రంధాలయశాస్త్ర విశారద, గ్రంథాలయోద్ధారక, గ్రంథాలయ పితామహ మరియు కృష్ణా యల్ యస్ ఎ, కమిటి సభ్యులు

*శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు*

ఉద్యమములలోకెల్ల మూలకందముగ నున్నది, ఉద్యమము లన్నింటికి జీవదాయకమైనది గ్రంథాలయోద్యమము అభివృద్ధిదాయకములగు విషయము లన్నియు పాశ్చాత్య సంసర్గము కలిగిన పిమ్మటనే మన దేశమునందు ఆవిర్భవించినవని, చాలమంది తలంపు అయితే ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమునకు మాత్రము ఈ భావము బొత్తిగా అన్వయించదు,

ఆంగ్లేయ భాషా సంసర్గము, ఆంగ్లేయ సాంప్రదాయ సంసర్గము, ఏమాత్రమును అంటదచుకొనని వజ్రోత్సాహు లగు యువకుల వలననే ఈ యుద్యమము ఆంధ్రదేశమందు జనించి వ్యాపించినది. ఈ యుద్యమమును స్వయంభువు అని చెప్పిన అతిశయోక్తి కానేరదు

ఆంధ్ర భాషకు అచ్చు అక్షరములు 1806 వ సంవత్సరమున తయారై 1834 న ఆంధ్ర గ్రంథములు అచ్చుపడుటకు ప్రారంభమాయెను.

1886 వ సంవత్సరమున విశాఖపట్నమున ఒక వీధి బడి ఉపాధ్యాయునిచే స్థాపితమైన "సరస్వతీ నిలయము" ఆంధ్రదేశమున మొట్టమొదటి సార్వజనీనిక గ్రంథాలయము 1890 లో కడపజిల్లా పులివెందులలో వెలసినది. ఈ రెండు ప్రథమ గ్రంథాలయముల పేర్లను సరస్వతీ సామ్రాజ్య అధిష్ఠాన దేవత యగు సరస్వతీదేవి పేరున నామకరణముగుట ఆంధ్రుల ప్రతిభావిశేషమే. తర్వాత 1890 లోనే ఒంగోలులో ఏ. వి. ఎన్. లైబ్రరీ, 1894 లో విజయనగరమున సింహాచలపతిరావు లైబ్రరీ. 1895 లో భీమవరం తాలూకా వుండి గ్రామమున నౌరోజీ క్లబ్బు, 1897 లో అదే తాలూకా కుముదవల్లిలో శ్రీ వీరేశలింగ గ్రంథాలయము, 1900 లో తెనాలి తాలూకా కొల్లూరున రీడింగు క్లబ్బు, రాజమహేంద్రవరమున వీరేశలింగ పుస్తక భాండాగారము, 1904 లో తెలంగాణా యందలి హైద్రాబాదు నగరమున శ్రీ కృష్ణదేవరాయ గ్రంథాలయములు స్థాపింపబడినవి. పిమ్మట 1905 సం॥న సంభవమైన వంగదేశ విభజనోద్యమ ఫలితముగ యావదాంధ్ర దేశమునను సార్వజనిక గ్రంథాలయములు పొడజూపినవి. 1911 సంవత్సరమున కృష్ణాజిల్లా బెజవాడ పట్టణమున శ్రీ రామమోహన గ్రంథాలయము స్థాపించబడినది.

1913 లో ప్రథమ ఆంధ్ర మహాసభ బాపట్లయందు జరిగినది మొదలు ఆంధ్రులయందు నూతన ఉత్సాహము, నూతన తేజము వికసిల్లసాగినది. అప్పటినుండి ఆంధ్రదేశముయొక్క అన్ని ప్రాంతముల యందును గ్రంథాలయములను, పఠనమందిరములను యువకులచే విరివిగా స్థాపింపబడినవి.

## ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము

ఆంధ్రదేశమునందు ఇట్లు బయలుదేరుచున్న వివిధ

గ్రంథాలయములయందు సోదర భావమును గలుగజేయుటకును, పరస్పర సహకారమును పెంపొందించుటకును, ధర్మ గ్రంథాలయ మహావృక్షము ఆంధ్రదేశము నందంతటను అవతరించుటకును ఈ విషయముల నన్నింటిని ప్రచారము చేయుటకును 1914 వ సంవత్సరమున బెజవాడ యందున్న శ్రీ రామమోహన ధర్మ గ్రంథాలయ కార్యదర్శిగ నేను ప్రథమ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభను సమావేశపరచితిని. ఆ సభకు సుప్రసిద్ధ కవిశేఖరులగు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు అధ్యక్షత వహించినారు.

కృష్ణా, గోదావరి, గుంటూరు, విశాఖపట్నము, గంజాం, నెల్లూరు, కడప, కర్నూలు, బళ్ళారి జిల్లాల నుండియు తెలంగాణా నుండియు పలువురు ప్రతినిధులు వచ్చినారు. ధర్మగ్రంథాలయోద్యమముయొక్క, వివిధ దశలను గూర్చియు, గ్రంథాలయ పాలనాపద్ధతులను గూర్చియు సమర్థులగువారిచే అనుభవపూర్వకములగు ఉపన్యాసము లియ్యబడినవి.

ఆంధ్రదేశము నందంతటను గ్రంథాలయములను, పఠన మందిరములను నెలకొల్పుటకును, నెలకొల్పినవానిని పెంపొందింపజేయుటకును, అన్నివిధముల తగిన ఉత్సాహమును ఇచ్చుటకు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము ఏర్పరుప బడినది.

## గ్రంథాలయ వేదము

ప్రథమ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభకు అధ్యక్షత వహించిన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు గ్రంథాలయోద్యమము ప్రాముఖ్యమును గూర్చి తమ ఉపన్యాసమునందు ఈ క్రింది విధముగ జెప్పిరి :

1. "వాయువు ఎల్లవారికి ఎట్లు స్వాధీనమైయున్నదో
జ్ఞానముకూడ అట్లు స్వాధీనము కావలయును
2. ఉదకము ఎల్లవారికి ఎట్లు సేవ్యమైయున్నదో
జ్ఞానముకూడ అట్లు సేవ్యము కావలయును
3. సూర్య చంద్ర మండలముల తేజస్సు ఎల్లవారికి
ఎట్లు సౌఖ్యప్రదముగా నున్నదో
జ్ఞానముకూడ అట్లు సౌఖ్యప్రదము కావలయును."

ప్రపంచమునందు ఇంతవరకు వివిధ దేశములందు వివిధ భాషలలో బయలుదేరిన గ్రంథాలయ సారస్వతమునందు ఈ సూక్తి మహోన్నతమై విలసిల్లినది. అందుచేత ఇది గ్రంథాలయవేదమై బరగినది.

## ఉద్యమ ప్రచారము

ఆంధ్రదేశము నందంతటను ఈ యుద్యమమును వ్యాపింపజేయుటకై వివిధ జిల్లాలయందు జిల్లాసభలు, తాలూకా సభలేగాక రాష్ట్రసభలనుగూడ వివిధ ప్రదేశములందు జరిపితిమి.

1920 సం॥న గ్రంథాలయ ప్రచారకులను తయారు చేయుటకై ఒక మాసము దినములు ప్రథమ పాఠశాలను బెజవాడ రామమోహన గ్రంథాలయమందు నడపితిమి. పల్లెటూళ్ళకు సంబంధించిన వివిధ సమస్యలకును, గ్రంథాలయ పరిపాలనకు సంబంధించిన వివిధ విషయములను గూర్చియు ఆయా విషయములనుగూర్చి పరిశ్రమ జేసిన సమర్థులచే అనుభవపూర్వకములైన ఉపన్యాసము లియ్యబడినవి.

1930 వ సంవత్సరమున గ్రంథభాండాగారుల తర్ఫీదు పాఠశాలను ఒకదానిని విజయవాడ దివ్యజ్ఞాన సమాజ మందిరమందు నిర్వహించితిమి. ఆ పాఠశాల నిర్వహణమందు శ్రీ కొత్తారి రామారావుగారు (హిందూ హైస్కూలు హెడ్మాష్టరు) పుణ్యమూర్తుల రాజశేఖరం బి. ఏ., బి. ఇడి. గార్లు నాకు తోడ్పడిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయమందు గ్రంథభాండాగారికగానున్న శ్రీ యం. ఓ థామస్‌గారుకూడ ఈ తర్ఫీదు పాఠశాలకు విచ్చేసి, ఉపన్యాసము లిచ్చి, తర్ఫీదును పరిశీలించి మెచ్చుకొనిరి.

1914 సం॥ మొదలు 1939 సం॥వరకు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు నేను కార్యదర్శిగా నుంటిని. ఈ

ఇరువదియైదు వత్సరములును నేను ఆంధ్రదేశమందంతటను నా స్వంత వ్యయముతో తిరిగి ఉద్యమ ప్రచారము చేసితిని.

## బరోడా యాత్ర

1917 సం॥న బరోడా కేంద్ర గ్రంథాలయమువారి ఆహ్వానముమీద అచటి కేగి, ఆ రాష్ట్రమునందు సార్వజనిక గ్రంథాలయోద్యమ మెట్లు సాగుచున్నదో పరిశీలించి, మన యుద్యమమునకు ఉత్తేజమును చేకూర్చితిని.

రెండవసారి బరోడా రాష్ట్రమునకు 1934 సంవత్సరములో మహారాజా శాయాజీగాయక్వారు వజ్రోత్సవమునకై వారి ఆహ్వానముమీద పోతిని. అచటి కేంద్ర గ్రంథాలయంలో మహారాష్ట్ర, గుజరాతీ భాషా గ్రంథములకై వర్గీకరణ పద్ధతిని, డ్యూయి_కట్టరుల పద్ధతులను సమీకరణంచేసి, ఒక మధ్యమ పద్ధతిని రూపొందించియున్నారు. ఆ పద్ధతిని అనుసరించి ఆంధ్ర గ్రంథముల కొక రూపమును సరిదిద్ది దానిని బెజవాడ రామమోహన గ్రంథాలయ మందు ప్రవేశ పెట్టితిని. ఆ పద్ధతినే ఇప్పటికిని వారు జయప్రదముగ అమలు చేయుచున్నారు

## స్థానిక సంస్థల ప్రోత్సాహము

1914 కు పూర్వము గ్రంథాలయములను స్థాపించుటయు, పోషించుటయు స్థానిక స్వపరిపాలనా సంఘముల (మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు మొదలైనవి) విధులలోనికి రాదని ప్రభుత్వ వైఖరిగా నుండెను. కొన్ని గ్రంథాలయములకు స్థానిక స్వపరిపాలనా సంఘములు మంజూరుచేసిన విరాళములను ప్రభుత్వమువారు రద్దుపరచుటగూడ జరిగినవి. అట్టి స్థితిలో అప్పుడు మద్రాసు ప్రభుత్వమువారి కార్యనిర్వాహక సభాసభ్యులుగా నున్న సర్. వి. యస్. శివస్వామి అయ్యరుగారికి ఈ కష్టమునుగూర్చి విన్నవింపగా, గ్రంథాలయములను నిర్వహించుట, పోషించుటయునుగూడ స్థానిక స్వపరిపాలనా సంస్థలయొక్క విధులలోకి వచ్చునని విస్పష్టముగా చెప్పివైచిరి పిమ్మట లోకలుబోర్డు చట్టములోగూడ మన సంఘముయొక్క కృషివలన, ఈ మేరకు మార్పు జరిగినది. గుంటూరు, బెజవాడ పురపాలక సంఘములు గ్రంథాలయములను నిర్వహించుట ప్రథమమున ప్రారంభించిరి. తాడేపల్లిగూడెం తాలూకా దొర్దువాయ గ్రామ పునర్నిర్మాణ తరగతులను నిర్వహించి, గ్రంథాలయమును స్థాపించిరి. పశ్చిమ గోదావరి జిల్లాబోర్డు స్వంతముగా గ్రంథాలయములను స్థాపించినది ఈ రీతిగా ప్రారంభమైన కృషి ముఖ్యముగా ఆంధ్రదేశ మంతటను వ్యాపించినది.

## పత్రికలు - గ్రంథములు - ప్రకటన

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘముచే ప్రకటింపబడిన మొదటి పుస్తకం "సార్వజనిక పుస్తకాలయములు" అను నది. రెండువేల కాపీలు వేసి దేశమునందంతటను విరివిగా పంచిపెట్టితిమి.

గ్రంథాలయ సర్వస్వమను పేరున మూడు మాసముల కొకసారి పత్రికను 1915 సం॥న ప్రారంభించితిమి. కొన్నాళ్లు మాసపత్రికగకూడ ప్రకటించితిమి. 1939 సం॥నకు పిమ్మట ఆంధ్ర గ్రంథాలయమను పేరుతో త్రైమాస పత్రిక కొంత కాలము ప్రకటింపబడిన పిమ్మట, తిరిగి గ్రంథాలయ సర్వస్వమును పునరుద్ధరించిరి. ఇప్పటికిని అది మాసపత్రికగనే ప్రకటింపబడుచున్నది

అఖిలభారత గ్రంథాలయోద్యమ వ్యాప్తికి "ఇండియను లైబ్రరీ జర్నలు" అను పేర ద్విమాస పత్రికను ప్రారంభించి, పిమ్మట మాసపత్రికగ మార్చి 5 సంపుటములు నడపితిమి. కాకినాడ వాస్తవ్యులు యాతగిరి లక్ష్మీ వెంకట రమణగారు "ధర్మ గ్రంథాలయ" పత్రికను మూడు సంపుటములు నడిపిరి. శ్రీ వెంకటరమణయ్యగారు వ్రాసిన "ధర్మ గ్రంథాలయోద్యమ"మను గ్రంథమునుగూడ ప్రకటించితిమి.

ఆంధ్రదేశమందలి గ్రంథాలయముల చరిత్రలను సేకరించి, 1915_1916 సం॥లందు ప్రకటించితిమి. 1939 సం॥లో గ్రంథాలయాల పట్టిక మాత్రము ప్రకటింపబడినది.

ఆంధ్ర గ్రంథములలో ప్రకటింపబడినవాని పేర్ల నన్నిటిని చేర్చి_ విషయములనుబట్టి వర్గీకరణముచేసి

తయారుచేయుపనిని విశాఖపట్టణ వాస్తవ్యులైన శ్రీ వెలిదండ శ్రీనివాసరావుగారికి వప్పగించితిమి. వారు శ్రమజేసి ప్రభుత్వమువారిచే ప్రచురింపబడిన గెజటీర్ల నన్నింటి శ్రద్ధతో పరిశీలించి, తెలుగులో ప్రచురింపబడిన పుస్తకాల నన్నింటికి విషయమునుబట్టి, గ్రంథముల పేర్లనుబట్టి, గ్రంథకర్తల పేర్లనుబట్టి, వర్గీకరణ పట్టికలను మూడింటిని తయారుజేసిరి. వానిని ప్రచురించుటకు మన సంఘమునకు ఆర్థిక సంపత్తి లేకపోవుటచేత, శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి వప్పగింపగా, వారు దానిని ప్రచురించిరి. శ్రీ బాలగంగాధర తిలకుగారిచే రచియింపబడిన "వేదకాల నిర్ణయము" అను గ్రంథమును శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు ఆంధ్రీకరింపగా, దానినిగూడ ప్రచురించితిమి. ఇది 1939 సం॥వరకు జరిగినపని. పిమ్మట శ్రీ నాగభూషణంగారు గ్రంథాలయ శాస్త్రమునకు సంబంధించినవి అనేక గ్రంథములను ప్రకటించిరి.

## ప్రభుత్వమువారి సహాయము

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము పక్షమున వివిధ మండలములందు జరిగిన అనేక విధములైన సభలకు పోయి ఈ యుద్యమమునందు ఇమిడియున్న అనంతశక్తులనుగూర్చి ప్రబోధము గావించితిని. శాసన నిర్మాణ సభాసభ్యులచే కృషి చేయించితిని. తత్ఫలితముగా, మద్రాసు రాజధానియందలి గ్రంథాలయములకొరకు కొంత ద్రవ్యమును ప్రత్యేకింపవలయునని శ్రీ కొండ వేంకటప్పయ్యగారిచే మద్రాసు శాసన నిర్మాణ సభయందు తేబడిన తీర్మానము తుదకు అంగీకరింపబడినది. అప్పటినుండి ప్రతి సంవత్సరము ప్రభుత్వమువారిచే కొంత సొమ్ము విరాళముగ ఇయ్యబడుచున్నది.

## అఖిల భారత గ్రంథాలయోద్యమము

1918 సం॥లో లాహోరుపట్టణమునందు ప్రభుత్వమువారి ఆదరణక్రింద అఖిల భారత గ్రంథ భాండాగారుల సమావేశము జరిగినది. ఆ సభకు ప్రతినిధులను పంపుటకు మన సంఘమునకు అవకాశ మియ్యలేదు. అందుమీద 1919 లో మద్రాసులో జరుపబడిన ఆరవ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభతోబాటుగా, ప్రథమ అఖిలభారత గ్రంథాలయ మహాసభను సమావేశపరచితిమి. ఆ సభకు బరోడా రాజ్య గ్రంథాలయ శాఖాధ్యక్షులగు జె. యస్. కుడల్‌కారుగారు అధ్యక్షత వహించిరి. అపుడు గవర్నరుగానున్న వెల్లింగుటన్ ప్రభువు గ్రంథాలయ ప్రదర్శనమును తెరచిరి.

ఈ సభయందే అఖిలభారత గ్రంథాలయ సంఘమును కూడ నిర్మించితిమి. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ కార్యదర్శిత్వముతోబాటు అఖిలభారత గ్రంథాలయ సంఘ కార్యదర్శిగా పనిచేసితిని. భారతవర్షముయొక్క వివిధ పట్టణములందు ఎనిమిది సభలను జరిపితిమి. అఖిలభారత గ్రంథాలయ సంఘ ప్రచార ఫలితముగ మహారాష్ట్రము, వంగదేశము, కర్నాటకదేశము, మద్రాసురాష్ట్రము, పంజాబు దేశములందును - పుదుక్కోట సంస్థానమందును రాష్ట్రీయ గ్రంథాలయ సంఘములు ఏర్పరుపబడినవి.

## ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక సంఘము

16 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ 1934 వ సంవత్సరమున కాకినాడ పట్టణమున జరిగినది. ఆంధ్రదేశమందు గ్రంథాలయోద్యమము విరివిగా వ్యాప్తినొందుటకై ఆ సంఘ నిబంధనల యందు సేవకశాఖ యొకటి కలదు. కాకినాడ గ్రంథాలయ సభతోబాటుగ ప్రథమ ఆంధ్ర గ్రంథాలయోద్యమ సేవక మహాసభ సమావేశపరచబడి-"ఆంధ్రదేశమందు గ్రంథాలయోద్యమ వ్యాప్తిని చేయుటకుగాను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు అనుబంధముగ సేవాశాఖను స్థాపించుటకు తీర్మానించడమైనది."

అప్పటినుండి సేవాశాఖ సభలు వివిధ ప్రదేశములందు జరిగినవి. గుంటూరునందు 1942 సం॥ జరిగిన అట్టి సభలలో ఒకదానియందు నాకు డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారి సరస్వతీ సామ్రాజ్య గ్రంథము బహూకరింపబడినది.

## గ్రంథాలయ యాత్రలు

గ్రంథాలయ సేవకులు చేసిన ఘనకార్యములలో గ్రంథాలయ యాత్రలు విశిష్టమైనవి.

వయోజనులయందు గ్రంథాలయముల ధ్యాస కలుగుటకును, గ్రంథాలయముల స్థితిని పరిశీలించి అభివృద్ధి పరచుటకును గ్రంథాలయ యాత్రలు—భీమవరం—తాడేపల్లిగూడెం—కొవ్వూరు – రేపల్లెతాలూకాలయందు నా ఆధ్వర్యముక్రింద సాగింపబడినవి.

ఒక యాత్రయొక్క జట్టు రమారమి పన్నెండుమంది యాత్రికులు పన్నెండుగురును ఈ క్రింద వివరించిన ప్రకారము ఆరుజట్లుగా ఏర్పడుదురు: 1. పురోగాములు 2. భజన 3. ప్రదర్శనము 4. గ్రామఫోను 5. ఉపన్యాసకులు 6. మాజిక్‌లాంతరు.

పురోగాములు వెనుకటిరోజుననే ముందుగ్రామమునకు పోయి గ్రంథాలయ వేదము అచ్చువేసిన పెద్ద కాగితములను, యాత్ర రాకలను గురించిన ప్రకటనగల పెద్ద కాగితములను గోడలమీద గ్రామమంతయు అంటించెదరు. మరియు గ్రామములోని గ్రంథాలయము మొదలగు సంస్థలకు సంబంధించినవారితోను, గ్రామ పెద్దలతోను మాట్లాడి గ్రంథాలయాత్రికులకు స్వాగత మిచ్చుటకు తగిన ఏర్పాటులను గావింతురు. మరునాటి ఉదయమునకు యాత్రికులు ఆ గ్రామమునకు కాలినడకను పోయెదరు. ముందుగా భజన జట్టువారు భజన చేయుచు గ్రామమంతా తిరిగి, గ్రామంలోని జనుల నందరను సభకు ఆహ్వానించెదరు. ప్రదర్శన జట్టువారు వారి సామగ్రినంతను బహిరంగసభ జరుగు చోటుకి దగ్గరగా ఒక భవనంలోగాని లేక వీధి అరుగులమీదగాని గోడలకు వ్రేలాడగట్టి ప్రదర్శించెదరు. ఈ లోపున గ్రామఫోనుజట్టువారు సభ జరుగు స్థలమున గ్రామఫోను రికార్డులను వినిపించు చుండెదరు. భజనజట్టువారు భజనతో ఊరంతా తిరిగి వారితో ఒక ఉత్సవమును చేరదీసికొని, ఉపన్యాస వేదిక యొద్దకు వచ్చెదరు అప్పుడు ఉపన్యాసకుల జట్టువారు వివిధ విషయములమీద ఉపన్యాసముల నిచ్చెదరు. గ్రామంలోని గ్రంథాలయమును పరిశీలించెదరు. అవసరమైన చోటుల అటకలమీదనుండి పుస్తకములను దింపించి, బూజు దులిపించి, పుస్తకముల పట్టికలను తయారుచేసి, తిరిగి ఆ గ్రంథాలయాన్ని పనిలోకి దింపి మరీ పోయెదరు. ఈ రీతిగా, ఆ గ్రామంలోని గ్రంథాలయం పని చేయుచున్నయెడ ఇంకను ఎక్కువ ప్రకాశవంతమగునటుల అసలు పనిచేయకున్న పనిచేయునటుల ఉద్బోధించెదరు. సభ అయిపోయిన పిమ్మట మాజిక్కులాంతరు ప్రదర్శనము ప్రారంభమగును బొమ్మల సహాయంతో ఆరోగ్యము, సహకారము, గ్రంథాలయ ప్రచారము మున్నగు విషయములను గూర్చి చెప్పెదరు. ఈప్రకారము కార్యక్రమమును ముగించుకొని ముందు గ్రామమునకు బోయెదరు.

ఇట్టి యాత్రలు గ్రామస్థులందు ఉత్తేజమును, చైతన్యమును కలుగజేసి, గ్రంథాలయముల ఉపయోగమును, వయోజన విద్య ఉపయోగములను ఎక్కువగా వినియోగించుటకు అలవాటు పడునటుల చేసినవి.

చిత్తూరుజిల్లా కుప్పం గ్రామంలో సైకిలు చక్రాలతో ఒక బండిని నిర్మించి ఆ గ్రామమునందేగాక, చుట్టుప్రక్కల గ్రామాలకుకూడా గ్రంథములను ప్రచారము చేసిరి. కృష్ణాజిల్లా పెడసనగల్లు గ్రామమువారు రెండెడ్లబండిపై సంచార గ్రంథాలయమును కొంతకాలము ప్రచారము చేసిరి. మచిలీపట్నంలో ఫ్రెండ్సు యూనియనువారు సైకిలుబండిని వినియోగించి కొంతకాలము పట్టణములో గ్రంథములను ఎరువిచ్చిరి. విశాఖపట్నంజిల్లా జగ్గాపురంవారు మనుష్యుల ద్వారానే చుట్టుప్రక్కల గ్రామాదులకు గ్రంథములను పంపుచున్నారు. పట్టణ గ్రంథాలయ సంఘముయొక్క ప్రోత్సాహముచేత, విజయవాడ మునిసిపాలిటీవారు శకటములద్వారా పట్టణమంతా సంచార గ్రంథాలయమును నిర్వహించు పథకమును వేసి కొన్ని సంవత్సరముల క్రిందట పంపగా మద్రాసు గవర్నమెంటువారు దానిని తిరస్కరించినారు.

పడవలలో ప్రయాణము చేయుచున్నప్పుడు ప్రయాణీ

కులు చదువుకొనుటకై గుంటూరు జిల్లా పెదపాలెం సేవాశ్రమంవారు కాలువమీద పడవలలో సంచార గ్రంథాలయాల నేర్పాటుజేసి కొంతకాలము సమర్థతతో ప్రయోజనకరముగ నిర్విహించిరి. తెనాలి తాలూకా సంగం జాగర్లమూడి గ్రంథాలయంవారును ఇట్టి సేవను జేసిరి

వేటపాలెమందున్న సారస్వత నికేతనమువారు తమ గ్రంథాలయమును గుంటూరుజిల్లా కేంద్ర గ్రంథాలయముగ నిర్మించిరి శ్రీ వూటుకూరి సుబ్బరాయశ్రేష్ఠిగారు ప్రారంభించిన ఈ కార్యక్రమమును శ్రీ అడుసుమిల్లి శ్రీనివాసరావుగారు ఇతోధికముగా కొనసాగించు చున్నారు.

## స్వంత భవనము

భారత వర్షమున నవీన గ్రంథాలయోద్యమమును 1911 సంవత్సరంలో బరోడా మహారాజుగారు ప్రారంభించిరి. మన ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము 1914 సం॥లో స్థాపింపబడి భారత వర్షమునం దంతటను ప్రథమ గ్రంథాలయ సంఘమై వెలయుచున్నది. బరోడా రాజ్యంలో గ్రంథాలయ సంఘం 1920 సం॥ వరకు ఏర్పడలేదు.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు స్వంత భవనముగా బెజవాడలోని రామమోహన గ్రంథాలయ భవనమును ఇచ్చుటకును, ఆంధ్ర దేశమునకు రామమోహన గ్రంథాలయము కేంద్ర గ్రంథాలయముగ చేయుటకును, రామమోహన గ్రంథాలయ సంఘముయొక్కయు, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము యొక్కయు సభ్యుల సమావేశములలో తీర్మానములు ఏకగ్రీవముగా అంగీకరింపబడినవి. అయితే ఆ యేర్పాటువల్ల రామమోహన గ్రంథాలయం యొక్క పేరు మార్పు చేయనైనది. అట్టిమార్పునకు కృష్ణాజిల్లా జాయంటు రిజష్ట్రారు అంగీకరింపలేదు. అందుచేత ఈ ప్రయత్నమంతయు విరమింపవలసివచ్చినది.

1914 సం॥ నుండి 1939 సంవత్సరమువరకు ఆంధ్ర గ్రంథాలయ సంఘమునకు నేనే కార్యదర్శిగా నుంటిని. శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారితో 1907 సంవత్సరమునుండి నాకు గల పరిచయమును పురస్కరించుకొని వారిని బెజవాడయందే నివాసముగా నిలిపి 1914 సం॥లో ఈ సంఘమునకు అధ్యక్షులుగా ఎన్నుకొంటిమి.

పిమ్మట శ్రీ పాతూరి నాగభూషణంగారు వ్యగ్రోత్సాహముతో గ్రంథాలయ సేవను చేయుటకు ముందుకు వచ్చుటచేతను, శ్రీ కొమ్మా శీతారామయ్యగారు ఒక యకరము స్థలమును కొనియిచ్చెదమని వాగ్దానము చేయుటచేతను, శ్రీ పాతూరి నాగభూషణంగారిని ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు 1939 సం॥లో కార్యదర్శిగా ఎన్నుకొని, సంఘ కార్యస్థానమును బెజవాడ నుండి పటమటలంకకు మార్చితిమి.

శ్రీ కొమ్మా శీతారామయ్యగారు తమ వాగ్దాన ప్రకారము స్థలమును కొనియిచ్చుటయేగాక సంవత్సరమునకు రు. 600 లు ఆదాయం వచ్చే 3 ఎకరముల పొలమును గూడ సంఘమున కిచ్చిరి.

అందుమీద శ్రీ పాతూరు నాగభూషణంగారు విశేషముగా శ్రమజేసి విరాళములను వసూలుజేసి, రు. 25 000 విలువగల క్రింది అంతస్తు భవనమునేగాక, గాంధి తత్వ ప్రచారక సంఘమువారి తోడ్పాటుతో మీది అంతస్థునుగూడ నిర్మింపజేసిరి.

మరియు శ్రీ గోటేటి జోగిరాజుగారు తమ వ్యవసాయ

విద్య యొసగును వినయంబు, వినయమునను
బడయు పాత్రత, పాత్రతవలన ధనము,
ధనము వలనను ధర్మంబు, దానివలన
నైహికాముష్మిక సుఖములందు నగుడు

—చిన్నయసూరి

గ్రంథము లన్నింటి ప్రచురణాధికారమును రు. 2,500 ల విరాళముతోగూడ ఈ సంఘమున కిచ్చిరి.

## జాతీయ వికాసమునకు దోహదము

ఆంధ్ర దేశమున 1905 సం॥రం నుండి వంగదేశ విభజనోద్యమ ఫలితముగను 1917 సం॥రం నుండి హోం రూలు ఉద్యమ ఫలితముగను 1921 సం॥ నుండి గాంధిగారి అసహాయోద్యమ ఫలితముగను జాతీయ వికాసము దినదినాభివృద్ధి గాంచినది. తాము బాగై తమ తోడివారలను బాగు చేయవలయునను మనుష్య స్వభావమున నాటియున్న తీవ్రమగు వాంఛగల యువకు లనేకులు ఈ యుద్యమములకు అంకితమైరి. ఆ ధ్యేయమును సాధించుటకై అట్టి యువకులు దేశమందంతటను సంచారముచేసి, నూతన గ్రంథాలయములను, పఠన మందిరములను స్థాపించుటను, ఉన్నవానిని ఉత్తేజింపజేయుటకును పలువిధముల పాటుబడియున్నారు. వీరికి జీతములు లేవుగదా భత్యములు అసలే లేవు. ఆంధ్ర దేశమందున్న అట్టి సోదర సేవకుల పరిశ్రమ ఫలితంగా 1914 వ సంవత్సరమందున్న 163 ఆంధ్ర గ్రంథాలయములు ఒకప్పుడు పదివేలకుపైగా పెరిగినవి ఈ రీతిగా అజ్ఞాతులగు ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ నిర్మాతలు వేలకొలది ఆంధ్రదేశముయొక్క నలుమూలల వ్యాపించియున్నారు. గ్రంథాలయోద్యమంలో ఆరితేరిన ఈ నిర్మాతలే ముఖ్యంగా గాంధీగారి అసహాయోద్యమంలోకూడ ముందంజ వేసిరి ప్రతి గ్రంథాలయమును అసహాయోద్యమ ప్రచారమునకు రంగస్థల మాయెను.

## ఎందరో మహానుభావులు

ఆంధ్ర గ్రంథాలయోద్యమమును దేశభక్తితో గూడిన వైజ్ఞానికోద్యమముగా రూపొందగలుగుటకు ఎందరో మహానుభావులు తోడ్పడినారు. అట్టివారిలో కవులు, గాయకులు, రాజకీయవేత్తలు, సంఘ సంస్కర్తలు, పూర్వాచార పరాయణులు, బీదవారు, రాజ్యాధిపతులు, దేశనాయకులు, వీరు వారు అననేల అన్ని తరగతుల జనులును కలసి ఇందరు మహామహుల ఆదరాభిమానముల వలనను, మార్గదర్శకత్వమువలనను గ్రంథాలయోద్యమము ఒడుదుడుకులులేకుండ తన యాత్రను నిర్విఘ్నముగ కొనసాగించుచున్నది.

## గ్రంథాలయ చట్టము

ప్రజలెంత గ్రంథాలయోద్యమమును ప్రచారము చేసి స్థాపించి వ్యాపింపజేసినను ప్రభుత్వమువారి సహాయము ఉండినగాని, సర్వతోముఖమైన కృషి జరుగుటకు అవకాశ ముండదు. 1934 సంవత్సరమునుండి మేము చేసిన ప్రచారమునకు ఫలితముగ 1948 వ సంవత్సరమున మద్రాసు రాష్ట్రమునకు గ్రంథాలయ శాసన మొకటి ఆవిర్భవించినది. ఈ చట్టము ఏర్పడుపరకు అమలులోనున్న గ్రంథాలయ ఉద్యమముయొక్క అనుభములను ఈ శాసనకర్తలు ఎంత మాత్రము గమనింపకపోవుటవలన ఈ చట్టమునందు అనేక లోపములు చేరినవి.

పిమ్మట హైద్రాబాదు రాజ్యమున కొక గ్రంథాలయ చట్టము చేయబడినది.

ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వము ఏర్పడిన పిమ్మట, ఈమేడు ఆ రెండు చట్టములను సమీకరించి, ఒక చట్టమును రూపొందించిరి. ఈ కొత్త చట్టమునందు అభివృద్ధి కరమునైన అనేక మార్పులను చేసినారు.

అయితే కడచిన అరవై సంవత్సరములపై నుండి దేశ సౌభాగ్యమునకు గ్రామ జీవనోత్తేజమునకు పునాదులను వేసి, రాజకీయ చైతన్యమును కలుగజేసి, ఆంధ్ర గ్రంథాలయోద్యమముయొక్క ప్రాశస్త్యమును నిరూపించినట్టి వేలకొలది కమిటీల పరిపాలన "గ్రంథాలయములకు ఈ చట్టమునందు చోటులేదు. మరియు ఇట్టి గ్రంథాలయములు కో-ఆపరేటివు సొసైటీల స్థాయిని అనధికారుల పరిపాలనతో గూడిన స్వయంపరిపాలనా వ్యవస్థయగ రూపొందవలెను.

ఇట్టి మార్పులు జరిగి ఆంధ్ర గ్రంథాలయోద్యమము మహోన్నత స్థాయిని అచిరకాలములోనే పొందగలదు.

## సార్వజనిక విశ్వవిద్యాలయములు.

ముఖ్యముగా అమెరికా ఇంగ్లాండు దేశములలో గ్రంథాలయములను జనులందరు తమకు కావలసిన విషయములను విజ్ఞానమును సంపాదించుకొనుటకు – విశ్వ విద్యాలయముల స్థాయిని ఉపయోగించుకొనుచున్నారు. ఆస్థాయిని పరిశీలిస్తే, మనదేశమున గ్రంథాలయ ఉద్యమం ఇంకా ఓ. న. మల స్థితిని దాటలేదని చెప్పిన – సాహసముకాదని నా తలంపు.

అందుచేత సార్వజనిక ధర్మ గ్రంథాలయోద్యమ ప్రచారం యొక్క అవసరం ఇప్పుడు ఇంకా ఎక్కువగా ఉన్నది. ఇదివరకుచేసినది అసలు ఉద్యమంయొక్క ప్రాశస్త్యం – ఉపయోగం – వినియోగాలనుగూర్చి – ఇప్పుడు జరుగవలసినది వాటిని ఎన్ని దృక్పథాల నుంచి పరిశీలించవలసినదిన్నీ ఇందుకు అనుభవజ్ఞులగు శాస్త్రవేత్తలు ఏయే మార్గములను సూచించినదిన్నీ తెలిసికొనుట.

అందుచేత ఒకచట్టము ఏర్పడినది – ప్రతీదీ ప్రభుత్వము చూచుకొంటుంది–అని ఏమరరాదు – ప్రభుత్వమంటే ప్రజల కోర్కెలయొక్క అద్దమన్నమాట. అందుచేత మనము మంచి రుచులను – శాస్త్రదృష్టిని అలవరచుకొని గ్రంథాలయములు సార్వజనిక ధర్మ గ్రంథాలయస్థాయిని పొందువరకు కృషిని నిరంతరము చేయాలి.

# గ్రంథాలయములు - సక్రమపాలన

శ్రీ బి. పి. రంగారావు, లైబ్రేరియన్
గుడ్లవల్లేరు

ప్రియజనని భారతమాత అనుంగుబిడ్డ "మహాత్ముడు" పరదేశీయులను పారద్రోలి మనకు స్వాతంత్ర్యమును ప్రసాదించినారు. విదేశీయ బానిస సంకెళ్ళనుండి విముక్తి పొందిన భారతజాతి యీనాడు నవసమాజ నిర్మాణముకొరకు అహోరాత్రులూ ఐక్యంగా పాటుపడుతున్నది. పౌరులు విజ్ఞానవంతులై ఉజ్జ్వల భవితవ్యము సృజించుకొనుటకు మన ప్రభుత్వము అవిరామ కృషి సల్పుచున్నది. విజ్ఞానాభివృద్ధికొరకు పాఠశాలలేగాక, గ్రంథాలయములు ప్రాచీనకాలమునుండి ప్రముఖ పాత్ర వహిస్తున్నవి అందుకే గ్రంథాలయాల మహోద్యమం ప్రారంభమయినది. నిబంధనలు ఏర్పడినవి. చట్టములు సవరింపబడినవి. పల్లెసీమలలో సహితము గ్రంథ పఠనమునకు ప్రజలు ఆశతో నిరీక్షించుచున్నారు.

గ్రంథాలయాలు మరింత పటిష్టంగా, సమగ్రంగా, పురోభివృద్ధిచెంది పరిపక్వమైన వున్నత స్థితికి రావలెనన్న, ప్రతి గ్రంథాలయమునకు సక్రమ నిర్వహణ అవుసరము.

ఉదాహరణకు ఒక తాలూకా కేంద్ర గ్రంథాలయము తీసికొని దాని సక్రమ నిర్వహణకు వలయు పద్ధతులు - పాలన వస్తువులు యీ దిగువ వుదహరించబడినవి.

## గ్రంథాలయ భవనము

గ్రంథాలయమునకు ముఖ్యముగా స్వంత భవన నిర్మాణము, విద్యుద్దీపములు, పంకాలు, లావెటరీలు, పంపులు అవుసరము. గ్రంథాలయ భవనము ఆధునిక పద్ధతిలో విశాలమై, స్త్రీల, పురుషుల, బాలల, పఠన నిమిత్తమై ప్రత్యేక విభాగములు స్థాపించునదిగా నుండవలెను. గ్రంథాలయమునకు ఒక గార్డెను, పిల్లలకు ఆటస్థలము వుండుట అవుసరము గ్రంథాలయ భవన కిటికీలకు వైరు నెట్టింగ్ చేయుట మంచిది. అద్దె యిండ్లలో గ్రంథాలయం స్థాపించుటవలన గ్రంథాలయ నిర్వహణకు అవరోధము కలుగుచున్నది. కనుక గ్రంథాలయమునకు ప్రత్యేకమైన స్వంత భవన నిర్మాణము అవుసరమైయున్నది.

## గ్రంథాలయములు - పుస్తకములు

గ్రంథాలయములకు పుస్తకముల నెన్నిక చేయుటలో అత్యంత జాగరూకత అవుసరము. పుస్తకములు సాహిత్యమున విలువకలిగినవై వివిధ అంశములమీద నుండవలెను. చౌకబారు పుస్తకములవలన భాండాగారము విలువ క్షీణించుటయేగాక, పౌరుల విజ్ఞానాభివృద్ధికి తోడ్పడవు. గ్రంథాలయాల ఆశయములకు ఆటంక మేర్పడును. పఠనాసక్తి పెంపొందుటకు సద్గ్రంథములే కారణము. స్థానిక పాఠకులకు వలయు గ్రంథములు వెంటనే సరఫరాచేయు నిమిత్తమై, సాలీనా, కనీసము రు 300 ల వరకు గ్రంథములు కొనుగోలు చేయు

టకు ఆ గ్రంథాలయాధికారికి అవకాశ ముండవలెను. నవీనముగా ప్రచురించబడిన గ్రంథములు ఎప్పటికప్పుడు గ్రంథాలయములో నుండుటకు అవకాశ మేర్పడును. ప్రతి సంవత్సరము ప్రచురించబడు "General Knowledge" పుస్తకముల సరఫరాకు, స్టాండింగు (Standing Orders) ఆర్డర్సు యిచ్చుట మంచిది. గ్రంథాలయములో వున్న పుస్తకములే పొరపాటున మరల కొనుగోలు చేసినయెడల అధిక వ్యయమగుటయే గాక, క్రొత్త పుస్తకములు కొనుటకు వీలుండదు. కనుక పుస్తకములు నెన్నిక పద్ధతి ముఖ్యాంశము.

### ఇంటర్ లైబ్రరీ లోన్ సిస్టమ్ (Inter Library Loan System)

ప్రతి గ్రంథాలయ పాఠకుల అభిప్రాయము అభిరుచుల ననుసరించి సకల గ్రంథములను కొనుగోలు చేయుటయూ అధిక వ్యయముతో కూడిన పని. అందువలన తదితర సోదర గ్రంథాలయములనుండి ఆయా గ్రంథములను అప్పు పద్ధతిపై గ్రహించి మరల వాపసు చేయు పద్ధతి ప్రవేశ పెట్టిన స్వల్ప వ్యయముతో పాఠకుల అభీష్టమును నెరవేర్చవచ్చును.

### ధరావతు పద్ధతి (Deposit System)

ధరావతు చెల్లించిన ప్రతి సభ్యుడు హామీ అప్లికేషను ఫారమును దాఖలుచేసి సభ్యత్వమును పొందును.

కొన్ని గ్రంథాలయములలో ధరావతు దారులు, పుస్తకములు వాపసు చేయకుండుట, రుసుము చెల్లింపకుండుట, ఆఫీసునుండి పంపిన నోటీసులను సహితము ఖాతరుచేయకుండుట సంభవించుచున్నది. తద్వారా విలువగల పుస్తకములు గ్రంథాలయమునుండి తరలిపోయి వాపసు అగుట లేదు. కనుక అట్టి ధరావతుదారులపై కోర్టులలో కేసు నమోదుచేసి గ్రంథాలయ ఆస్తిని రాబట్టుటకు గ్రంథాలయాధికారికి అధికార ముండవలెను. గ్రంథాలయ నిబంధనల కాపీని ప్రతి ధరావతు సభ్యునికి సరఫరా చేయవలెను. టిక్కెట్టు పద్ధతి ప్రవేశపెట్టవలయును.

### గ్రంథాలయ పుస్తకములు - బైండింగు

క్రొత్త పుస్తకము లన్నియూ ప్రథమముగా బైండు చేయించుట ముఖ్యము దానివలన గ్రంథములు దీర్ఘకాలము మన్నుటయేగాక టిక్కెటు పద్ధతి ప్రవేశపెట్టుటకు బుక్ పాకెట్ల నేర్పరుచుటకు వీలగును. ఆధునిక పద్ధతిలో గ్రంథాలయము నడుపవచ్చును. బైండుచేయని పుస్తకములు స్వల్పకాలములోనే చినిగి ముక్కలై దీర్ఘనిద్రను పొందును. ఫలితముగా గ్రంథాలయ ఆస్థికి నష్టము వాటిల్లును. పుస్తకముల సంఖ్య తగ్గును. మరల కొనుగోలు చేయుటకు ఆర్థికబాధలు అధిక వ్యయము ఏర్పడును కనుక పుస్తకములు బైండు చేయించుట ఆవశ్యకము.

### పుస్తకములు - వర్గీకరణము

పుస్తకము లన్నియూ, అనుభవజ్ఞులైన గ్రంథాలయాధికారులచే కేంద్ర గ్రంథాలయములో వర్గీకరింపబడి శాఖా గ్రంథాలయములకు సరఫరా చేయుట సమంజసము. వర్గీకరణముబట్టి గ్రంథముల పట్టిక (Catalogue) తయారుచేయుటకు వీలుండును. చదువరులు వారికి వలయు

పుస్తకములు ఎన్నుకచేసికొనుటకు సులభము. వర్గీకరణమునుబట్టి కాటలాగింగు (Cataloguing) కార్డులు తయారుచేయుటకు టైపురైటర్లు అవసరము. కనుక ప్రతి గ్రంథాలయము ఆధునిక పద్ధతిలో నిర్వహించవలెనన్న వర్గీకరణము (Classification) అవుసరము.

## గ్రంథాలయంలో రిజిష్టర్లు

ప్రతి గ్రంథాలయంలోను సాధారణ నిర్వహణకై యీ దిగువ పుదహరించిన రిజిష్టర్లు అవుసరము.

### గ్రంథాలయమునకు

1) గేటు రిజిష్టరు (Gate register)
2) కన్సల్టేషను రిజిష్టరు (Consultation register)
3) పుస్తకములు సభ్యుల కిచ్చు రిజిష్టరు (Issue register)
4) స్టాకు రిజిష్టరు (Accession reg.)
5) గిప్టు ,, (Gift reg.)
6) బైండింగు ,, (Binding reg.)
7) ఇంటరులోను ,, Inter Library loan reg.
8) గ్రంథములు డిపాజిట్లు కేంద్రములకు పంపిన రిజిష్టరు (Register of Books issued to deposit Centres)
9) ధరావతు సభ్యుల రిజిష్టరు Borrowers reg.
10) ఓవర్ డ్యూవాచ్ రిజిష్టరు (Over due watch reg.)
11) పీరియాడికల్ అటెండన్సు (Periodical attendance reg)
12) ప్రోగ్రెస్ రిజిష్టరు (Progress reg.)
13) పాత పేపరు సేల్సు రిజిష్టరు (Old papere sales reg.)
14) పాఠకుల సలహాల రిజిష్టరు (Suggestion Book)
15) పుస్తకముల కాటలాగు (Catalogue of Books)

### గ్రంథాలయ ఆఫీసునకు

1) గ్రంథాలయాధికారి పర్సనల్ రిజిష్టరు (Personal reg.
2) జమా-ఖర్చుల రిజిష్టరు (Cash Book)
3) డిస్పాచ్ రిజిష్టరు (Despatch reg.)
4) స్టాంపుల అకౌంటు (Stamps Account Book)
5) సిబ్బంది సర్వీసు రిజిష్టరు (Staff Service reg.)
6) క్యాజుయల్ లీవు రిజిష్టరు (Casual Leave reg.)
7) అక్విటెన్సు రిజిష్టరు (Acquittance reg.)

---

అన్ని చదువులు గ్రంథాల నమరుకతన
గ్రంథమున కక్షరమె ప్రాణకందమగుట
నక్షర జ్ఞాన మందర కందజేయు
దీక్ష బూనుడు చదివిన దిట్ట లెల్ల.

—గాడిచర్ల

8) టూల్సు అండ్ ప్లాంట్సు రిజిష్టరు (Tools and plants reg.)
9) స్టేషనరీ రిజిష్టరు (Stationary reg.)
10) పాత డిస్పోజల్సు రిజిష్టరు (Old disposals reg.)
11) సిబ్బంది అటెండెన్సు రిజిష్టరు (Staff attendance reg.)
12 స్టాఫ్ ఆర్డరు రిజిష్టరు (Staff Order Book)

పైన వివరించిన రిజిష్టర్లు అన్నియూ దాదాపు పౌరగ్రంథాలయాలలో నిర్వహింపబడు చున్ననూ, ఏకరీతి (Uniformal) గా జరుగుట లేదు. కనుక అచ్చు రిజిష్టర్లు, రసీదులు, ఫారములు గ్రంథాలయములకు సప్లై చేయుట అవుసరము.

## గ్రంథాలయములు - వస్తువులు

ప్రతి పౌర గ్రంథాలయమూ ఆధునిక పద్ధతిలో సక్రమంగా నిర్వహింపబడవలెనన్న సరిపడు ఫర్నిచరు, ఇతర వస్తువులు సరైన కాలములో సరఫరా చేయవలయును.

## గ్రంథాలయములు - పత్రికలు

అరుణోదయమునకు పూర్వమే వార్తా పత్రికల కొరకు నేటి నాగరికులు ఆతురతతో నిరీక్షించుచున్నారు. ప్రజారాజ్యములో ప్రతి పౌరుడు తన విద్యుక్త ధర్మములు తెలిసికొని నెరవేర్చుటకు, బాధ్యతల నిర్వహించుటకు వార్తాపత్రికలు ముఖ్యము. కనుక స్థానిక ప్రజల అభిరుచుల ననుసరించి పత్రికల నెన్నికచేసి సరఫరా చేయుటకు గ్రంథాలయాధికారికి అధికారములున్న పాఠకుల యభీష్టము సిద్ధించును. పాత పేపర్లు అమ్మకం ద్వారా మరల గ్రంథాలయమునకు సొమ్మును రాబట్టవచ్చును.

విద్య నెఱుంగనివాడు మర్త్యుడే

—ఏనుగు లక్ష్మణకవి

## గ్రంథాలయములు - ప్రచారము

ఆధునిక సమాజములో ఉద్యమము జయప్రద మగుటకు ప్రచారము ఆవశ్యకము.

గ్రంథాలయములకు ప్రజల నాకర్షించి విజ్ఞాన ధనము నొసంగుటకు ఈ క్రింది విధానములు వుపకరించును.

1 ఆకర్షణీయమగు గ్రంథాలయ ఫలకము.
2. ప్రొజెక్టరుద్వారా సినిమాలు చూపుట.
3 పట్టణములలో సినిమాహాల్సులో స్లయిడ్సు వేయించుట.
4. వార్తాపత్రికలలో ప్రచురణ
5. రేడియో కేంద్రములనుండి ప్రచారము.
6. సాహిత్య గోష్ఠులు జరుపుట.
7. గ్రంథాలయ పుస్తకముల పట్టికలు అచ్చు వేయించి సభ్యులకు పంచిపెట్టుట.

## ఉద్యోగుల బాధ్యతలు

ఈ గ్రంథాలయాల నావను నడుపుటకు అందలి ఉద్యోగులే చుక్కాని నడుపు సరంగులు. వారు నమ్రత, శాంతి, సహకార భావము, ఓర్పు, లౌకికము కలిగి, గ్రంథాలయాలను ఆదర్శవంత

మైన పద్ధతులలో నడపిన యీ నావ తన గమ్య స్థానమును చేరి, వుద్యమము జయప్రద మగును. ప్రభుత్వ ఆశయము, ప్రజల వాంఛలు నెరవేరును. ఉద్యోగుల కృషి ఫలప్రదమై ఆత్మ సంతృప్తి కలుగును.

మరియూ

చాలీచాలని వేతనములతో, గడచీగడియని అసుకుల బొంత బ్రతుకునుండి తప్పించి. జీవన వ్యయ ప్రమాణమును బట్టి జీతములు నిర్ణయించి, ఉద్యోగులను ప్రోత్సహించుట తృప్తిపరచుటయూ ధర్మము సంసార ఆర్థిక బాధలనుండి విముక్తులై కార్యరంగమున దుమికి యీ గ్రంథాలయ మహోద్యమమునకు యశస్సును చేకూర్చుటకు వీలగును.

ఉద్యోగులు ఎంత అప్రమత్తులై యున్ననూ గ్రంథాలయ స్వంత భవనము, కిటికీలకు వైరు నెట్టింగ్ (Wire Knetting) కొంటను పద్ధతి లేనిచో ప్రతి గ్రంథాలయములోను గ్రంథములు పోవుట సంభవించుచున్నది. గ్రంథాలయ వుద్యోగులు తమ స్వల్ప వేతనములనుండి పుస్తకముల వెల చెల్లించవలెనని భయంతో, బాధ్యతల విస్మరించి పుస్తకములపైనే తమ మేధస్సును కేంద్రీకరించి-యెడల గ్రంథాలయ వుద్యమ వునికికి అరిష్టము వాటిల్లనచ్చును. కనుక పోయిన పుస్తకములకు తగిన కారణములు చూపబడిన, రద్దుచేయు పద్ధతి (Write of) అవుసరము.

పౌర గ్రంథాలయాల సక్రమ నిర్వహణకు వ్యక్తిగత బాధ్యత మాత్రమే చాలదు. సమిష్టి కృషి శాసన విధేయత ప్రజల సహకారము ముఖ్యము.

అట్టి సమగ్ర పాలనకొరకు, విజ్ఞాన కుసుమములు సాంఘిక జీవనంలో వికసింపచేయుటకు, శాఖాధిపతులు, ఉద్యోగులు, సాహితీ ప్రియులు, వైజ్ఞానిక వేత్తలు ఉద్యమంలో తలలు నెరసిన పెద్దలు, గ్రంథాలయ సేవకు దీక్షబూని వారి జీవితాలనే అంకితము చేసినారు, చేయుచున్నారు. భరత గడ్డను పునీతము గావించిన అట్టి జ్ఞానధనులకు, త్యాగమూర్తులకు, సాహితీ ప్రియులకు నా ప్రణామములు.

జై హింద్!



# గ్రంథాలయము - ప్రజల విశ్వవిద్యాలయము


శ్రీ యస్. ఆర్. రంగనాథన్

గౌరవ ఆచార్యులు, డాక్యుమెంటేషన్ పరిశోధన శిక్షణకేంద్రము, బెంగుళూరు.


బుద్ధికుశలతా కొలబద్దలో రెండుకోణాలు బహు విధములైన విజ్ఞానాన్ని సముపార్జన చేయుటకు వ్యాప్తి చేయుటకు తోడ్పడు సంస్థగా విశ్వవిద్యాలయాన్ని తీసుకొనవచ్చును. ఇంతకాలంగా సాధారణస్థితి గలవారికంటె పై అంతస్తులో ఉంటూ, విద్యాస్థాయి, బుద్ధికుశలత గలవారికి మాత్రమే దానిసేవ వినియోగిస్తున్నది. మనదేశంలో, ఉన్నత వర్గంలోగల నూటికి నలుగు రైదుగురుతప్ప మిగతా వారు విశ్వవిద్యాలయ విద్యనుగాని, లేదా విశ్వవిద్యాలయ జీవితాన్నిగాని చవిచూచి ఎరుగరు. గత రెండు శతాబ్దాలుగా నెమ్మదిగా వ్యాపిస్తున్న ప్రజాస్వామ్యభావన సమాజంలోని వ్యక్తుల నందరను యితరులనుండి సాధ్యమయినంత తక్కువ సహాయంతో స్వయంగా విద్యను ఆర్జించమని ప్రోత్సహిస్తోంది. చురుకుగా ఉన్న దేశాలు యీ ప్రజాస్వామ్య సందేశాన్ని వెంటనే గ్రహించాయి. ఉదాహరణకు బ్రిటన్ దేశం వంద సంవత్సరాల క్రిందటనే గ్రహించింది. దీనివలన ఉపయోగం ఏమయినా ఉంటుందా? చిరకాలంగా ఉంటున్న విశ్వవిద్యాలయాలు బుద్ధికుశలత తక్కువగా నున్నవారి విషయం పట్టించుకోవడంలేదు. దేశం దృష్టితో చూచినట్లయితే మొత్తంమీద యిలా చేయడం సబబుకాదు. సమాజంలోగల హెచ్చుమందికి విజ్ఞాన ప్రచారం చేయడం విశ్వవిద్యాలయంయొక్క ప్రధాన ఆశయం. ఇందునిమిత్తం స్థానికంగాఉన్న సామాన్యులను తీసుకొని, ప్రోత్సహించి పరిశోధనచేయించి, వారిలో సమగ్రత వచ్చేవరకు కృషి చేయవలసియున్నది.

ఏమైనప్పటికీ బిర్క్‌బెక్, లార్డు బ్రూహమ్ కృషి ఫలితంగా చాల విశ్వవిద్యాలయాలు సామాన్య మానవునికి విజ్ఞాన ప్రచార నిమిత్తం విస్తరణ శాఖలను యితోధికంగా వృద్ధిచేసినవి. ఈ విషయంలో విశ్వవిద్యాలయాలతో కార్మికుల విద్యా సంఘాలు చేతులు కలిపినవి.

బుద్ధికుశలతా కొలబద్దలో మధ్యగలవారు ఈ నూతన సంస్థలు అవసరమని అందరూ గుర్తించారు. కాని అవి బహు తక్కువగా ఉన్నాయి అవి రెండు సందర్భాలలో అసమగ్రంగా ఉన్నాయి. ఒకటి-ఆ సంస్థలు సమాజం మొత్తానికి సరిపోవకపోగా విశ్వవిద్యాలయద్వారా అందరికిచేర్చలేవు. రెండు - ఆ సంస్థలు కేవలం శరీరక కృషిపై ఆధారపడుతూ బుద్ధికుశలతా కొలబద్దలో చివరనున్న వారికి మాత్రమే ఉపయోగపడతాయి. కనుక బుద్ధికుశలతా కొలబద్దలో నడుమనున్న మధ్యతరగతికి చెందినవారు, యిద్దరిచేతను అంటే ఒకవైపున విశ్వవిద్యాలయాలచేతను, విశ్వవిద్యాలయ విస్త

రణశాఖ, కార్మికుల విద్యా సంఘాలచేతను తిరస్కరింప బడుతూ ఉన్నారు.

## బ్రిటన్ ఉదాహరణ.

ప్రజలందరి అవసరాలను ఆదుకొనే నిమిత్తం 18 వం॥ సంవత్సరంలో పౌరగ్రంథాలయాలచట్టం బ్రిటన్‌లో అమలులోకి తేబడింది. ఈ చట్టాన్ని ఆమోదించే ముందు పార్లమెంటు కొన్ని విచిత్రమయిన చర్చలుచేసింది. ఆ పాతకాలపు రోజులలో పార్లమెంటులో పెద్దతరగతివారు, మధ్యతరగతివారు అధిక సఖ్యలో ఉండేవారు. కొద్దిగా క్రింది తరగతి వారుండేవారు పౌరగ్రంధాలయాలు ప్రారంభించటం వలన కార్మికలోకంలోని శాంతిని కల్లోల పరుస్తుందని పెద్ద తరగతి ప్రతినిధులు భయాన్ని వ్యక్తపరిచారు. అంతేగాక ప్రజలలో విజ్ఞానం ప్రబలినట్లయితే ప్రస్తుతమున్న వ్యవహారాలపై విప్లవం చెలరేగుతుందని భావించారు. మధ్య తరగతికి చెందిన ప్రతినిధులు యీ చట్టాన్ని బాగా బలపరిచారు. ఎందుచేతనంటే విశ్వవిద్యాలయాలనుండి తమకు లభ్యంగాని విజ్ఞానం, సమాచారం పౌర గ్రంథాలయాల నుండి పొందవచ్చని భావించారు శ్రామికలోకం దీనిని కార్మిక విద్యా సంఘాలనుంచి పొందుతున్నది. కొద్దిపాటి మెజారిటీతో పార్లమెంటు యీ చట్టాన్ని ఆమోదించింది అయితే అర్ధశతాబ్దం వరకు యీ చట్టం దరికి రాలేదు ఎందుచేతనంటే ప్రజలు పౌర గ్రంథాలయాన్ని ప్రజా విశ్వవిద్యాలయంగా గుర్తించడం చాల నిదానంగా జరిగింది. గతయాభై సంవత్సరాల కాలంలో మధ్యతరగతిలోనూ, శ్రామిక లోకంలోనూ పౌర గ్రంథాలయం యొక్క ఉపయోగాన్ని ఎంతగానో గుర్తించారు. కార్మిక విద్యాసంఘాలు పౌర గ్రంథాలయాల నుంచి పుస్తకాలు తీసుకోనారంభించినవి. మధ్యతరగతివారు ఎన్నడూ ఊహించనంత సంఖ్యలో పుస్తకాలు తీసుకోనారంభించారు ఏమైనప్పటికీ రెండు దశాబ్దాలక్రితం వరకు పౌర గ్రంథాలయాలలో పుస్తకాలు విజ్ఞానాన్ని పెంచుకొనేందుకు గాక కేవలం కాలక్షేపంకోసం చదివేవారు కాని. యిలా అలవాటునుంచి పౌర సంబంధాల వ్యాపకాలతో విజ్ఞాన సముపార్జనకు చదివే అలవాటుగా మార్చటానికి గ్రంధాలయసిబ్బంది తీవ్రమయినకృషి సల్పింది. దాదాపు ఐదు సంవత్సరాలక్రితం బ్రిటన్ సామాన్య ప్రజలు పౌర గ్రంథాలయాలనుంచి తీసుకువెళ్ళే పుస్తకాలను పరిశీలించే అవకాశం నాకుకలిగింది. వానిలో దావాపు 75% పుస్తకాలు ప్రకృతి శాస్త్రములు, దాని సంబంధమైనవి లేదా సాంఘిక శాస్త్రానికి సంబంధించినవై వుంటున్నాయి. 1956 సంవత్సరంలో సూయజ్‌కాలువ గొడవలో యూగ్రెక్ ప్రభుత్వం తీసుకొంటున్న చర్యను గురించిన వివరాలు విస్పష్టమైన రీతిలో ప్రజలు పౌర గ్రంథాలయంనుండి పొందటం నేను ప్రత్యేకంగా గమనించాను. సాంకేతిక విజ్ఞానంవైపు చూచినట్లయితే, అనేక నగర గ్రంథాలయాలలో ప్రత్యేకమయిన సాంకేతిక విజ్ఞానశాఖలను ఏర్పరచి, తమ సాంకేతిక విజ్ఞాన సముపార్జనలో ప్రజలకు చేయూతనిచ్చుటకు ప్రత్యేకంగా ఆయా గ్రంధ భాండాగారులను నియమించుటలో అవసరాన్ని గుర్తించారు. అదేవిధంగా అనేక నగర గ్రంథాలయాలలో లలితకళలు, వాణిజ్యం మొదలయిన ప్రత్యేక శాఖలు ఏర్పరుచబడినాయి. దీనినిబట్టి చూచినట్లయితే బ్రిటన్ దేశంలో పౌర గ్రంథాలయం నిజమైన ప్రజల విద్యాలయంగా ఎంతోబాగా రూపొందిందో తెలుస్తుంది.

## బరోడా, ఆంధ్ర దేశములు.

ఒకసారి మనదేశంలోని పరిస్థితిచూదాము. బ్రిటన్ దేశంలో ప్రజాస్వామ్యభావన పౌర గ్రంథాలయ అవసరాన్ని గుర్తించినప్పుడు మన సమాజం యింకో సాంస్కృతిక అలసట నుండి కోలుకోలేదు భారతీయ సమాజం మరోయాభై సంవత్సరాలవరకు సుషుప్తావస్థలోనే ఉంది. మనదేశంలో పౌర గ్రంథాలయాన్ని ప్రజల విశ్వవిద్యాలయంగా యువకులు గుర్తించలేదు విజ్ఞానవంతుడైన మహారాజు గుర్తించాడంటే మీకు ఆశ్చర్యం వేస్తుంది ఆయనే బరోడా మహారాజు శాయజీరావు గయక్వాడ్. ఆయన బరోడా రాష్ట్రంలో ప్రజలకు స్వచ్ఛందంగా గ్రంథాలయసేవను ప్రసాదించాడు. ఇది ఆంధ్రదేశంలోని ప్రజలకు ఎంతో ప్రోత్సాహాన్నిచ్చింది.

మధ్యతరగతికి చెందిన కొందరు స్వచ్ఛంద సేవకులు ప్రజలలో గ్రంథాలయ అవసరాన్ని రేకెత్తించారు. అంతేగాక స్థానికసభలు, జిల్లాసభలు, రాష్ట్రసభలు జరిపి 1920 సంవత్సరంనుంచీ ప్రజలలో గ్రంథాలయ చైతన్యంకలిగించారు. వారి ఉత్సాహాన్ని నేను 1912 సంవత్సరంలో కళ్ళారా చూశాను. ఆ సంవత్సరం హిందుపూర్‌లో జరుగుతున్న 24 వ. ఆంధ్రదేశ గ్రంథాలయ మహా సభకు నా మిత్రుడు డి. కృష్ణయ్య నన్ను ఆహ్వానించాడు. ఆ మహాసభ రోజన పట్నమంతా పండుగవాతావరణంలో కలకలలాడింది. 24 జతల ఎడ్లు లాగుతున్న బండిపైన నన్ను కూర్చోబెట్టారు. ఆ బండి నగరంలోని ప్రధానమైన వీధులగుండా వూరేగింది. ఆ సభామంటపం నృత్య, సంగీత, నాటకాలతో నిండిపోయింది. ఆ విధంగా గ్రంథాలయసేవ సామాన్య మానవునిలో నాటుకొని పోయింది.

## మద్రాసు

ఆరోజులలో, ఉత్తర సర్కారులు, దత్తమండలం, తమిళనాడు, మలబార్, దక్షిణకెనరా — లతో అవిభక్తంగా ఉండేది. ఈ విశాల ప్రదేశంలో పౌర గ్రంథాలయాలు స్థాపించే నిమిత్తం 1928 సంవత్సరంలో మద్రాస్ గ్రంథాలయ సంఘం ఏర్పరుచబడింది. ఈ సంఘం యీ సమస్యను ఎదుర్కొనటంలో ఆంధ్రప్రదేశ గ్రంథాలయ సంఘంకంటె కొంచెం భిన్నమయిన పద్ధతిలో నడిచింది. ప్రతినగరంలోనూ, పెద్దగ్రామాలలోనూగల స్థానికమైన స్వతంత్రమైన చిన్న గ్రంథాలయాలు స్థానిక ప్రజందరకు సాధ్యమయినంతవరకు వివిధరకాల సమాచారంగల పుస్తకాలను అందించలేవని ఆదిలోనే సంఘం గ్రహించింది. కనుక యీ సంఘం రాష్ట్రానికంతకు ఒకే గ్రంథాలయ వ్యవస్థ ఏర్పాటు చేయుటకు కేంద్రీకరించింది అది సఫలమైనపుడు మాత్రమే వివిధ విషయ విభాగాలపై వివిధ స్థాయీలలో చాలనన్ని పుస్తకాలు రాష్ట్రంలోని ప్రజలందరకు అందుబాటులో నుండగలవు. పౌర గ్రంథాలయాన్ని ప్రజల విశ్వవిద్యాలయంగా మార్చబడిన అవసరం ఉంది. కనుక మద్రాస్ గ్రంథాలయ సంఘం పరిపూర్ణమైన గ్రంథాలయవ్యవస్థ అవసరమని, అది విజయవంతం కావడానికి పౌర గ్రంథాలయ చట్టం కావాలని ప్రజలకు తెలియపరచటమే ప్రధాన కార్యక్రమంగా తీసుకొంది. మద్రాస్ గ్రంథాలయ సంఘంవారి ఆశయానికి అనుసరణగా, నేను 1930 సంవత్సరంలో మాదిరి పౌర గ్రంథాలయ చట్టం ముసాయిదా తయారుచేశాను. దానిని శ్రీబషీర్ అహమ్మద్ 1934 సంవత్సరంలో శాసనసభలో ప్రతిపాదించబడింది. అయితే అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం దానికి సుముఖంగాలేదు, అంతేగాక నాటి శాసన సభ్యులు యీ చట్టం సౌమ్యంగా ఆమోదం పొందటానికి కలసి పనిచేయలేదు. 1936 సంవత్సరంలో గౌర్నమెంటు ఆఫ్ యిండియా చట్టం రావడంలో ప్రభుత్వం పడిపోయి, యితరబిల్లులతో బాటుగా గ్రంథాలయ బిల్లుగూడ పడకవ పడిపోయింది। ఏమయినప్పటికి యీ సంఘం ప్రతిజిల్లాకు, తాలూకాకు ప్రతినిధులకు పంపి గ్రంథాలయచట్టం కొరకు ఆందోళన చేయమని పురిగొల్పింది. గ్రంథాలయచట్టం అమలుజరిపిన సహకరింతుమని జిల్లా బోర్డులు, తాలూకా బోర్డులు, పురపాలక సంఘాలచే తీర్మానాలుగూడ చేసినవి.

## పౌర గ్రంథాలయ వ్యవస్థ

దాదాపు రెండు దశాబ్దాలపాటు పౌరులతో సంబంధాలు నెరపుతూ నిర్విరామంగా కృషిచేశాకగాని ఫలితానికి రాలేదు. నిజానికి మనం స్వాతంత్ర్యం పొందువరకు ఆగవలసి వచ్చింది. 1916 సంవత్సరంలో మద్రాస్ ప్రభుత్వంలో విద్యాశాఖకు మంత్రిగాఉన్న శ్రీ అవి నాశలింగం, తన విద్యార్థి దశలోనూ ఆతర్వాత పౌర జీవితంలోనూ మద్రాస్ విశ్వవిద్యాలయం చేస్తున్న అపారమైన గ్రంథాలయ సేవను కళ్ళారాచూచి, దానికి మరింత వృద్ధిచేయాలనే తలంపుతో, భారత గ్రంథాలయ కోరికపై నేను 1942 సంవత్సరంలో తయారుచేసిన మాదిరి పౌర గ్రంథాలయ బిల్లును తీసుకొన్నారు. బొంబాయిలో 194! సంవత్సరంలో జరిగిన భారతగ్రంథాలయ మహాసభ తాలూకు ఒక సమావేశంలో చర్చింపబడింది. మంత్రివర్యుల కృషిఫలితంగా యీ చట్టం

1947 సంవత్సరంలో ఆమోదింపబడి 1948 సంవత్సరం నుండి అమలులోకి తేబడింది. నిదానంగానూ, క్రమబద్ధంగానూ యీ చట్టం అమలుపరచటం వలన నేడు ఆంధ్ర ప్రదేశ్‌లోనూ, మద్రాస్‌లోనూ గ్రంథాలయసేవ ఒక గాడిన పడింది. ఈ గ్రంథాలయ వ్యవస్థను ప్రధానస్థానంగా ఒక రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం, జిల్లా గ్రంథాలయాధికారి అధీనంలో ప్రతిజిల్లాకు ఒక కేంద్రకార్యాలయము, శాఖా గ్రంథాలయాధికారి అధీనంలో 10,000 లేదా అంతకుమించిన జనాభాగల పట్నాలలో ఉపకేంద్రాలు పనిజేస్తున్నవి. డాక్టరు కృష్ణరావుగారు 1952 సంవత్సరంలో అవిభక్త మద్రాస్ రాష్ట్రంలో విద్యాశాఖకు మంత్రిగాఉన్నారు, అప్పుడు వారు పౌర గ్రంథాలయాన్ని ప్రజల విశ్వవిద్యాలయంగా చేయటానికి ప్రత్యేకమైనశ్రద్ధ తీసుకొన్నారు. ఇందునిమిత్తం ఆంధ్రదేశంలో స్థానిక గ్రంథాలయ సంస్థల అధ్యక్షులను, ప్రతినిధులను సంప్రధించమని నన్ను ఆహ్వానించారు. ఈ సమావేశం పటమట లంకలో జరిగింది. పౌర గ్రంథాలయ సేవను అభివృద్ధిచేయుటకు ఉద్దేశించబడిన విద్యాశాఖ యిందు నిమిత్తం ఏమాత్రం కృషిచేయడంలేదు. ఉత్సాహం చూపించడంలేదని యీ సమావేశంలో తేల్చారు. ఎందుచేతంటే విద్యాశాఖ ఒక శతాబ్దకాలంగా వేళ్ళు పాతుకొనిపోయి సాంప్రదాయకమైన జానిసత్వం, పనిలో నిష్కారణమైన జాగుకి అలవాటైపోయిందని గ్రహించబడింది. కనుక, పౌర గ్రంథాలయ చట్టంలో తీవ్రమైన సవరణలుచేసి నిజమైన ప్రజా విశ్వవిద్యాలయంగా చేయడం అవసరమని భావించారు. ఆ చట్టంలోని లోపాలను వివరిస్తూ, జరిగిన, జరుగుతున్న పనిని సమీక్షిస్తూ పుస్తకం కూడ తయారుచేశాను ఇంతలో మద్రాసురాష్ట్రం (ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది) విడిపడింది. డాక్టరు కృష్ణరావుగారు ఆఫీస్ వదిలిపెట్టారు నేటికి పది సంవత్సరాలు గడచినప్పటికి వారి అభిప్రాయాలు కార్యరూపం దాల్చలేదు. పౌర గ్రంథాల వ్యవస్థ కార్యరూపం దాల్చినప్పటికీ సజీవమైన ప్రజావిశ్వ విద్యాలయం కావడానికి స్థాపిత చాలలేదు. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం 1962 సంవత్సరంలో స్థానిక గ్రంథాలయ సంస్థల అధ్యక్ష. కార్యదర్శుల సదస్సు నిర్వహించడానికి నన్ను ఆహ్వానించింది నిష్కపటంగా చర్చించుకొని పౌర గ్రంథాలయాన్ని నిజమైన విశ్వవిద్యాలయంగా చేసేందుకు కొన్ని నిర్ణయాలు చేశాము. సదస్సు పూర్తయిన వారం రోజులలోగా యిచట జరిగిన నిర్ణయాలను పొది చేసేందుకు దీనిపై వ్యాఖ్యలుచేసేందుకు దీనిపై నివేదిక తయారుచేశాను. నివేదిక ప్రతిని పౌర గ్రంథాలయశాఖ డైరెక్టరుకేగాక, విద్యాశాఖ మంత్రిగారికికూడ పంపాను. ఒక సంవత్సరం గడచిపోయింది సదస్సులో జరిగిన నిర్ణయాలపై యింతవరకు ఏ చర్య తీసుకొన్నది. తీసుకోవలసినది నాకు తెలియచేయవలసిఉంది. దీనిపై ఏ నిర్ణయాలు తీసుకొన్నది. పౌరులు తమంతటతామే వత్తిడిచేస్తేతప్ప, యీ సదస్సుకోసం ఖర్చుపెట్టిన అమూల్యమయిన ప్రజాధనం, సమయం వృథా అయిపోగలదని, నా వ్యక్తిగత అభిప్రాయం. దురదృష్ట వశాత్తు మనదేశం యింక "ఆరంభశూరత్వం – అల్పక్రియ" సిద్ధాంతాన్నే నమ్ముకొన్నట్లుగా కనబడుతోంది ఆంధ్రదేశ ప్రజలు గ్రంథాలయరూపంలో ప్రజా విశ్వవిద్యాలయా అవసరాన్ని కోరుకొంటున్నారు. మేము ఆంధ్రదేశ ప్రజలకు పౌర గ్రంథాలయ వ్యవస్థతో ఆయురారోగ్య వంతులుగా ఉండవలెనని కోరుతున్నాము అంతేగాక వారు స్థానిక గ్రంథాలయ సంస్థలకు ముఠారాజకీయాలలోకి, అధికార రాజకీయాలలోకి దిగజారకుండానూ, 'విభజించి పాలించు' అనే సిద్ధాంతానికి కట్టుబడకుండా చూడవలసియున్నది. ఆవిధంగా చేయడం వలన వారు ఆంధ్రప్రదేశ్‌కు సాయపడటమేగాక యితర రాష్ట్రాలకు మార్గదర్శకులు అవుతారు.

## పుస్తక ఉత్పత్తికి ప్రోత్సాహము

పౌర గ్రంథాలయ వ్యవస్థను ఏర్పరచి దానిని ప్రజల విశ్వవిద్యాలయమని చెప్పుకొంటూ, నిరంతరాయం పుస్తకాలను అందు చేర్చకపోతే అది, ప్రజలు తాగటానికి వీలులేని మంచినీటి భావిని త్రవ్వినట్లుగా ఉంటుంది. కొలది శతాబ్దాలుగా మనదేశం సాంస్కృతికంగా వెనుకబడిపోయింది. కొంతకాలంగా ప్రజాస్వామ్య భావన పౌర గ్రంథాలయ రూపంలో ప్రజల విశ్వాలయాన్ని రూపొందించుటకు

పురిగొల్పుతూంది. ఈ శతాబ్దాలలోనే పశ్చిమదేశ భాషలు సామాన్య మానవునిలో విజ్ఞాన ప్రచారం చేయడానికి తోడ్పడుతున్నాయి. ఈ భాషలో పొదిగిన విజ్ఞానము, అనుసరించిన శైలి సామాన్య మానవునికి సులభంగా అర్థమౌతున్నాయి. సాంస్కృతికంగా వెనుకబడిపోవటాన, కొలది శతాబ్దాలపూర్వం మనభాషకు యిందుకు పనికిరాకుండా పోయినవి. తొమ్మిది శతాబ్దాలనాడు మనభాషలకు యిందునిమిత్తపు సముజ్జీవనం కల్పించబడింది. నేడు వాటిని మరల కొత్త మూసలో పోయాల్సిన అవసరంవుంది. తొమ్మిది శతాబ్దాలంటే తక్కువకాలంకాదు, సామాన్యమానవునికి అందుబాటులో వుండేవిధంగా పుస్తకాలు, పత్రికలు అచ్చయితే తప్ప పౌర గ్రంథాలయం ప్రజల విశ్వవిద్యాలయంగా పని చేయజాలదు. కాబట్టి, ప్రజా విశ్వవిద్యాలయానికి అవసరమయిన పుస్తకాల వుత్పత్తిని ప్రోత్సహించడం స్థానిక గ్రంథాలయ సంస్థలు, పౌర గ్రంథాలయశాఖ తమ అదనపు బాధ్యతగా స్వీకరించాలి స్థానిక గ్రంథాలయ సంస్థలన్నీ కలసికట్టుగా పనిజేసేట్లయితే ప్రతిరాష్ట్రంలోనూ యీ విధమైన పుస్తకాలుచక్కగా అందించవచ్చును. మనసమాజంలో రచయితలు యీ అవకాశంకోసం ఎల్లప్పుడూ ఎదురు చూస్తూనేవున్నారు. 1962 సంవత్సరంలో హైదరాబాదులో జరిగిన సదస్సులో యీ విషయంగూడ పరిశీలించ బడింది. ఇందునిమిత్తం ప్రభుత్వం తగిన చేయూతనివ్వక పోయినా కనీసం స్థానిక గ్రంథాలయసంస్థలు తగినచర్య తీసుకోవాలి, కనుక, మత, తత్వశాస్త్ర గ్రంథాలు పునర్ముద్రించడమే గాక, కళలు, వృత్తులు. ప్రాథమిక విజ్ఞానశాస్త్రములు, లలిత కళలు, ఆర్థికశాస్త్రము, భూగోళము, చరిత్ర, రాజకీయ శాస్త్రము మొదలయిన అనేక విషయాలపై పుస్తకాలు ఉత్పత్తి చేయమని ఆర్థిస్తున్నాను. నేర్పుగా ప్రణాళికవేసి పనిజేసినట్లయితే మన దేశ భాషలలో ప్రస్తుతంగల కరువు పది సంవత్సరాలలో రూపు మాయగలదు. మరొకమాటలో చెప్పాలంటే పదిసంవత్సరాలకాలంలో మన గ్రంథాలయాలు ప్రజల విశ్వ విద్యాలయాలుగా రూపొందగలవు. *

# గ్రంథాలయములు - ఉత్తమ సాహిత్యము

శ్రీ జాస్తి వేంకటనరసయ్య



"యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" అన్నట్లు మనసులోని భావములనుబట్టియే మన జీవిత నిర్మాణము జరుగుచుండును. శ్రీ కృష్ణుడు భగవద్గీతలో అర్జునుని గురించి

"యంయం వాపిస్మరన్ భావం త్యజంత్యంతే
కళేబరం తంతమేవైతి కౌంతేయ సదా
తద్భావభావితః"

అని భావనాశక్తి మహత్తరమైనదనియు దానిని బట్టియే పునర్జన్మ గూడ ఏర్పడుచుండుననియు చెప్పియున్నారు. ఎల్లసమయములందు డిటెక్టివు నవలలను చదువుచున్న యువకుడొకడు అమెరికా దేశమందు డిటెక్టివ్ వలే అనుకరణ జేయును. తనయొక్క తల్లిని, పిస్తోలుతో కాల్చి చంపినట్లు పత్రికలలో మనము చదివియున్నాము కూచి పూడి నాటక సమాజములో నొకప్పుడు నృసింహావతారము ధరించినవాడు హిరణ్యకశిపు వేషము ధరించినవారిని ఉద్రేకములో రొమ్ము బ్రద్దలుగా చీల్చినట్లును, ఆయన చనిపోయినట్లును విని యున్నాము

బోయవాడొకడు ముని వేషము ధరించి తపస్సు జేయుచున్నట్లు నటించెను. పక్షులు విశ్వసించి అతనిపై వ్రాలెను. వానిని పట్టి తినగోరి ఆ వేషము ధరించిన ఆ బోయవాడు, వానిని విడచి నిజముగా సన్న్యాసి యయ్యెను. "వేషము ధరించినంత మాత్రముననే ఈ పక్షులు నన్ను నమ్మినవి నిజముగా 'మునిని' యగుచో నే నెంత ధన్యుడ నగుదునో కదా" యని యాతడు తలంచెను వేమనయోగి, "చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా, భాండశుద్ధిలేని పాకమేల" యని సంఘాన్ని ప్రశ్నించెను. కాన జీవితమునకు హృదయ పవిత్రత అత్యవసరము. యువకులు పవిత్ర భావసముపేతులై దేశభక్తులు కావలయును.

గ్రంథాలయాధికారి పాఠకులలో పెద్దవారిని గౌరవించుచు, చిన్నవారిని సోదరులనుగా భావించుచుండవలెను భాండాగారి భిన్న మనస్తత్వముగలవారైన పాఠకులను పొందుచుండును. కొందరు నిరుపయోగకరమైన గ్రంథ సమూహమును చదువుచు కాలమును వ్యర్థముగా గడుపు

చుందురు. చెడ్డ విషయములు తొందరగా అలవడుట సహజము కాబట్టి, దానికి లోబడిపోవుదురు. త్రాగుడు, జూదము మున్నగు చెడులు అలవడునట్లు చెడు పుస్తకాలను చదువుటకూడ అలవడును. అంతట జీవితము పతనమగును. సంఘమునకు నష్టము కలిగించు గ్రంథములు గ్రంథాలయములందుంచకూడదు. ఎల్లప్పుడు కథా సాహిత్యమును చదువువారు క్రమ క్రమముగా అంతకన్నను మహత్తరములైన గ్రంథములను చదువుటకు ప్రయత్నింపవలయును. భాండాగారి, పాఠకుల చిత్తవృత్తులను గుర్తించుచు వారిని మొదట గ్రంథపఠనాసక్తులనుగ తయారు చేయుచు, తరువాత ఉత్తమ సాహిత్య పఠనాసక్తలనుగా వారిని తయారుచేయవలయును. గురువు విద్యార్థులను తయారుచేయునట్లు, పాఠకులను భాండాగారి తయారుచేయవలయును. భాండాగారి సద్గుణములను కలిగియుండి తన పరిచయముచే పాఠకులు, దేశభక్తులు, దైవభక్తులు అగునట్లు ప్రయత్నింపవలయును. పుస్తక పఠనము పూత జీవిత సంధాయకము.

సరసమంజుల కథాసల్లాపములతోడ
నొకమాఱు చిత్తమ్ము నూఁపు దీవు
జీవిత చరితముల్ చేదోడుగానిల్చి
మహనీయ నీతులన్ మనుతువీవు
విజ్ఞానదాయక విమల బోధలచేతఁ
బ్రజ్ఞా విశేషముల్ పలుకు దీవు
నవరస మాధురీ నానార్థ కల్పన
నొప్పుచు నానంద మొసఁగు దీవు

విశ్వ భూగోళ మండలి విషయజాల
మంతయునుగూడ నీయందు నమరియుండు
సర్వజనముల హితము నీసద్వ్రతమ్ము
పూత చారిత్ర నికడంబ! పుస్తకంబ!

చిత్తము శాంతతన్ విడిచి జీర్ణతనూధరరోగ రాజిన
యత్తముగాక మానవుఁడు హా! యని దుఃఖము
నొందునప్పుడున్
పొత్తమ! నీవ మానసికిఁ బోవని మిత్రమవై
హితమ్ములా
సత్తిని దెల్పుచుండెదవు సాత్త్విక వృత్తిని
తృప్తినిచ్చుచున్

భూత వర్తమానమ్ముల ఖ్యాత పురుష
బోధలన్నియు నీయందుఁ బొందగలము
మూఁడుకాలమ్ములందును ముదమునిచ్చు
సత్య శివసుందరమ్మగు సత్తువీవ

గ్రామ గ్రామమున గ్రంథాలయమ్ములు
విద్యాలయమ్ములు విస్తరిల్ల
భవనంబు లన్నింట వయసు వచ్చినవార
లక్షరాభ్యాసంపు శిక్షనంద
సంస్కృతి రక్షయు సద్గ్రంథ పఠనంబు
నిర్మాణ కృషియును నేర్పుమీఱ
మహిళాదిజాతుల మానిత స్వత్వంబు
విజ్ఞాన యాత్రలు వెల్లివిరియ

మూఁడుకోట్ల తెలుంగు సైదోడులార!
నవ్య సందేశ ధర్మంబు భవ్య ఫణితి
నాచరింపంగఁ జేయుఁడీ యమలులార!
సుజన మార్గంబు వీడని సూరులార!

కాలముయొక్క విలువను గుర్తించి నడుచుకొనవలయును. పోయిన సంపదను మరల సంపాదింపవచ్చును కాని పోయినకాలమును జీవితమునందు మరల సంపాదింపలేము "క్షణశః కణశశ్చైవ విద్యామర్థంచ సాధయేత్" అన్నట్లు ప్రతి క్షణమున విద్యను సంపాదించుటకు ప్రయత్నింపవలయును. అట్లే ప్రతి కణమును పోనీయక ధన మార్జింపవలయును. "అన్నే నక్షణికా తృప్తిః యావజ్జీవంతు విద్యయా" అన్నదానముచే క్షణకాలము తృప్తి నీయగలము కాని విద్యా దానముచే జీవిత పర్యంతము తృప్తిని కలిగింపగలము. కాబట్టి నూటికి 80 మంది నిరక్షరాస్యులు అనగా విద్యా విహీనులున్న మనదేశమందు విద్యాధికులు ముందుకువచ్చి విద్య లేనివారికి విద్యా దానమొనగ్రవలయును. విద్య వినయమును కలిగించును. వినయముచే మంచి పౌరుడగును పౌరులు కృషిచేసి ధనికులగుదురు. ధర్మాత్ములగుదురు. సుఖులగుదురు. "ఉద్యోగినం పురుష సింహము పైతి లక్ష్మీః" సోమరితనము మహా పాపము. దానిని విడచి కృషిచేయువారు విజయలక్ష్మీ సంపన్నులగుదురు. విద్యాసంపన్నులే హక్కులను, బాధ్యతలను గుర్తించుకొని నడచుకొనగలరు. వోటు విలువను గుర్తింపగలరు. నిరక్షరాస్యతను నిర్మూలించుటయే నేడు భారతదేశమునకు ప్రధాన సమస్య. విద్యాజ్ఞాన భాస్కరుడు విశ్వమందు వెలుగుచు అజ్ఞానాంధకారమును సంపూర్తిగా అంత మొందించుగాత.

# గ్రంథాలయము - దాని పరిపాలన

టి. వి. నరసింహారావు, B. A. DL. SC.
లైబ్రేరియన్, గుడివాడ.

గ్రంథాలయోద్యమ చరిత్రలో 19 వ శతాబ్ది పూర్వార్ధము యుగారంభమనదగును. ఆంగ్లదేశములో 1844లో గ్రంథాలయ శాసనం కొఱకు జేసిన యలజడి 1850 లో కార్యరూపము ధరించి, దేశవ్యాప్తముగా గ్రంథాలయస్థాపన జరుగవలెనను నుద్యమమునకు నాందీ వాచకము పలికినది. ఆంగ్లేయుల ప్రాభవమునకు లోనైన భారతదేశమునకు కూడ యీ యుద్యమము వ్యాపించినది అయితే 1808 లోనే బొంబాయి ప్రభుత్వము గ్రంథాలయ ప్రాముఖ్యతను గుర్తించిన విషయము మరువరానిది. ఆంగ్లేయుల ప్రభావం వలన బొంబాయి, మద్రాసు, కలకత్తా నగరములలో బృహద్గ్రంథాలయములు వెలసినవి. కాని భారత దేశము పరతంత్ర దేశమగుట చేతనూ, గ్రంథాలయోద్యమము శైశవదశలో నుండుటవలననూ నాటి గ్రంథాలయముల విధులు పరిమితముగా నుండెడివి. తత్ఫలితముగా సామాన్యప్రజల కందుబాటులో నుండెడివి కావు. పరిమిత సంఖ్యాకుల ప్రయోజనమునకే లక్ష్యమైన, ముద్రితా ముద్రిత గ్రంథము లాలయములే నాటి గ్రంథాలయములు.

నేడు మనం స్వతంత్రులం. మన యుద్యమముకూడ దేశవ్యాప్తముగా రూపొంది స్వతంత్ర భారత ప్రభుత్వపు యండ దండలతో నానాటికి యభివృద్ధి చెందుచున్నది. మన సాంఘికాభివృద్ధి పథంలో గ్రంథాలయములపాత్ర యత్యంత ప్రాముఖ్యమైనది. ఆర్థిక, రాజకీయ, కుల, మత, కలిమి లేముల వ్యత్యాసములతో నిమిత్తము లేకుండగ యందరకూ యుచితముగా గ్రంథాలయ ప్రవేశార్హత యున్నది. అక్షరాస్యులకది విద్యాకేంద్రం—నిరక్షరాస్యుల విజ్ఞాన కేంద్రం — కళాకారులకూ, కళాభిమానులకూ సాంస్కృతిక నిలయం — విద్యావంతులకది పరిశోధనాలయం. సర్వమానవ విజ్ఞానాభివృద్ధియే దాని పరమలక్ష్యం. ఈ లక్ష్యసాధనమే గ్రంథాలయోద్యోగి జీవిత పరమావధి. బహుముఖంగాయున్న గ్రంథాలయ బాధ్యతలను సమర్థవంతముగా నెరవేర్చు కార్యక్రమములో సిబ్బందిపాత్ర కీలకమైనది. ఈ లక్ష్యము నధిగమించుటకు పలువురు ప్రముఖులు పలువిధములుగా సూచించారు.

## పంచసూత్రావళి

ఆధునిక గ్రంథాలయోద్యమోన్నతికి సుశిక్షితమైన గ్రంథాలయ పరిపాలనావిధాన మమలు జరుగుటకొఱకు, భారతీయ గ్రంథాలయోద్యమ పితామహులూ, ప్రఖ్యాతిగాంచిన గ్రంథవర్గీకరణ విధాన నిర్మాతయైన శ్రీ డా॥ రంగనాథన్ పంచసూత్రావళిని శాసించారు.

1. పుస్తకాలుపయోగంకొఱకే : (Books are for use)
2. ప్రతి చదువరికీ తన యభిమాన గ్రంథం. (Every reader his book.)
3. ప్రతి గ్రంథమునకూ యొక చదువరి (Every book its reader.)
4. చదువరి కాలమును వృధాచేయకు? (Save the time of the reader.)
5. గ్రంథాలయము ప్రవర్థమానమయ్యే వ్యవస్థ (Library is a growing organism)

## పుస్తకాలుపయోగంకొఱకే!

ప్రతిమానవుడూ తన భావనా ప్రపంచములో స్వేచ్ఛావాయువులను పీల్చవలెననియూ, స్వతంత్ర భావముల బెం

పొందించుకోవలయునని యీ సూత్రము ప్రభోదించుతుంది. 16 వ శతాబ్దాంతమువరకూ గ్రంథములు కేవల మలంకార ప్రియములుగనే యుంచబడినవి. చదువరుల కందుబాటులో నుండెడివికావు. ఆనాడు పుస్తకమునను పదిలపర్చినవాడే యాదర్శ గ్రంథాలయాధికారి. ఈరోజున పుస్తకములను ప్రియముగ చదువరుల కందించినవాడే యాధునిక గ్రంథాలయాధికారి. ఈ సూత్రము ప్రాచీన గ్రంథాలయ విధులను నిరసించి తమసంకెళ్ళను త్రెంచుకొని పరుగుపరుగున వచ్చి పాఠకలోకమును దర్శించమని గ్రంథములకు హితవు చెప్పుచూయున్నది. పాఠకలోకం తమకుపయోగకరమైన గ్రంథములనుజదివి సన్మార్గవర్తులై స్వతంత్రాలోచనా శక్తిని పెంపొందించుకోవాలి — సంఘాభివృద్ధికి తోడ్పడాలి.

## ప్రతిచదువరికి తన యభిమాన గ్రంథం

తన కవసరమైన పుస్తకములేదనిగానీ, నచ్చిన గ్రంథం లభ్యం కాలేదనిగానీ నిరుత్సాహపడి నిస్పృహతో జదువరి తిరుగుముఖం పట్టు పరిస్థితి కలుగరాదు. అంటే మనమంతా జోస్యం నేర్చుకొనవలెనా? అవుసరంలేదు. దీనికి శాస్త్రీయమైన పద్ధతులున్నవి. గ్రంథాలయధికారి పుస్తకములను కొనుటకు ముందుగా

అ) స్థానిక ప్రజల యభిరుచులను సాకల్యంగా యాకళింపు చేసుకొనవలయును,

ఆ) చదువరుల సంఖ్య యెంత? సాలీనాయభివృద్ధి శాత మెంత?

ఇ) అసంఖ్యాక చదువరుల యభిరుచి యేవిధంగా యున్నది.—

వగైరా అంశములను పరిగణనచేసి గణనీయమైన సత్ఫలితముల బొందవచ్చును. ప్రతిసంవత్సరమూ మనం తయారు చేయు చదువరుల యభిమాన గ్రంథముల పట్టికలు మన కర్తవ్య నిర్వహణకు తోడ్పడగలవు.

## ప్రతి గ్రంథమున కొక చదువరి

పుస్తకముల నెన్నుటలోనూ కొనుగోలు విషయములోనూ వ్యాపార సరళిని ప్రదర్శించడమును లాభాపేక్షకుల వంచడమునూ తుదముట్టింప చేయుటయే యీ సూత్ర ధ్యేయము. గ్రంథాలయములోని ప్రతిపుస్తకమూ సాహిత్య సంపత్తిలో నొక అంశమైయుండ వలయును. సేకరించిన పుస్తకములు స్థానిక సాంస్కృతిక స్థాయికనుగుణ్యముగనూ ప్రామాణికములుగనూ యుండవలయును "శవ సాహిత్యమున"కుద్వాసన చెప్పవలసిన యగత్యమును గుర్తించవలయును. ఏ నాడూ — యెవరూ ఎరుగనిపుస్తకములను చెదురు చెదురుగా చూచు చుండుము ఈ యత్యవసర పరిస్థితులలో మన జాతీయాదాయము దుర్వ్యయమగుట సుతారాం సహించరాని విషయము. గ్రంథముల నెన్ను విషయములో మంచి చెడులు గ్రంథాలయాధికారి సొత్తు, సాంకేతిక శిక్షణ గ్రాహియగునతడే యీ విషయంలో నిర్ణేత. నాటి నుండి నేటివరకూ గ్రంథాలయోద్యమాభివృద్ధి కొరకు జీవితములను వ్యయపరచిన యనుభవజ్ఞులు మన జిల్లా గ్రంథాలయ సంఘసభ్యులగుట మన యదృష్టమే! సాంకేతిక విషయజ్ఞులూ; యనుభవజ్ఞులగు పెద్దలుండగా మన గ్రంథ సముచ్ఛయంలో "డొంకలో శవాలు"ఉండ నక్కరలేదు. మన మేమాత్ర మేమరుపాటుతో నుండి నా మనకున్న పుస్తకమునకు మరినాల్గు నకలు ప్రతులువచ్చి చేరగలవు. ఒక నకలు ప్రతి మన గ్రంథాలయములో ప్రవేశించినచో దానికి బదులుగా మరియొక క్రొత్తపుస్తకము మనకు కేటాయించబడు యవకాశమునుజారవిడుచు కొన్నట్లైకాగలదు. అట్లయిన ప్రతిగ్రంథమునకూ చదువరియను సూత్రపు ప్రాధాన్యత పోతుంది. అందుచేత నకలు ప్రతులు ప్రోగుపడటానికి గ్రంథాలయ సేవకులుగా మనం విముఖులం. అత్యంత ప్రామాణిక గ్రంథముల విషయములోనూ యొకే ప్రతిస్థానికావసరమును దీర్చలేనిస్థితి కల్గినినాడునూ పై నియమమును సూక్ష్మముగా సడలించవచ్చును. మనకీరోజున కేంద్ర గ్రంథాలయములో "యూనియన్ కేటలాగు"ను నిర్వహించ గల

యవకాశము లింకనూ లభ్యముకాలేదు. కాబట్టి నకలు ప్రతులు గుమికూడకుండగ చూచు బాధ్యతను శాఖాగ్రంథాలయాధికారులు తు. చ. తప్పక నెరవేర్చవలసిన యవుసరమెంతేని గలదు. కొనుగోలు జరుగు సమయమునకు మన కున్న గ్రంథములను మినహాయించి మిగిలిన క్రొత్త పుస్తకములను మాత్రమే తెప్పించుకొనవలయును.

### చదువరికాలమును వృథాచేయకు

నిత్యనైమిత్తిక కార్యక్రమములను ముగించుకొని తన విరామ కాలములో గ్రంథాలయము నుపయోగించుకొనవలయును కాంక్ష పాఠకులకుండుట పరిపాటి. విరామకాలమెవ్వరికిని పరిమితసమయం మనము పనిచేయు కాలము కూడా వారికి సానుకూలమైనదే! ఈ యమూల్య విరామసమయమును తన యభిమాన గ్రంథముతో గడుపవలెనని పాఠకులు తహ తహ లాడుదురు. చదువరికోరిన పుస్తకములను గ్రంథాలయాధికారి త్రుటిలో సంపాదించగల సమర్థుడై యుండాలి తన శిక్షణ పాటవమును ప్రదర్శించగల సమయమదే! మనయెడల గ్రంథాలయముపట్ల సద్భావమంకురించుటకిది చక్కని చిట్కా! ఉద్యమాభివృద్ధికి పట్టుకొమ్మన ప్రజాదరణ నొందుట సుసాధ్యమౌతుంది. ★

# నాటి దేవాలయములు - నేటి గ్రంథాలయములు

శ్రీ కాకాని నరసింహారావు

కవితా నిలయం, గుడివాడ.

## నాటి దేవాలయములు

సర్వ వ్యాపకుడు సర్వేశ్వరుడును అవాఙ్మానస గోచరుడునగు పరమేశ్వరుని సృష్టియందంతటను దర్శించుట కాక ఒక నిర్ణీత స్థలమున సాకారముగ రూపించి అర్చించి తరించుట కనువుగా జిజ్ఞాసులైన భక్తులు ఆగమ శాస్త్రానుసారముగ దేవాలయములను నిర్మించి దేవతావిగ్రహములను ప్రతిష్ఠించి ప్రాణప్రతిష్ఠ గావించి దివ్యస్థలమొనర్చి అర్చా విధానానుసారముగ పూజించుట కేర్పాట్లు చేసిరి. ఆనాటి దేవాలయముల మహిమ వర్ణింప తరముగాదు. దేవాలయము లేని గ్రామ ముండెడిదిగాదు. దేవాలయ మతి పవిత్రమైన స్థలముగా సర్వులచే భావించి గౌరవింపబడుచుండెడిది. వివాహములు దేవాలయములలో భగవంతుని సన్నిధానమున జరుగుచుండెను. దేవాలయము వివాహములకు సాక్షియై వెలుగుచుండెను. అభిప్రాయభేదము లంకురించి నిజమేదో నిర్ధారణ చేయవలసి వచ్చినప్పుడు దేవాలయమున ప్రమాణము చేయించుచుండువారు. ధర్మశాస్త్ర చర్చలు జరుగుటకు సభాభవనముగా దేవాలయములే ఉపయోగ పడెడివి. పరదేశస్థులు పరగ్రామస్థులు విడియుటకు ధర్మశాలగా దేవాలయ ముపయోగపడెడిది అన్నివిధములగు పనివాండ్రకు దేవాలయమునందు పని దొరకుటచే వారికది ప్రాపుగా నుండెడిది. యతీశ్వరులు సన్యాసులు దేవాలయమునందు విడిచి మత ప్రచారము చేయుటచే మఠముగా ఉపయోగపడెడిది భక్తులేతెంచి భక్తినిగూర్చి భగవంతుని వైభవాదికములగూర్చి ప్రజలకు తెలియజేయుటచే భక్తజనులకునికి పట్టుగా విరాజిల్లెడిది లలితకళా నిపుణులు తమ తమ కళా ఖండములను దేవాలయములందు ప్రదర్శించుటచే లలితకళా ప్రదర్శనశాలగా దేవాలయము రాణించుచుండెను. ప్రజలా కళాఖండములను చూచి కళాభిరుచిని పెంపొందించుకొనుచుండిరి. ప్రాకారములమీదను, దేవాలయము మీదను లోనను రకరకములైన పౌరాణిక చిత్రములు భక్తిజ్ఞాన వైరాగ్య బోధనములైన పద్యములు మహావాక్యములు చిత్రింపబడియుండెడివి. దర్శన మాత్రమున జ్ఞానము ప్రసాదించు జ్ఞానార్థుల పాలిటి కల్పవృక్షమై దేవాలయము నెగడుచుండెను. రాజకీయముగ రక్షణ మొసగు కోటగా

---

పలు సందియముల దొలఁచును
వెలయించు నగోచరార్థ విజ్ఞానములో
కుల కక్షి శాస్త్రమయ్యది
యలవడ దెవ్వరికి వాఁడె యంధుడు జగతిన్

—చిన్నయసూరి

కూడ విలసిల్లుచుండెను. ఈరీతిగా ఇది అది అని వర్ణింపనేల ఆ గ్రామ ప్రజలకు జీవనాధారమై జ్ఞానదాయకమై వారి పాలిట కామధేనువై ఆనందాంబుధియై సర్వ కళాశోభితమై నిత్య మంగళము పచ్చ తోరణమునై దేవాలయములు విరాజిల్లుచుండెను. కాయకష్టము నొనర్చి జీవించు కూలీలు మొదలు వేద వేదాంగ వేదాంత పారీణులైన మహా విద్వాంసులవరకు వేయేల సర్వజనులకు అందు ప్రవేశము కలదు. పని లభించెడిది. ఆదరణ ముండెడిది. గౌరవము కలిగెడిది. శిల్పులకు, కూలీలకు, వడ్రంగులకు తాపీపనివారలకు చేతిపనివారలు అందరికు పని దొరకుచుండెను విద్వాంసులు ఉపన్యాసము లిచ్చుచుండువారు. పౌరాణికులు పురాణములను చెప్పుచుండిరి. హరిదాసులు హరికథలను గానముచేయుచుండిరి భాగవతులు నాటకము లాడుచుండిరి తోలుబొమ్మలవారు ప్రదర్శనము లిచ్చుచుండిరి. సంగీత విద్వాంసులు పాటకచేరీలు చేయుచుండిరి. దేవదాసీలు నృత్యము చేయుచుండిరి. వేదపండితులు స్వస్తి చెప్పుచుండిరి. ఈవిధముగా దేవాలయములందే సాంఘిక జీవితమంతయు పుంజీభూతమై యుండెను. సర్వకళా ప్రదర్శనములు జరుగుచుండెను. ప్రజలకు సర్వకళలను చూచు భాగ్యము సర్వవిద్యల నెరుగు అవకాశము సర్వ కళాకారుల గౌరవించు అదృష్టము కలుగుచుండెడిది. సంఘశక్తుల కన్నిటికి ఆనాడు దేవాలయము మచ్చుల సావడి వంటిది పిన్నలు, పెద్దలు, విద్యావంతులు, విద్యావిహీనులు, విద్యార్థులు, ధనవంతులు. పేదలు, భక్తులు. లౌకికులు మొదలు వారను భేదము లేక సర్వులు రాదగిన క్షేత్రము. అచట సర్వులకు వారి వారి అర్హతనుబట్టి తగిన స్థాన ముండెను. సర్వులును ఆదరింపబడి గౌరవింపబడువారు. ప్రజలకు పరాపరవిద్యల నన్నింటిని సర్వకళలను తెలుసుకొనుట కవకాశము కలిగించు సర్వకళాలయములుగా నాడు దేవాలయములు వర్ధిల్లెను. వానిని రాజులు, ధనవంతులు నిర్మించి పరిపాలించి నిర్వహించుచుండిరి

---

నిలువు టద్దాలు సోఫాలు చలువరాతి
రెండు మేజాలు కుర్చీలు నుండుగాక,
మంచి గ్రంథముల్ లేని యా మందిరంబు
మందిరంబదిగా దొక్క బందిగాని.

—మధుర కవి

## నేటి గ్రంథాలయములు

గ్రంథాలయమునకును, దేవాలయమునకు అభేదము. దేవాలయమున భగవంతుడు విగ్రహరూపమున దర్శనమిచ్చును. గ్రంథాలయమున అక్షరరూపమున ప్రత్యక్షమగును. దేవాలయము లన్నియు గ్రంథాలయములే. గ్రంథాలయము లన్నియు వాగ్దేవతాలయములే. సరస్వతీ సదనములే, భారతీనిలయములే, శారదాసదనములే.

గ్రంథాలయోద్యమము వైజ్ఞానికోద్యమము లందెల్ల అగ్రగణ్యము. సర్వోద్యమములకు మకుటాయమానము. దీని ననుసరించియే తక్కిన రాజకీయ, మత, సాంఘిక, ఉద్యమములన్నియు నడచుచున్నవని ప్రపంచ చరిత్ర చాటుచున్నది ప్రత్యక్షముగా కనుపించుచున్నది. దృష్టాంతము లెన్నియైన చూడవచ్చును.

గ్రంథాలయ సేవ నిస్వార్థ మానవ సేవ.

స్వార్థ రహితమగు త్యాగము కలదు. సోదర మానవులు చదువను వ్రాయను నేర్చుకొని జ్ఞానవంతులు విజ్ఞాన ధనులై సోమరితనమును పారద్రోలి, ఆత్మగౌరవమునకు, అన్న వస్త్రములకు లోటులేని ఇహలోక సౌఖ్యమును ఆనందామృతాస్వాదనా రూపమను పరలోక సౌఖ్యమును పొందవలయునను సత్సంకల్పమే ఈ ఉద్యమమునకు పునాది. అదియే పరమావధి.

ముద్రణ సౌకర్యములు లేని పూర్వకాలమున గ్రంథములు తాటియాకులలో వ్రాయబడి సంపన్నులయొద్దను, పండితుల యొద్దను, దేవాలయములందు మాత్రమే భద్రపరచబడి యుండెడివి. జనసామాన్యమునకు వానిని పఠించు భాగ్యము, అవకాశము లేదు. వినుటకు మాత్రమే సావకాశము కలదు. సర్వశాస్త్ర పారంగతులైన పండితులు సద్గ్రంథములను ప్రవచనము చేయువారు. పౌరాణికులు పురాణములను శ్రావ్యముగా చదివి అర్థము వివరముగా చెప్పువారు. హరిదాసులు హరికథలు చెప్పి భాగవతులు భాగవతమాడి హరిభక్తిని ప్రబోధించువారు. వేద వేదాంత విద్యాప్రవీణులు మొదలుకొని మాలదాసరుల వరకు అందరు తాము నేర్చిన విద్యలను, కళలను ప్రదర్శించి, బోధించి సంఘజీవనము నియమవంతముగను ధార్మికముగను గడపుటకు తోడ్పడువారు. విద్యలను, కళలను ప్రబోధము చేయు వారిని ప్రదర్శించు వారిని ప్రజలు అన్న వస్త్రము లొసగి సత్కరించువారు. అందువలన నిరక్షరకుక్షులు కూడ వినుటచే, కనుటచే, కళారహస్యములను, విద్యా విశేషములను నేర్చుటయేగాక అక్షరమైన పరబ్రహ్మ జ్ఞానము సహితము పొందుటకు వీలుపడెడిది. నాటి జీవిత విధానము, విద్యా వ్యాసంగము కళాభిజ్ఞత్వతము లట్టివి. ఇప్పుడు కాలము మారినది పరిస్థితులు మారినవి. అభిరుచులు మారినవి. ప్రాచీన సంప్రదాయముల మీద ఏవగింపు కలిగినది. కాలానుగుణ్యమైన మార్పులు వచ్చినవి. ఇప్పుడు ముద్రణ సౌకర్యము సమృద్ధిగా గలదు. అన్నివిధములైన గ్రంథములు అచ్చుపడినవి. స్వల్ప వెలకు లభించు చున్నవి ప్రపంచ మంతయు వార్తా పత్రికా ప్రచారముతో, ఏకదేశభావనా ప్రచారముతో విశ్వసోదర న్యాయముతో. రేడియో ప్రసారముతో దూరము కాలముగా మారి భేదభావముపోయి ప్రపంచ ప్రజలందరు దగ్గరకుచేరి ఏక కుటుంబముగా మెలగదగు కాలము వచ్చుచున్నది ఇప్పుడు ఎవరు ఏ శాస్త్రమును చదువుకొనవలయునని తలచిన శ్రద్ధతో చదువుకొనుటకు వీలైన రీతిగా అసంఖ్యాక గ్రంథములు కలవు కాని ప్రజలు ఆ సౌకర్యములను వినియోగించుకొనుట లేదు. సామాన్యముగా చదువను వ్రాయను నేర్చినవారు భారత దేశములో నూటికి పదిమంది మాత్రమే కలరు. మనదేశము మన ప్రజలు విద్యయందెంత వెనుకబడియుండిరో ఊహించుడు. కావున విద్యాభివృద్ధి కొరకు ప్రజలలో గ్రంథ పఠనాసక్తిని రేకెత్తించవలెను. గ్రంథాలయములను నిర్మించి మంచి గ్రంథములను సేకరించి చదువుకొనుటకు పాఠకులకందచేసి విద్యాభివృద్ధి జ్ఞానాభివృద్ధి చేయుట గ్రంథాలయోద్యమ ముఖ్యోద్దేశము. ప్రతిపాఠకుని తగిన గ్రంథమును, ప్రతి గ్రంథమునకు తగిన చదువరిని ఏర్చి సమకూర్చవలయును. గ్రంథములను విడివడి

గా ఏ శాస్త్రమునకు సంబంధించినవి ఆ శాస్త్రమునకు ప్రత్యేకించి ప్రత్యేక బీరువాలలో అమర్చవలెను. గ్రంథభాండాగారి సర్వసమర్థుడై పాఠకులకు కోరిన గ్రంథములనొసగుటయేగాక, ఏ గ్రంథమును వారు పఠింపనగునో సక్రమముగా నిర్ణయించి వారికా గ్రంథముల నందించి వారు చదువునట్లు చేయవలెను.

గ్రంథాలయములందు పురుషులకు, స్త్రీలకు బాలబాలికలకు పఠన యోగ్యములైన గ్రంథము ప్రత్యేకించవలెను. ఉన్నత విద్యా సముపార్జన చేయువారికి శాస్త్రాధ్యయనము చేయువారికి కావలసిన గ్రంథములను సేకరించి వారికి అందజేయవలయును.

ప్రతి గ్రామమునందును ప్రతి విద్యాలయమందును, దేవాలయమందును ప్రతి గృహస్తునింటను గ్రంథాలయముండవలయును. సావకాశమును బట్టి వయోజనులకు, స్త్రీలకు, బాలబాలికలకు ప్రత్యేక గ్రంథాలయాలేర్పాటు చేయవలెను. కుగ్రామములకు శివార్లకు శకటములమీద గ్రంథములనుగొని పోయి పాఠకుల కిచ్చి చదివింపవలెను. విద్యావిహీనులకు విద్యను నేర్పు సదుపాయములు చేయవలెను. వృత్తి విద్యలను నేర్పి నిరుద్యోగ సమస్య నెదుర్కొనవలెను. పాటక జనులకు రాత్రి పాఠశాలలేర్పాటు చేసి విద్యాభివృద్ధి చేయవలెను. దిన పత్రికలను, వార పత్రికలను, మాస పత్రికలను విరివిగా తెప్పించి చదువుట ప్రోత్సహింపవలెను. చదువురాని వారికి గ్రంథభాండాగారికి చదివి వినిపించవలెను. మహిళలకు ప్రత్యేకముగా ప్రచురింపబడు పత్రికలను పురాణేతిహాసములను పతివ్రతామణులయొక్కయు, వీర వనితామతల్లుల యొక్కయు సారస్వత సేవికలయొక్కయు చరిత్రలను స్త్రీలకు ప్రత్యేకముగా వారి యిండ్లకు పంపించి వారిచే చదివింపవలెను. చదువురాని స్త్రీలకు చదువు నేర్చిన స్త్రీచే చదివి చెప్పు ఏర్పాట్లు చేయవలెను. బాలబాలికలకు వయోజనులకు అర్హమైన పుస్తకములొసగి పఠనాశక్తిని కలిగింపవలెను. ప్రతి గ్రంథాలయమందు ఆ గ్రామ చరిత్రను గ్రంథాలయ చరిత్రను వ్రాయించవలెను. గ్రామ ప్రాచీన నామము ఏర్పడిన కారణము గ్రామమును పాలించి ప్రముఖుల చరిత్రలు, అందు నివసించిన వీరులు, కవులు పండితులు, భక్తులు, తదితర పవిత్ర వ్యక్తుల కథలు వృద్ధులనుండి సేకరించి వ్రాసి భద్ర పరచిన చరిత్ర రచనకు ఉపకరించును

ప్రజానీకమునకు జంతువుల, పక్షుల, పిల్లల, పెంపకమును గూర్చియు, వృత్తి విద్యల గూర్చియు ఉపన్యాసము ఏర్పాటు చేయవలెను. గృహిణీధర్మము పెద్దలయెడ గౌరవము, అతిథులయెడ ఆదరణము గృహస్థధర్మములను గూర్చి బోధించవలెను. శుచి శుభ్రత శరీరాలంకరణ పొడుపు పొందిక మొదలగు వానిని గూర్చి జ్ఞానము కలుగునట్లు చేయవలెను. సభ్యత నడవడి నేర్పవలెను. పూర్వ మేధావులు మునీశ్వరులు మనకొరకు గ్రంథముల భద్రపరచిన సమస్త విషయములను ప్రజానీకమున కందించి వారి జన్మ సార్థకము చేయవలెను. సాహిత్యము నందభిరుచి కలిగింపవలెను

సాహిత్యము నిత్యప్రకాశవంతమైన వెలుగు

బాట. మానవాభివృద్ధికి దోహద మొసగు పవిత్ర దేవాలయము. పునీతమైన ఈ అక్షర దేవాలయ ఛాయలందు ఏకాగ్రచిత్తులై ధ్యాన నిమగ్నులై తప మొనరించు అక్షరాస్యులు జీవితరహస్యములను సృష్టి రహస్యములను, జీవితమును కళామయ మొనరించి విధానములను నేర్తురు. నారొనరించిన అక్షర జపము సాహిత్యోపాసన ఒకచేతినుండి మరియొక చేతికి ఒక నేత్రము నుండి మరొక నేత్రమునకు ఒక హృదయము నుండి మరొక హృదయమునకు ధారా వాహికముగా ప్రవహించు చుండెను. అందరు ఆ దివ్య జోతి నుపాసించి దర్శింపనైన సరస్వతీ దివ్య దేవాలయము గ్రంధాలయము. గ్రంధాలయమును అభివృద్ధి చేయండి. భారతీయ వైభవము నిలపండి.



పొత్తము మిత్రము బంధువు
పొత్తము నానార్థదాత బోధకుడున్ సం
పత్తియు బత్తియు జననియు
పొత్తము మన వెలుగు సంతుపూజ్య
హితుండున్

—జాస్తి వెంకటనరసయ్య


APBD
BOOKS FOR YOU



---

ఓమ్.

# గ్రంథాలయములు - కార్యకర్తలు

అన్నె కేశవార్యశాస్త్రి, యజుర్వేద భాష్యానువాదకుడు; హైద్రాబాదు

విజ్ఞానము, విద్య అభివృద్ధిజెందుచున్నకొలది మానవ సౌకర్యములు అభివృద్ధి కాసాగినవి ఎక్కడెక్కడనో ఒకటి రెండు తాళపత్ర ప్రతులు కలిగియున్న దినములు గతించినవి. కాగితము ముద్రిణవచ్చినవి. ఇంటింట పుస్తకమే. ఏ రాజుగారివద్దనో పది గ్రంథములు పోగగు కాలము గడచినది. ఇంటింట పది గ్రంథములుండు రోజులువచ్చినవి. ఇంతియగాదు ఊరూర ప్రజల జిజ్ఞాసను సామూహికముగ పెంపొందజేయుటకై గ్రంథాలయములు నెలకొల్పబడినవి. చందాలమీదను, కొందరి దాతల దానముల మీదను ఆధారపడి నడిచే రోజులుకూడా లోపించుచున్నవి.

ఇప్పుడు లోకల్ లైబ్రరీ అథారిటీ వచ్చినది. ప్రభుత్వమే విశాలపథకమువేసి ఒక కార్యక్రమమును అమలు పరచుచున్నది. ఈ సత్కార్యమును సక్రమముగ సత్ఫలిత మిచ్చునటుల కృషిచేయు కార్యకర్త ఎంతేని అవసరమై యున్నాడు. కేవలమేదో సర్టిఫికట్టుచూచియో, కేవలము పార్టీదృష్టితోనో, సిఫారసుల బలము మీదనో ఎవరినో ఒకరిని నియమించి నిరుద్యోగసమస్యను తొలగించి నంతమాత్రమున ముఖ్యాశయము నెరవేరదు.

## కార్యకర్తయోగ్యత - బాధ్యత

ఇది గ్రంథాలయము. చదువుకొన్నవారందరికి ముఖ్యముగ నుపయోగపడును. స్థానిక గ్రంథాలయమును తీర్చి దిద్దవలసిన పని ఎంతయో కార్యకర్త మీద ఆధారపడి యున్నది. తాను స్వయముగ చదువరియై సమస్త విషయములను మధుమక్షికా న్యాయముగ నైనను చవిచూచి యుండవలయును. తన వలయములోనున్న ప్రజల ఆసక్తి యెట్టిదో? ఏ గ్రంథ పఠనమందు కోరికగలదో? వారి అవసరము లేమిటో? ఆ అవసరములను తీర్పగలుగు సాహిత్య మెద్దియో? బాలవృద్ధయువతీ యువక వర్గములుగనున్న పాఠకుల ఆకాంక్ష ఎటులున్నదో? ఈ సమస్యలన్నిటిని క్షుణ్ణముగ ఆకలింపు చేసుకొను యోగ్యత కార్యదక్షత ఉండవలయును. తదనుకూల గ్రంథములను సంపాదించుటయందును, క్రమముగ నందరి యుత్కంఠ తీరునటుల పుస్తక వితరణ మొనర్చుట యందును తగినంత క్షమత యుండవలయును. ఇందులకై శ్రద్ధయేగాక వలసినంత పురుషార్థ మొనర్ప వలయును. తాను వేళకువచ్చి తలుపులుతీసి కూర్చొనుట, తనను పలకరించువారికి జవాబు చెప్పుట మాత్రమే తన కర్తవ్యముగ భావించగూడదు. వేళ ముగిసినతర్వాత తాళమువేసి వెళ్ళిపోవుటయు కర్తవ్యము గాజాలదు. గ్రంథాలయమునకు వచ్చు ప్రతి పాఠకుని సన్మానించుటలోను, మృదు మధుర వాక్కులతో తృప్తిపరచి మంత్ర ముగ్ధునిగ నొనర్చవలసిన చాతుర్యమతని కుండవలయును. నిరుద్యోగముగ వచ్చు యువకులను తన ఆదర్శముచే నాకర్షించి పఠనాసక్తులుగను, విద్యార్జనాభిమానులుగను తయారు జేయవలయునను పునీత సంకల్పముండవలయును. ప్రతిదినము పరుండ బోయినప్పుడు దినమందలి తన కృత్యములను విమర్శించుకొని మరుసటి దినకర్తవ్యములకై తగిన ప్లానులు - క్రమపద్ధతిని నిర్ణయించు కొనవలయును.

ఈ ఉద్యమము ప్రజలతో సంబంధించినది. కావున ప్రజాసేవయే కార్యకర్తకు ప్రధానాశయముగ నుండవలయును. అతని నియామకమునందు అతని భూతపూర్వ

సామాజిక సేవలను, త్యాగమును పరిశీలించ వలయును. అతనికి ఎన్నిడిగ్రీలున్నను సామాజిక జీవితము, శత్రు మిత్ర భేదములేకుండ అందరితో సమానముగ మెలగు మెలకువలేనిచో యతని నియామకము వ్యర్థమే యగును. ఒక గ్రామమునందు భావ విప్లవము తీసుకిరావలయు నన్నను, చైతన్యమును కలిగించవలయునన్నను శ్రేష్ఠ సభ్యతకు, సంస్కృతికి పునాదులు వేయవలయునన్నను అతడు వేయగలుగ వలయును. అప్పుడే గ్రంథాలయము సార్థక మైన దగును ఆధునిక సాంకేతిక విజ్ఞానముతో తేలికగ పరిచయమొనర్చి గ్రామ సౌభాగ్యవృద్ధికి ఎంతయో పునాదులు వేయగలుగును. ఒకిరములోనే గ్రామమును శ్రీమంతము గను, సుఖమయము గను, సుసంఘటితముగను చేయగలుగు సదవకాశము తనచేతిలో నున్నవి సుగ్రంథముల పఠింప జేసి వారలలోని భిన్నాభిప్రాయముల తొలగించి ఏకి కట్టుకు తీసుకరాగలడు గ్రంథాలయము ద్వారా ప్రజలలో పూర్తి పరివర్తనము తీసుకరాగలుగుదుననే ఆత్మస్థైర్యమతని కుండ వలయును.

అతనిశీలము శత్రుశ్లాఘ్యముగ నుండవలయును. పరులబాధను తన బాధగను. పరులయున్నతిని తన యున్నతి గను భావించు సౌశీల్యమతనికుండవలయును అతడేపార్టీకి చెందినను, ఏ సంప్రదాయమునకు చెందియున్నను ఇతరుల మనస్సులకు నొవ్వకుండ ప్రవర్తించునంతటి సహనశక్తి యుండవలయును. మహిళలందరిని సోదరునిగానో, తండ్రిగానో చూడగలుగు నంతటి సదాచారమతనియందు గోచరించ వలయును. గ్రంథాలయమునకు రాజాలని వారి యభిరుచులను తెలుసుకొని వారికికూడ సేవమొనర్చవలయును అభిరుచి కల్పించవలయును.

ఈ విషయములన్నియు ఆలోచనలో నున్నను అమలులోనికి తెచ్చుటకు ఆరాట పడవలయును. దీనికై తగినంత అనుభవముండవలయును తాను చదువరియై, లోక సేవకుడై యుండుటనే ఈ సమస్యలపట్ల శ్రద్ధ చూపగలుగును. పురుషార్థ మొనర్పగలుగును. వినయముతోను, సౌమ్యము తోను ప్రజలను మెప్పించవలయును. తాను ప్రజాసేవకుడను విజ్ఞాన ప్రచారకుడను అని భావింపవలయునేగాని ఒక అధికారినని యెన్నడు భావించరాదు లోకానుభవముతోపాటు లోకసేవ యొనర్పగలుగు కార్యకర్తయే గ్రంథాలయమున కుపయుక్తుడగును. ఇన్ని పనులను చేయగలననెడి ఆత్మవిశ్వాసము గలవాడే ముందుకు రావలయును. అన్ని వేళలందు గ్రంథాలయ కార్యములనే తలలుగనే వాడుగ తయారు కావలయును. జీతమునకై పనిచేయు జీతగాడను అనే చేష్ట లెన్నటికి ప్రదర్శించ గూడదు.

ఇట్టి త్యాగశీలుడు, నిరభిమాని, వినయ సంపన్నుడు, పురుషార్థపరుడు, స్వాధ్యాయశీలి, ప్రియంవదుడు నగు కార్యకర్త లభించిన గ్రంథాలయము ధన్యవంతమైనదగును. దాని వలన గ్రామములో జాతీయైక్యత, సభ్యతా సంస్కృతులకు తీరు తెన్నులు దిద్దుట, నూతన విజ్ఞానమును గ్రహించుట సుకరమగును.

## ఎట్టి గ్రంథములుండవలయును?

గ్రామములోని వ్యక్తులనుబట్టి ఆయా వృత్తులకు దారి జూపు గ్రంథము లుండవలయును నిరుద్యోగ దినములలో ప్రజాశక్తిని వమ్ముపోనీయకుండ దారిజూపు గ్రంథములుండ వలయును. ముఖ్యముగ బాలురలో ఆదర్శ స్థాపనమునకై మహాపురుషుల జీవితములు, దేశ చరిత్రలు, ఉద్యమముల స్వరూప స్వభావములను తెలుపునవి, ప్రాచీన రామాయణ భారతాది కావ్యములు, సత్వగుణ ప్రధానమైన వైదిక సాహిత్యము, ఆధునిక సాహిత్యము, సాంకేతికశాస్త్ర గ్రంథములు ముఖ్యముగ నుండవలయును. నవలలు – నాటకములకు స్థానమిచ్చుటకంటె పంచతంత్రమువంటి నీతిని గరపు కథా సాహిత్యమునకు ప్రాధాన్య మివ్వవలయును. యువకులకు ఆత్మాభిమానము కలిగించు రచనలను సమకూర్చవలయును. దేశరక్షణ, సంస్కృతిరక్షణ సర్వోత్తమ కార్యములుగ యతని హృదయమున హత్తుకొనజేయు గ్రంథరాజము లుండుట మంచిది ఒకరి హృదయమును తెలుసుకొనుటకు అతని సంగాతికాండ్రను, అతడు పఠించు గ్రంథములను పరిశీలించిన జాలునని పెద్దల వాక్యము పోషిన జాతిని, దేశమును గ్రామమును తీర్చిదిద్ది ప్రతిష్ఠను కలిగింపజేయు గ్రంథము లను సమకూర్చుట కర్తవ్యము. అందరిమన్ననలను పొందు ఆదర్శ గ్రంథములను సేకరించుటయే పరమధ్యేయము గ్రంథాలయమున కుండవలయును నిరక్షరాస్యులగుయువకు లకు, నిరుపేదలగు విద్యార్థులకు, స్వతంత్రముగ పరీక్షలనిచ్చి విద్యాభివృద్ధిని జేసుకొనదలచు పురుషార్థులకు తోడుపడునటుల పరీక్షలకు యుక్తములగు గ్రంథములను సేకూర్చుటయు చాలా అవసరము ఇటుల ప్రోత్సహించుచూ గ్రామములో విద్యాధికులనతికాలములోనే కనబడగలరు.

# గ్రంథాలయములు - ఉత్తమ సాహిత్యము

శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ.
ఏ. సి. కాలేజి — గుంటూరు.

ఆశ్రమాలలో అందరూ విద్యాధ్యయనం చేసే టప్పుడు మహాగురువులయిన కులపతులు ఉత్తమ గ్రంథాలను రచించి చేశారు. ఆ కులపతుల ముఖ్యశిష్యులందరూ ఆగ్రంథాలకు ప్రతులు వ్రాసేవారు. ఇతరాశ్రమాలలోవున్న కులపతులకు పంపించేవారు. ఈ విధంగా పరస్పరము గ్రంథాలను పంపించుతూ, పంపించినవానిని సేకరించుతూ భద్రపరిచేవారు. ఒక్కొక్క కులపతి ఆశ్రమంలో కులపతుల ఆమోదము కలిగిన గ్రంథాలు సహస్రాధికంగా వుండేవి అక్కడ అధ్యయనం చేస్తూవున్న విద్యార్థులు అనధ్యయన దినాలలో ఎవరికివారు సొంతం ప్రతులు వ్రాసుకొని తమ ఇండ్లకు తెచ్చుకొనేవారు. ఇండ్లమీద గ్రంథాలు తెచ్చేవారు మంచి భాండములలో వుంచేవారు. వాటినన్నిటిని ఒకచోట వుంచి సరస్వతీ ప్రతిష్ఠ చేసేవారు. అదే సరస్వతీ భాండాగారము వారు అగ్రహారాలలో వుండి అన్ని వర్గములవారికి తగిన విద్యాప్రబోధం చేసేవారు. దేవాలయ ధర్మకర్తలు ఆ పండితుని గ్రంథాలకు ప్రతులు వ్రాయించి దేవశాలలకు, సత్రశాలలకు, ధర్మశాలలకు పంపించేవారు. ఎక్కడెక్కడ వున్న గ్రంథమయినా రాజాస్థానానికి ఒక్కొక్క ప్రతి అయినా వెళ్ళేది. ఆనాటి ప్రభువులు ఆసరస్వతీ సామ్రాజ్యమును సంభావించుకొని తమకు తాముగా ఆశ్రమాల పోషణభారము వహించేవారు పండితులను పూజించేవారు. ఇంతటి మహా వైభవమంతా ఆ మహాసరస్వతి అనుగ్రహం.

ఏ ఇంటచూచినా ముఖ్యములయిన కొన్ని గ్రంథాలయినా వుండేవి ఇంటిలోని ద్వార ద్వారానికి ద్వారబంధము వుండేది. ఆ ద్వారబంధంమీద నిత్యావసరములయిన గ్రంథాలను భద్రపరచేవారు. గ్రంథములేని ద్వారబంధము లేదు. ద్వారముబంధములేని ద్వారములేదు ద్వారములేని భవనము లేదు. భవనములేని పండితుడు లేడు.

భారతదేశం అంటేనే గ్రంథాలయం. ఉత్తమ గ్రంథాలు - భారతదేశము - ఈ రెండూ పర్యాయపదాలు అన్నంత ప్రసిద్ధివచ్చింది. ఈ దేశ గ్రంథాలు విదేశాలకు ఈ దేశాన్ని తెలియచేసినవి. నిర్గ్రంథులయిన విదేశీయులు సగ్రంథులయిన భారతీయులను, భారతదేశాన్ని చూడాలనుకున్నారు. భారతదేశాన్ని చూశారు. వీరి గ్రంథాలనూ చూశారు. తమకు లేనివి వీరికున్నవని చూచి చూచి తమ స్థితిని భారతీయులకు భారతీయులగతిని తమదేశాలకు సంబంధింప చేయాలనుకున్నారు. ఆ విధంగానే చేశారు. కొన్నివేల గ్రంథాలు టిబెట్టులో, పారిస్సులో, ఇంగ్లండులో జర్మనీలో ప్రాణాలు గుండెల్లో పెట్టుకుని వెళ్ళినయి. గుండెలలో ప్రాణాలులేని ప్రాణులు విదేశాలకు వెళ్ళారుకాని ఆ గ్రంథాలు వీరిని చూడలేవు. గుండెకల ప్రాణులు ప్రాణరూపంగావున్న ఆ గ్రంథాలను మళ్ళీ ఎప్పుడు భారతదేశానికి తీసికొని రాగలరో తెలియకుండా వుంది. నాగపూరులో విశ్వపరిషత్తు జరుగుతున్నప్పుడు శ్రీయుతులు కె. యమ్. మున్షీ, అనంతశయనం అయ్యంగార్ మొదలయిన వారికి జ్ఞాపకం వుండేటట్లుగా ఈ సంగతి చెప్పాను. ఈ నాడు భారతదేశంలోని ప్రదేశ ప్రభుత్వాలవారు ముగ్గురు ముగ్గురు ప్రతినిధులను ఆ గ్రంథ విషయ పండితులయిన వారిని ప్రతి సంవత్సరము విదేశాలకు పంపించాలి. వారు ఆ గ్రంథాలకు ప్రతులు వ్రాసి తీసికొనివస్తారు. ప్రతి సంవత్సరము యాభైమంది మహా పండితులను విదేశాలకు పంపించి ఒక సంవత్సరం పాటు వారికి ఆయాదేశాల్లో అవకాశాలు కల్పించి తగిన

గ్రంథాలను సేకరింపవలసినదని సూచించినట్లయితే ప్రతి సంవత్సరము కనీసం రెండువందల ఉత్తమ గ్రంథాలయినా వచ్చేవి ఆనాటినుండి ఈ నాటిదాకా ఆ ఉద్యమం సాగితే అయిదువేలయినా అపూర్వములయిన ఉత్తమ గ్రంథాలు వచ్చేవి. ఇప్పటికీ నాకు అటువంటి ఆశ తగ్గలేదు. మన గ్రంథాలను మనము అందుకోలేము అని మన ప్రభుత్వం కాని మనముకాని అనుకోరాదు.

విజ్ఞాన శత్రువులయిన విదేశీయులు చాలా గ్రంథాలను చన్నీళ్ళు కాచుకొనడానికి తగలపెట్టారని విన్నాము. కొన్నివేల గ్రంథాలను సముద్రగర్భంలో ముంచి వేశారనిన్నీ విన్నాము. ఉన్న గ్రంథాలనుకూడా అస్తవ్యస్తంచేసి చిందరవందరగా చేశారని విన్నాము. చేయతగినది ఏమిలేక తగినంతగా ఏడుపలేక కుమిలికుమిలి వ్యథచెందేవారు వున్నారు. కాలము సర్వము కబళించింది. గ్రంథాలు శ్వేతక్రిములకు కబళం అయినవి భారతీయులుకూడ అగ్రంథులు అయినారు. అంధులు అయినారు. క్రొత్త క్రొత్తగా గ్రంథాలయాలు వచ్చినవికాని గ్రంథాలులేని గ్రంథాలయాలు వచ్చినవని అనుకోవలసి వచ్చింది. బీరువాలను ఆక్రమించి తిష్ఠవేసే ప్రతి గ్రంథమూ గ్రంథముకాదు. గ్రంథ గౌరవముకల గ్రంథము లేనివాడు గ్రంథాలయములేనినాడు వున్నస్థితికంటె విశేషముకలవికాదు.

గ్రంథాలయమంటూ వుంటే ఉత్తమ గ్రంథాలుండాలి సామాన్య మానవులు సంపాదించలేని గ్రంథాలుండాలి. అల్లరిచేయలేని కొందరు కుఱ్ఱవాళ్ళువచ్చి వుబలాటానికి ఉపయోగించే గ్రంథాలు గ్రంథాలుకావు గ్రంథాల విషయాలు కావాలని ఆకలి కలవానికి ఆకలి తీర్చగల గ్రంథాలుకావాలి. గ్రంథాలయాలలో అటువంటి గ్రంథాలున్నట్లు అందరకూ తెలియడంలేదు. ఒక బీరువాలో చాలా పుస్తకాలున్నాయి ఆ పుస్తకాలలోని విషయాలు పరస్పరము ఖండించుకొనేవిగా వున్నాయి. ఆ సంగతి తెలిసీ తెలియనివాడు ఆ బీరువాదగ్గరకు వెళ్ళగానే ఆ పుస్తకాలన్నీ పరస్పరం కొట్టుకొంటూ కొరుక్కుంటూ ఉరుములురుముతూ వున్నాయిట. అక్కడికి వెళ్ళిన మనిషి దుమ్ముగుడ్డతో వాటిని దులిపి ఆ పుస్తకాలస్థలం మార్చి అటూ ఇటూ పెట్టాడట. ఈ విషయం రమ్యంగానేవుంది నేను చాలా పుస్తకాలు చదివాను. నా బీరువాలలో పుస్తకాలు కొట్టుకోవడం లేదు. ఆ పుస్తకాలు బీరువాలలో వున్నవని నేనెన్నడూ అనుకోలేదు. అవన్నీ నా గుండెలోనే వున్నవని అనుకుంటున్నాను. అవన్నీకలిసి అఖండ విజ్ఞానమును నాకు ప్రసాదించుతున్నవని నా భావన ఇటువంటి భావనను సంపాదించే గ్రంథాలు ఉత్తమ గ్రంథాలు. అటువంటివి లేకపోతే గ్రంథాలయం గ్రంథలయమే అవుతుంది. శాస్త్రీయములయిన గ్రంథాలు ఉదాత్తములయిన గ్రంథాలు వుంటేనే గ్రంథాలయ గౌరవం కలుగుతుంది గ్రంథాలయ పితామహులకృషి ఫలంగా ఆంధ్రదేశంలో వేయి గ్రంథాలకుపైగా వెలసినవి. ప్రభుత్వం గ్రంథాలయాధికారం స్వీకరించేటప్పటికి అవన్నీ నమసిపోయినవి. జిల్లాకు కొన్నిమాత్రం ప్రభుత్వాధికారంలో వున్నాయి. తెలుగు దేశంలో రచయిత ఉత్తమ గ్రంథం వ్రాస్తే ప్రభుత్వాధికారంలోవున్న గ్రంథాలయాలన్నీ ఆ రచయిత గ్రంథాలను సేకరించి భద్రపరచినట్లు తోచడం లేదు. ఈ ఉద్యమం సఫలంగా సాగివున్నట్లయితే నేను వ్రాసిన వుత్తమ సాహిత్య గ్రంథాలను ఇంతకాలం వరకూ నేనున్న ఇంటిలోనే భద్రపరచు కొనవలసిన పరిస్థితి కలిగేదే కాదు. ఉన్నతపాఠశాలల గ్రంథాలయాలు పిల్లలకు పనికి వస్తయ్యన్న చిల్లర పుస్తకాలను తెప్పిస్తున్నవేకాని వుత్తమ గ్రంథాలను అన్నీ బాగా సేకరించడంలేదు ఆంధ్రదేశంలోని ప్రతిహైస్కూలు ఉత్తమ గ్రంథాన్ని సేకరించగలిగితే ఉత్తమ గ్రంథరచయితకు ఏవిధంగానూ ఆత్మబాధకలుగదు. కాలేజి అని చెప్పుకొనే కాలేజి ఉత్తమ గ్రంథాలను అయిదు ప్రతులనయినా తీరాలి. ఆ విధంగా తెప్పించాలని ఆ అధ్యాపకులకు ఆ అధ్యక్షులకు ఆ అధికారులకు ఆ అభిప్రాయం యింకా బాగా కలుగలేదు. ఒక్కొక్క విశ్వవిద్యాలయం ఉత్తమ గ్రంథమునకు పది ప్రతులనయినా స్వీకరించడం ధర్మం ఈ ధర్మాన్ని విశ్వవిద్యాలయాలు పాటించడం లేదు. ఆంధ్రప్రదేశంలో ప్రభుత్వ వశమయిన దేవాలయాలు చాలా వున్నాయి దేవాలయాలకు గ్రంథాలయాన్ని అవశ్యంగా జతపరచి తీరాలని ఈ ఆలయ విజ్ఞానులకు కలుగవలసిన

విజ్ఞానం బాగా కలుగలేదు. లోకంలో శ్రీ సంపన్నులున్నారు. వారు ధీ సంపన్నులు కారని నేననలేను తమ శ్రీ ధీ సంపదకు తగినట్లుగా వారంతరూ ప్రవర్తించడం లేదు వారందరికీ ఆలయాలున్నవి, భవనాలున్నవి, కాని వారింటిలో సరస్వతీ మందిరం లేదు. గ్రంథాలు కొనాలని వానిని భద్రపరచి వాని విజ్ఞానమును కుటుంబంలో తర తరాలనిధిగా ఉంచాలని వారి కింకా తోచలేదు. ఇవన్నీ ఉత్తమ గ్రంథాలుండదగిన ప్రదేశాలు. ప్రదేశాలున్నాయి గ్రంథాలులేవు గ్రంథాలకు సంబంధించిన మంచి ఉద్యమాలను అల్లరి గ్రంథాలు చిల్లర గ్రంథాలు అందుకొని ఆ మార్గంలో అభివృద్ధి కలుగచేస్తున్నాయి. దీనికై క్రొత్తగా ఒక ఉద్యమం అవసరం.

గ్రంథాలయాలలో గ్రంథాలయోద్యోగిగా ఒక వ్యక్తి వుంటున్నాడు. గ్రంథాలను అందంగా బీరువాలలో సర్దడమే కాక ఆదాన ప్రదాన కార్యమేకాక గ్రంథవిషయ పరిజ్ఞానం చక్కగా వుండాలి. ఏ గ్రంథమును సేకరింపవలెనో అతనికి తెలిసివుండాలి. సేకరించిన గ్రంథములోని విషయమును ప్రతిదినము అవసరమయిన వారికి ప్రబోధించేవాడుగా వుండాలి నేనొకసారి అడయారు లైబ్రరీకి వెళ్ళాను. నేనా బీరువాల సందులలో పుస్తకాలు వెతుకుతున్నాను. ఇంతలో ఒక ఫ్రెంచివనిత అక్కడికి వచ్చింది. పండితులవారూ! 'మీకేమి పుస్తకం కావాలి?' నాకు నాట్యవేదం అభినవభారతి కావాలి.' 'అయితే యిటురండి' అని కొన్ని పుస్తకాలు నా ముందుంచి మీరు చూచుకొనండి అన్నది. ఇంతలో మరొకరు వచ్చి నాకు జర్మన్ ఫిలాసఫీ పుస్తకాలు కావాలన్నాడు. ఆయనకు ఆ పుస్తకాల్చింది. ఇంకా కొందరికి కొన్ని పుస్తకాలిచ్చింది "ఓహో! సర్వజ్ఞురాలైన సరస్వతీ!" అనుకున్నాను. గ్రంథాలయోద్యోగి ఈ విధంగావుంటే అందరూ నావలె గుర్తుపెట్టుకోగలరు, నేను చాలా గ్రంథాలయాలు చూచాను. కాని ఎవర్నీ గుర్తుపెట్టుకోలేక పోయాను.

ఆంధ్రప్రదేశంలో మంచి గ్రంథాలయంలేదు. ప్రభుత్వాధికారము కల గ్రంథాలయంలో కూడా నావంటివాడు ప్రాచ్యవిద్యలలో పరిశోధనం చేయడానికి తగిన గ్రంథాలయం ప్రతి మండలంలోనూ లేదు. నే నొక్కడనే కావలసిన పుస్తకాలనన్నిటినీ తెప్పించుకోడానికి తగిన సామర్థ్యం లేదు. ఉండవలసిన ప్రభుత్వ సహకారమూ లేదు. గ్రంథాలయంలోని గ్రంథాలను చదివినవ్యక్తి తాను సంతుష్టితో బయటికిరావాలి. ఈనాడది లేదు. తగిన గ్రంథాలు గ్రంథాలయాలకు చేరడంలేదు. పుస్తకాలపై అధికంగా కమీషను యిచ్చేవారి దగ్గిరనే గ్రంథాలయాధికారులు పుస్తకాలను కొంటున్నారు అంతంతగా కమీషనుయిస్తే నావంటి వానికి ఆహారం లభిస్తుందా? కమీషను వ్యవహారంలో వస్తూవున్న గ్రంథాలను ఎవరూ ఉదాత్తంగా భావించడంలేదు. ఉత్తమ గ్రంథరచయితను అధికారులర్థించి గ్రంథాలను తగిన విధంగా స్వీకరించాలి. పంచవర్ష ప్రణాళిక ఆ యోజనంలో ప్రభుత్వం అయిదువందల గ్రంథాలనైనా వ్రాయించ చేసి ప్రకటించవచ్చు. ప్రభుత్వ అధికార ముద్రతోవున్న గ్రంథాలయాలు తమ నిబంధనావళిని మార్చుకొని ఉత్తమ గ్రంథాలు రచింపచేయడానికి సేకరించడానికి యత్నించడం చాలా అవసరం. వర్తమానకాలంలో సమర్థంగా వ్రాయగలవారున్నారు. వారిశక్తి యుక్తులను ఉపయోగించుకోగలిగితే మంచి ఉద్యమం సమర్థంగా వ్యాపిస్తుంది. వైదిక సాహిత్య నుండి వర్తమాన సాహిత్యంవరకూ వచ్చిన మహాసారస్వత ప్రవాహంలో రసమయములయిన మహా గ్రంథాలను గ్రంథాలయాలు విజ్ఞానంతో స్వీకరించడం చాలా అవసరం.



# గ్రంథాలయోద్యమము - దేశోద్ధారకుడు

శ్రీ గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

ఘంటసాల

ఇరువది శతాబ్ది ప్రారంభంలో ఆంధ్ర దేశాన్ని కల్లోలపరచిన ప్రథమ రాజకీయోద్యమం, వందే మాతరోద్యమం. ఇది 1905 లో ప్రారంభమైంది. దీనిని లాల్, హాల్, చాల్ యుద్ధమంటారు. పంజాబు కేసరి లాలా లజపతిరాయ్, బిపినచంద్ర పాలు, బాలగంగాధర తిలక్ దీనికి మూల పురుషులు.

1909 ప్రాంతాల బ్రిటిషువారు దీన్ని అణి కట్టారు. దానిఫలితంగా ఆంధ్రదేశంలో రెండుద్యమాలవతరించాయి. అవి ఆంధ్రోద్యమం, ఆంధ్ర గ్రంథాలయోద్యమం. ఆంధ్రదేశములోనే ప్రత్యేకంగా ఈ ఉద్యమాలు ఆరంభం కావడం గమనింపదగిన విషయం గమనింపతగినదే గాదు గర్వించతగినది.

ఆంధ్రోద్యమం యొక్క బాహ్యాకోరకు గ్రంథాలయోద్యమం ఈఉద్యమంయొక్క పరమ ప్రాప్యం ప్రజలలో జ్ఞానాభివృద్ధి కలిగించటం.

బెజవాడలో శ్రీ రామమోహన గ్రంథాలయం 1911లో ఏర్పడింది. సూరి వెంకటనరసింహశాస్త్రి అయ్యంకి వెంకటరమణయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు ప్రభృతులు దీనికి కారకులు.

గ్రంథాలయోద్యమం 1914 లో ఏర్పడింది. సూరి వెంకటనరసింహశాస్త్రి, అయ్యంకి వెంకట రమణయ్యగార్లు ఈ ఉద్యమానికి మూలపురుషులు. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం ఏర్పడిన పిమ్మట ఆంధ్రదేశంలో గ్రంథాలయాలు విరివిగా స్థాపించటం జరిగింది. ఈ ఉద్యమ పక్షమున గ్రంథాలయ సర్వస్వమను పత్రికను స్థాపించి దీనిని ఒక స్వతంత్ర్య ప్రజోద్యమంగా పెంపొందచేశారు. గ్రంథాలయోద్యమం ఆంధ్రప్రజలలో విజ్ఞానాన్నే గాక, రాజకీయ చైతన్యాన్ని కూడా పెంపొందింప చేసింది.

గ్రంథాలయోద్యమ వ్యాప్తివల్లనే ఆంధ్రదేశంలో అధిక జనసంఖ్య రాజకీయ చైతన్యం గాంచి ప్రథమంగా గాంధి ఉద్యమంలో పాల్గొన్నది. ఏ జాతైనా అభివృద్ధి పొందాలంటే ముందుగా విజ్ఞానం వ్యాప్తిపొందాలి, విజ్ఞానవ్యాప్తి సాధకమైన గ్రంథాలయోద్యమం అన్ని ఉద్యమాలకు పునాదయినది. ఆంధ్రుల అభివృద్ధికి దోహదం ఇచ్చింది.

గ్రంథాలయోద్యమం 1914–19 వరకు విజృంభించి రాజకీయ చైతన్యాన్ని, దేశాభిమానాన్ని, దేశసేవాభిలాషను గ్రామాలలో పెంపొంద చేసింది.

1914 లో ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. ఆంధ్ర దినపత్రికకూడా అప్పుడే ఆరంభమైంది.

యుద్ధ వార్తలు ప్రజలను ఆకర్షించినంతగా మరే వార్త ఆకర్షించలేదు.

యుద్ధవార్తలు తెలుసుకోవాలనే అభిలాషతో నేమి, భాషాభిమానంతో నేమి. ఆంధ్రదేశంలో అసంఖ్యాకంగా పఠనాలయాలు, గ్రంథాలయాలు ఏర్పడ్డాయి పత్రికా పఠన పురాణశ్రవణావళి జనరంజకమైంది దీనికి దేశోద్ధారక నాగేశ్వరరావుగారి ఔదార్యము అధికంగా తోడ్పడ్డం. ఏ గ్రామంలోనైనా ఒకరు పది పుస్తకాలు పోగుచేసి గ్రంథాలయమని పేరు పెట్టి నాగేశ్వరరావుగారిని ఉచితంగా దినపత్రికను పంపవలసినదని కోరగానే వారు ఆంధ్రపత్రికనేగాక, తమ ఆంధ్ర గ్రంథమాల పుస్తకాలను కూడా ఉచితంగా పంపేవారు, అలాగే భారతిని ఈమాదిరిగా పత్రికలను గ్రంథాలను ఉచితంగా కొంతకాలమిచ్చి ఆంధ్రులలో పఠనాభిలాష కలుగచేసి పంతులుగారు గ్రంథాలయోద్యమానికి తోడ్పడ్డారు.

గ్రంథాలయోద్యమానికి వారి సేవలు గణనీయమైంది. మరొక కార్యంకూడా కలదు. ఆదినుండి 1927 వరకు తెలుగులో వెలువడ్డ గ్రంథాలను అకారాది పట్టిక తయారుచేయించి ప్రచురించడం,

గ్రంథాలయోద్యమానికి ఆంధ్రపత్రిక ద్వారా అధిక చేయూతనిచ్చారు.



పుస్తకంబులు గలిగిన పూరిగుడిసె
యందు నిరుపేద కాపునైయుందుగాని
పుస్తకంబులు లేనట్టి భూరిసౌధ
మందు చక్రవర్తిగనుండ నభిలషింప

—మధురకవి నాళం కృష్ణారావు



సొంత ఖర్చులతో గ్రంథాలయ వార్షిక సభలకు వెళ్ళి అధ్యక్షోపన్యాసానిచ్చి ప్రోత్సాహించుటమే గాక, ఆ సందర్భంలో సాధారణంగా గ్రంథాలయానికి రు. 116 లు కూడా విరాళంగా ఇచ్చేవారు.

ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలకు అరిగి, ఆ సభలలో పాల్గొనటమే గాక, ఆసభాసమావేశాలను పురస్కరించుకొని గ్రంథాలయోద్యమానికి ప్రోత్సాహకరంగా కూడా సంపాదకీయాలు వ్రాస్తూవుండేవారు. దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు కొన్ని ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభలకు కూడా అధ్యక్షత వహించి, గ్రంథాలయోద్యమ తత్వాన్ని కూడా వెల్లడించారు.

నెల్లూరులో జరిగిన తృతీయాంధ్రదేశ గ్రంథాలయ మహాసభకు 1916 మే 12, 13 తేదీలలో అధ్యక్షత వహించి ఇలా ప్రకటించారు.

"జాతీయ వికాసమునకు వ్యక్తి వికాసమునకు గ్రంథాలయములు అత్యంతోపయుక్తములు అందుచే వాని అభివృద్ధి అధికముగా కావలసియున్నది. గ్రంథాలయములు, పఠనమందిరములై విద్యాలయములై, వ్యాయామ నిలయములై, కళాక్షేత్రాలై, సేవాసదనాలై, ధర్మరక్షణ సాధనాలై విరాజిల్లి జాతీయ వికాసానికి మహత్తర సాధనలు కావాలి."

1939 మార్చి 23, 24 తేదీలలో విజయవాడలో జరిగిన శ్రీరామమోహన గ్రంథాలయ వార్షికోత్సవ సభకు అధ్యక్షత వహించి పంతులుగారు పలికిన పలుకులన్నీ పసిడిపలుకులే.

రామమోహన గ్రంథాలయమును సూరి వెంకట నరసింహశాస్త్రి, అయ్యంకి వెంకటరమణయ్యగార్లు స్థాపించిన దాదిగా గ్రంథాలయోద్యమము నందు నాకు సంబంధము గలదు.

గ్రంథాలయోద్యమము కొంత ఉపకారము చేసినది. విజ్ఞాన ప్రబోధము ఇందుమూలమున లభించినది

"గ్రంథాలయమును గూర్చి ఒక్క మాట చెప్పుచున్నాను గ్రంథాలయమునుసోషల్ క్లబ్ గా మార్చకూడదు రెండు ఆశయములు వేర్వేరు గ్రంథాలయమునందు పత్రికా పఠనము, గ్రంథ పరిశీలనము, సంఘసేవ, దేశసేవ ప్రధానము."

పంతులుగారు పలికినటులనే ఆనాడు గ్రంథాలయములు ఆ విధముగా పనిచేసినవి

ఆంధ్రులు గ్రంథాలయోద్యమం ఆంధ్ర దేశంలో వ్యాపింపచేయుటంతోనే తృప్తి చెందలేదు. ఈ ఉద్యమాన్ని భారతదేశమంతటను వ్యాపించుటకు తోడ్పడిరి.

1933 ఏప్రిల్ 16, 17 తేదీలలో బెజవాడలో జరిగిన అఖిల భారత గ్రంథాలయ సభా సందర్భమున గ్రంథాలయ ప్రదర్శనమును పంతులుగారు గావించిరి. ఆసందర్భములో పలికిన పలుకులు.

---

మంచి స్నేహితుల తరువాత సంపాదించదగినది మంచి పుస్తకాలను సంపాదించుకోవడమే.

—కాల్టన్

---

"ఎన్ని ఆటంకములు తటస్థించినను వానిని అన్నింటిని ఎదుర్కొని జ్ఞానము సంపాదించి, కృతకృత్యుల మగుటలో ఆంధ్రులు వెనుదీయరు. ఉద్రేకము, ఉత్సాహము, కార్యరూపముమరల్చుటకు ఎన్ని ప్రతిబంధములున్నను వానిని లక్ష్యము చేయక విజయమునకై ప్రయత్నింతురు. అట్టి ప్రయత్నమే గ్రంథాలయోద్యమ సందర్భమున ఆంధ్ర యువకులు చేసి యున్నారు.

"ఒకప్పుడు ఒక రూపమున విజృంభించిన ఆంధ్ర శక్తి మరొకప్పుడు మరొక రూపమున కార్యదక్షతను ప్రదర్శించుచుండును. వీరేశలింగం గారికాలంలో సాంఘిక విషయములందు ప్రదర్శింపబడిన ఉత్సాహము, ఉద్రేకము, గ్రంథాలయ, స్వరాజ్య హరిజనోద్ధరణాదిగాగల ఉద్యమములందు క్రియాశక్తిని వెలిబుచ్చుచున్నది. దేశంయొక్క స్వాతంత్ర్యమును సంపాదించుటకు ఎప్పటికి ఏ యుద్యమమును సాగించిన, నది అక్కరకు వచ్చునో దానియందు లక్ష్యమును కేంద్రీకరింతురు. ఈ సూత్రమును విమర్శకుల మనమునందుంచుకొని ఆంధ్ర దేశంయొక్క అభివృద్ధిని గడచిన ఇరువది సంవత్సరముల కాలము పరిశీలించు చుందురని ఆంధ్రులయొక్క శక్తి అప్పుడూ ఇప్పుడూ యొక రీతిగానే దన పటిమతో విరాజిల్లు చున్నదని గ్రహించగలరు.

"ఆంధ్ర దేశమున గ్రంథాలయోద్యమంతో పాటు స్వాతంత్ర్య దీపికలు వ్యాపింపజేయబడినవి.

"పత్రికా నిర్వహణమునను, గ్రంథ ప్రచు

రణమునను మనము చూపిన అభివృద్ధికి మనము గర్వపడవలెను.

"ఒక్క బంగాళము తప్ప ఆంధ్ర రాష్ట్రముతో ఇతర రాష్ట్రములు సరితూగవు మనకు మనలను గురించి చెప్పుకొనుటకు బిడియము హెచ్చు."

మద్రాసులో 1934 డిశంబరు 24, 25 తేదీలలో జరిగిన 17 వ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షులుగవుండి పంతులుగారు ఆ సభా విజయానికి తోడ్పడ్డారు.

అప్పుడు వారు గ్రంథాలయ స్థాపన అనగా గొప్ప కట్టడాలు, అద్దాల బీరువాలు వేల కొలది పుస్తకాలను స్వీకరించటం మాత్రమే అని తలంప రాదన్నారు ఉన్న గ్రంథాలు కొంచెమైనా అవి ప్రజల విద్యా వ్యాప్తికి, విజ్ఞానోదయానికి తోడ్పడ వలసినదిగా హెచ్చరించాము.

దేశోద్ధారకుడు గ్రంథాలయ ఉద్యమానికి ఆంధ్ర గ్రంథాల యోద్యమాభివృద్ధికి అధికంగా దోహదం కలుగ చేశారు.

ఆంధ్ర దేశంలో అనేక గ్రామాలలో దేశోద్ధారకుని పేర గ్రంథాలయాలు విరాజిల్లుచున్నవి"

గ్రంథాలయ ఉద్యమ ఫలితంలో గ్రంథాలయ శాసనం చేయబడింది. లోకల్ లైబ్రరి అథారిటి ప్రతి జిల్లాకు ఏర్పడింది.

ఆంధ్ర దేశంలో జరిగిన గ్రంథాలయ ఉద్యమాన్ని అవలోకనము చేసుకొనుటకు ప్రయత్నించిన కృష్ణా జిల్లా లోకల్ లైబ్రరి అథారిటిని ప్రశంసిస్తున్నాను. ఈ లోకల్ లైబ్రరి అథారిటీలు ప్రజా సంస్థలుగా పరిఢవిల్లుటకు గ్రంథాలయ కార్యకర్తలు తదితరులు కృషి చేతురు గాక !

# విజ్ఞాన దీపాలు

శ్రీ కాకుమాను విశ్వనాథం

(లోకల్ లైబ్రరీ అథారిటీ కమిటీ మెంబరు, 'కృష్ణా')

కొణకంచి

మానవుడు తన మానవత్వాన్ని నిలుపుకొనటానికి ప్రధాన సోపానం విజ్ఞానం. ఈ విజ్ఞానం విశ్వరూపాన్ని ప్రదర్శించి నప్పుడు ప్రకాశించినవే మనం కళలని పిలువ బడుతున్నవన్నీ. విజ్ఞానం నవనవోన్మేషంగా పెంపొందుతూ ఉండబట్టే యీనాడీ ప్రపంచమంతా మూడు పూలారు కాయలుగా విలసిల్లుతోంది. జ్ఞాన, విజ్ఞానాలే మానవజీవితానికి పరిపూర్ణత నిచ్చి మానవుణ్ణి ఒక దివ్య పురుషునిగా తీర్చి దిద్దుతున్నాయి

విజ్ఞానం విరివిగా వెదజల్లబడాలంటే దానికి ఆధార భూతమైనవి గ్రంథాలు మానవ నాగరికతను క్రోడీకరించుకొని యుగయుగాలకు ఎగబ్రాకి వచ్చేవి గ్రంథాలు. గ్రంథమంటేనే విజ్ఞానాన్ని గ్రథనం చేసేది. ప్రపంచంలోని యితర భాషల సంగతి అటుంచి మన తెలుగు భాషలో నన్నయ్యకు పూర్వమంటున్న జానపద సాహిత్యమెంతో మన దాకా రాకుండ కాలగర్భంలో కలిసిపోయింది. కారణం ఆ సాహిత్యం గ్రంథస్థం కాకపోవటమే. నన్నయ్యకు తరువాతనే అంటే 11 వ, శతాబ్దము నుండే గ్రంథ సాహిత్యం లభించింది. నన్నయ్య ఎంత సంస్కరణ చేసినా అంతకుముందు అసలే సాహిత్యం లేదని చెప్పటానికి ఆధారాలేమీ లేవు గదా! అయితే నన్నయ్య అవిరళ కృషివలన సౌందర్యవంతమైన, సుసంపన్నమైన, సమగ్రమైన సాహిత్య గ్రంథం భారతం మనకు లభించింది. దీనిని బట్టి చూస్తే గ్రంథం ఒక తేనెపట్టు అనిపిస్తుంది. పువ్వులలోని మధువునే గదా తేనెటీగలు సేకరిస్తున్నాయి. పువ్వులలో తేనె ఉన్న సంగతి మనకు తెలుసు. అయితే ఆ తేనెను సేకరించి ఒక చోట చేర్చు నేర్పరితనము ఆ తేనెటీగలకే వుంది. అట్టి క్రాంతదర్శులయిన మహానుభావులు గ్రంథ రచనా కార్యక్రమమును నిర్వహించి మానవ జాతికే మహోపకారం చేశారు.

పూర్వం మన గ్రంథాలన్నీ భూర్జ పత్రాల మీదా, తాళ పత్రాల మీదా వ్రాయబడ్డాయి. అందుకనే తాళ వృక్షం మన విజ్ఞాన ఉనికికి ఎంతో తోడ్పడిందని ఒక విమర్శకుడు వ్రాశాడు. కావ్యాలు, శాస్త్రాలు, పురాణాలు కడకు కవిలె కట్టలు గూడ యీ తాటియాకుల మీదనే యిటీవల వరకు వ్రాశారు

ఆనాడు గ్రంథాలను విరివిగా తయారుచేయటానికి వీల్లేక పోవటంవల్ల పూర్వపు రాజులు

గ్రంథాలను వ్రాయటానికి వ్రాయసగాండ్రను నియమించేవారు. ఎన్ని వ్రాసినా వీటి నన్నిటినీ ఒకచోట చేర్చి ప్రజోపయోగానికి గ్రంథాలయాలను ఏర్పాటు చేసికొనటానికి అవకాశములుండేవి గావు. ఒక గ్రంథం కావాలంటే చాలా శ్రమపడవలసి వచ్చేది. ఏ రాజస్థానానికో, ఏ పండితుల వద్దకో వెళ్ళి వ్రాసికొనవలసి వచ్చేది. భాషా పోషకులయిన కృష్ణదేవరాయల వంటి వారి ఆస్థానములలో ఎక్కువగా గ్రంథాలుండేవిగాని అవి అందరికీ అందుబాటులోనున్నట్లు కనిపించదు. ఏ పండితులో అక్కడికి వెళ్ళి ఆ గ్రంథాలకు ప్రతులు వ్రాసికొనేవారు. అంటే పూర్వం విరివిగా గ్రంథాలకు కాపీలు వ్రాయటానికి వీలుండేది కాదు. దీనిని బట్టి చూస్తే గ్రంథాలయాలకు కూడ అవకాశాలు తక్కువనే అనుకోవాలి, వున్నా అందరికీ ఉపయోగపడేవి కావు. నైమిశము, వారణాసి, తక్షశిల, నలంద మొదలగు విద్యా కేంద్రాలలో గ్రంథ సంచయము ఉన్నట్లు మనకు తెలుస్తుంది. అయితే ఎందరు ఆయా కేంద్రాలకు వెళ్ళి చదువుకొనేవారు? చాల తక్కువ మంది వెళ్ళుతూ వుండేవారు.

తరువాత రోజుల్లో తంజాపురాన్ని పరిపాలించిన మహారాష్ట్ర మహారాజులు నిర్మించిన సరస్వతి మహలు ఒకటి ప్రసిద్ధమైనది. దక్షిణ భారతదేశంలో మహారాజులు నిర్మించిన ప్రత్యేక గ్రంథాలయం అదొక్కటే నేటికి మనకు నిలిచి వున్నది. దానిలో తెలుగు, తమిళం, కన్నడం, మళయాళం సంస్కృతం మొదలగు భాషలలో ప్రసిద్ధమైన గ్రంథాలున్నాయి. ఇది మహోన్నతమైన గ్రంథాలయము. ఇది మనందరకు గర్వ సర్వస్వము. ఎంతో కష్టపడి గ్రంథాలను సంపాదించుకుంటేనే గాని పూర్వం విద్యాసముపార్జనమునకు వీలుండేది కాదు. దూరమనక, భారమనక గ్రంథ సేకరణకు వెళ్ళవలసి వచ్చేది. అందుకే గదా ఫాహియాన్, హుయాన్‌త్సాంగువంటి బౌద్ధ విజ్ఞాన పిపాసువులు భారతదేశానికి వచ్చింది. కాలి నడకతో దేశమంతా కలయ దిరిగారు గదా! యీ విషయం చరిత్రలో మనం చదువుకొన్నాము. కానియిప్పుడు కాగితం కనిపెట్టిన తరువాత, అచ్చు యంత్రాలు అవతరించిన తరువాత, తదితర విజ్ఞానోపకరణాలు వెలసిన తరువాత విశ్వ సాహిత్యం విశ్వతోముఖంగా అభివృద్ధి మైనది. ఇది యీ యుగంలో జీవించే మన అదృష్టమనే చెప్పకోవాలి. ఇప్పుడే గ్రంథం కావాలన్నా చేయి చాపితే అందివస్తున్నాయి. గ్రంథాలయోద్యమాలతో ప్రతి పట్టణంలోనూ గ్రంథాలయాలు ఏర్పడ్డాయి.

మన జాతీయ ప్రభుత్వమేర్పడిన తరువాత విద్యయొక్క ప్రాముఖ్యాన్ని గుర్తించి కవులకూ, రచయితలకూ ప్రోత్సాహమిస్తుంది. తత్ఫలితంగా అనేక ఉత్తమ గ్రంథాలు మన భారతీయ భాషల్లో వెలువడుతున్నాయి. సాహిత్య అకాడమీల ద్వారా ప్రభుత్వం ఉత్తమ గ్రంథ ప్రచురణకు పూనుకొనినది. ఇది మన సాహిత్య ప్రపంచానికి సుప్రభాతం.

గ్రంథాలే కాకుండా గ్రంథాలయాలను గూడ ప్రభుత్వం ప్రతి పల్లెలోను స్థాపించి అవిద్యను రూపుమాపటానికి ప్రయత్నిస్తుంది. ఈ గ్రంథాలయాలు అజ్ఞాన తిమిరమునకు తరణి కిరణాలు, విజ్ఞాన దేవాలయాలు, వాగ్దేవి విహారా రామాలు ఉత్తమ సంస్కృతీ నిలయాలు. వీనిని వయోజనులు మొదలుకొని పట్ట భద్రులవరకు సక్రమంగా ఉపయోగించుకొని వానియొక్క ప్రయోజనమును గుర్తించిన నాడు ప్రపంచంలో ఏ దేశానికి తీసిపోకుండ మనం విజ్ఞాన దీపాలను వెలిగించుకోగలం.

సుప్రసిద్ధ రచయితలు

గోపీచంద్

కొడవటిగంటి

ముళ్ళపూడి

మారుతీరావు

ముద్దంశెట్టి

ధనిష్ఠ

రావి కొండలరావు

టి. రామచంద్రరావు

డాక్టరు టి. వెంకటేశ్వరరావు

మరియు

త్రిపురనేని రామస్వామిచౌదరి

గార్ల రచనలు ప్రచురించి మీ అందరి
ఆదరాభిమానాలు చూరగొన్న
ప్రచురణ సంస్థ,



NAVODAYA PUBLISHERS VIJAYAWADA 2

**నవోదయ**
పబ్లిషర్స్
విజయవాడ 2

కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరీ అధారిటీ
వారు జరుపుచున్న జిల్లా గ్రంథాలయ
సెమినారుకు

**అందజేస్తున్న శుభాకాంక్షలు!**

# యజుర్వేద భాష్యము

వేదములను స్వతః ప్రమాణములుగ స్వీకరించు ఆర్యసమాజమును స్థాపించిన మహర్షి దయానందుని భాష్యమునకు ఆంధ్రానువాదమిది.

ఋషి దేవతాదులను, మంత్ర విషయమును నిర్దేశించి స్వరసహిత మంత్ర పాఠముతోపాటు పదపాఠమునిచ్చు ప్రతిపదార్థము, అన్వయము, భావార్థము అని మూడు భాగములుగ దయానందుడు సరళ సంస్కృతమున భాష్యమొనరించి యుండెను. దానినంతటిని తెలుగు లిపిలో సస్వరముగ ముద్రించుచు అన్వయ భావార్థములకు ఆంధ్రానువాద మివ్వ బడినది. దీని కనుబంధముగ పద-మంత్ర-మంత్రార్థ విషయ-ఋషి - దేవతల అనుక్రమణికలుకూడ ప్రకటించబడినవి.

ఆంధ్రభాష యందపూర్వ కృతి. పండిత పామరులందఱకు ఉపయోగకరమైనది. రాయలు $\frac{1}{8}$ సైజు, 2500 పుటలు.

| | | |
|---|---|---|
| 1 | 1 నుండి 10 అధ్యాయములు. | 23-00 |
| 2 | 11 " 20 " | 30-00 |
| 3 | 21 " 30 " | 20-00 |
| 4 | 31 " 40 " | 15-00 |
| 5 | యజుర్వేదానుక్రమణికలు | 20-00 |
| | ( 25% కమీషను. పోస్టేజి లేదు. ) | |
| 6 | కఠోపనిషదార్య భాష్యము | 1-50 |
| 7 | వర్ణోచ్చారణశిక్ష ( ప్రాణినీయము ) | 0-20 |

త్వరపడుడు. కొలది ప్రతులు మాత్రమే వున్నవి. పునర్ముద్రణము దుస్సాధ్యము. 10% అడ్వాన్సు పంపుచు రైలుస్టేషను తెలియజేయండి.

వలయువారు :

అన్నె కేశవార్యశాస్త్రి.

శ్రీ మద్దయానంద వేదాను సంధాన సదనము,
3 5-1003; నారాయణగుడ హైదరాబాదు 20.

# గ్రంథాలయము

పైడిపాటి సుబ్బరామశాస్త్రి

గ్రంథాలయములు
వర్ధిల్లి - స
ద్గ్రంథమ్ములు, శో
భించాలి,,

గ్రంథంబే అనుబంధంబై - తర
తరాలుగా మను మానవజాతికి
తిన్ననైన వంతెనగా నిలచుచు
మంచి చెడ్డ వివరించెడు గురువై ॥

జగచ్ఛ్రేయమును సంకల్పించి
మహామహులు తమ మహానుభవముల
జనులకైన సంకేత ఫులిపిలో
ఒనర జేసి నుపకార శీలురై ॥

జాతి హితమ్మో నీతియుతమ్మో
గ్రంథమ్ముల పఠనమ్మే ప్రజలకు
జీవన పద్ధతి చెలువల రారెడి
భావమ్ముల కలిగించి మించుగా॥

గ్రంథాలయములు వర్ధిల్లి - స
ద్గ్రంథమ్ములు శోభించాలి.

# గ్రంథాలయములు

శ్రీ కాకాని నరసింహారావు



శ్రీలకు నునికిపట్టు గుణశీల మహత్త్వము కాటపట్టు, వి
ద్యా లలితానురాగ సుపథమ్ములఁ జేర్పగ నాదిమెట్టు, వి
ద్యాలయ తోడఁబుట్టు; సుగుణాళి వెలింగెడి పూలచెట్టు, గ్రం
థాలయ మిట్టి దట్టిదని యాప్యులకే వచియింప నేటికో

పొత్తము లెల్ల విప్పి జనముల్ పఠియింపగ లేరు గాన న
త్యుత్తమ మైన గ్రంథముల నొక్కెడఁ జేర్చి యెల్లవారికిన్
విత్తము లేకొసంగుటను విద్య వివేకము నైకమత్యమున్
చిత్తమునందు పాదుకొను చింతలడంగును సౌఖ్యమబ్బెడున్

వినయ మొసంగు విద్యయని వేత్తలు చెప్పిన; సద్యపుష్పమున్
మానసము సేయ దానగల మంచి యెఱుంగక నౌను, విద్య దు
ర్జనులు హరింపఁ జాలని యచంచలమైన ధనమ్ము, విద్యయే
కనుగవ; యద్దిరాని యెడఁ గన్నులు లేని కబోదియే యగున్.

# The Viziavada Co-operative Central Bank, Limited,

VIJAYAWADA-2.

Phone No. 262 — (Estd. 1918) — Post Box No. 368

*Branches :*

Jaggayyapet P.O.), Nuzvid (P.O.), Vuyyuru (P.O.), Tiruvuru (P.O.)

**Bankers to all the Co-operative Societies in the West Krishna District.**

| | | |
|---|---|---|
| Authorised Share Capital | .... | Rs. 35,00,000 |
| Reserves. | .... | 12,34,000 |
| Working Capital. | .... | 267,76,000 |
| Paid up share capital. | .... | 28,77,000 |
| Deposits and Borrowings. | .... | 231,43,000 |
| Net Profit (1961-62) | ... | 3,88,000 |

**THIS IS 'A' CLASS CENTRAL BANK.**

1. *Fixed deposits are received at the following rates:*

| | | Below Rs. 5,000/- | Rs. 5,000/- and over. |
|---|---|---|---|
| 1 to 3 months. | .... | $3\frac{3}{4}$% P. A. | 4 % P. A. |
| 6 months. | .... | 4 % ,, | $4\frac{1}{4}$% ,, |
| 12 months. | .... | $4\frac{1}{4}$% ,, | $4\frac{1}{2}$% ,, |
| 24 months. | .... | $4\frac{1}{2}$% ,, | $4\frac{3}{4}$% ,, |
| 36 months. | .... | $4\frac{3}{4}$% ,, | 5 % ,, |
| 48 months. | .... | 5 % ,, | 5 % ,, |
| 60 months and above | .... | 5 % ,, | $5\frac{1}{8}$% ,, |

Special rates of interest for sums of Rs. 25,000/- and over.

2. *Savings Deposits @ 3% per annum.*
   Rs. 1,000/- can be withdrawn in a calendar week.
   Cheque books are issued.
3. *Current Deposits @ ½% per annum.*
4. *Recurring* Deposits *@ 4 to 5% per annum*
   Cheques and Drafts issued at reasonable rates on Madras, Bombay, Calcutta, Hyderabad, New Delhi and on all other important Towns in Andhra Predesh)

**Particulars can be had from the Secretary.**

**S. V. KRISHNAMURTHY,** M.A.,
SECRETARY.

**E. B. V. RAGHAVAIAH,** B.A.,
PRESIDENT.

# గ్రంథాలయోద్యమ చరిత్ర

గోనుగుంట్ల నాగేశ్వరరావు, B. A.,

భారతజాతి, దానిసత్వ విముక్తికి, ముఖ్యముగా నిరక్షరాస్యత నిర్మూలన ప్రధానమైన అంశముగా సంఘ సంస్కర్తలుముందెన్నడోగుర్తించి, యందులకు, కావలసిన యుద్యమము కొరకు పరిశీలనలు జరిపిన కృషి ఫలితముగా గ్రంథాలయోద్యమము, మాత్రమే తగిన మార్గమని స్థిర నిశ్చయమునకు వచ్చినారు.

ఆంధ్రదేశములోని సంఘ సంస్కర్తలందరూ గ్రంథాలయోద్యమ నాయకులే. అనాదీయముగా సంఘమున అవరించియున్న జటిలదురాచారముల రూపుమాపి, సంఘచైతన్యమునకు యీ వుద్యమముద్వారా పూనుకొని, కృతార్థులైనారు. తదుపరి స్వాతంత్ర సముపార్జన రంగముకూడ గ్రంథాలయోద్యమముద్వారా ఫలించినదని మాత్రము మనము గ్రహించఫలసియున్నది. గ్రంథపఠనముద్వారా వ్యక్తి తన శక్తిని తాను గ్రహించుకొనగలిగి, తన హక్కులను తాను స్వీకరించ పూనుకొనుటకు యీ వుద్యమము వెలుగుబాటల నిచ్చినది.

దానిసత్వమున కృంగి, కృశించియున్న పూర్వపు హైదరాబాదు రాజ్యములో రాజకీయ చైతన్యము గ్రంథాలయోద్యమముద్వారా జరిగినది మాత్రము మరపురాని విషయము. తత్ఫలితమే హైదరాబాదు ప్రజలదాస్య విముక్తి, స్వాతంత్ర్య సముపార్జన, మరియు యీనాటి దేశ సర్వతోముఖాభివృద్ధికి అవకాశము కలిగినది.

పరిప్రథమదశలలో యీ వుద్యమనాయకులు యీ రంగమున అనేక యిక్కట్టులకు గురికావలసి వచ్చినది. ప్రజలవల్ల, పరాయి ప్రభుత్వమువలన కాని, యెన్ని యిబ్బందులైనసూ యోరికతో, సమర్థతతో, మన నాయకులు అధిగమించి తమలక్ష్యసిద్ధికి, చేయుకొనకలిగి నారన్నచో గ్రంథాలయోద్యమములోని విశిష్ట, పవిత్రత, ఆశయ, సమ్మిళితమేనని మాత్రము గ్రహించవలయును. ఈ గ్రంథాలయోద్యమము జాతీయోద్యమమునకు, బీజ బీజాక్షరములుగా యుండుటేగాక వెన్నెముకగాకూడ పనిచేసి, జాతిమనో వికాసములకు, పురోభివృద్ధికి, దోహదకారిగా సహాయ పడినది ఇట్టి అసమానశక్తి కలిగిన యుద్యమము కావుననే, మన జాతీయప్రభుత్వములు పదవీ స్వీకరణ జరిగిన వెంటనే చట్ట సమ్మతమైన, వుద్యమముగా గుర్తించి యీ వుద్యమ వ్యాప్తికి సర్వవిధముల తోడ్పడుచూ అభివృద్ధి పరిణాళికలు వేయుచున్నారు.

గ్రంథాలయము అతి పవిత్రమైన శారదా నిలయము. ఈ మహాతల్లియొక్క కరుణా కటాక్షముననే, మన జాతి విజ్ఞాన వికాసములు దినదిన ప్రవర్థమానముగా విలసిల్లుచున్నవి. యిట్టి శారదా నిలయము ప్రతి గ్రామమున కొకటి తప్పనిసరిగా మనము ప్రోత్సహించ వలయును. పాశ్చాత్య రాజ్యములలో యింటింట గ్రంథాలయములు, గ్రామ గ్రామ గ్రంథాలయములు కలిగియున్నవనుట ఆశ్చర్య విషయము గాదు మనదేశ ప్రజలస్థితికూడ అట్టిస్థాయికి వచ్చినచో మన విజ్ఞాన సంపద లేరికు అలివిమీరును. అందులకు మనమంత రము పూనుకొని పనిజేయవలయును. ప్రజల అజ్ఞానం ఆధారం చేసుకొని నియంతృత్వం మనగలదు. ప్రజాస్వామ్యం అలాకాదు. ప్రజలలో విజ్ఞానం ఎంతగా పెంపొందితే ప్రజాస్వామ్యం అంతగా దేశంలో పాదుకొంటుంది. చిరస్థాయిగా మనగలుగుతుంది. గ్రంథాలయాలు అందుకు అధికంగా దోహదం చేయగలవు.

గ్రంధాలయముయొక్క పవిత్రత, విశిష్టతలనుగూర్చి యొక మహాపురుషునియొక్కసూక్తి మనము మరువరాదు.

"గ్రంధనిలయములేని స్వర్గమునకన్న
గ్రంధనిలయమున్న నరకము, నే నభిలషింతు."

యిందలి భావమును గ్రహించిన మనము యీ గ్రంధాలయ వుద్యమములోని, నిగూఢశక్తిని తెలిసికొనగలవార మగుదుము.

పరమ పవిత్రమైన గ్రంధాల యోద్యమము శైశవ దశయందు జయప్రదముగా నిర్వహించుకొని యీనాడు ప్రజా ప్రభుత్వ ఆదరణతో మన ముందుకు చట్టరీత్యా రాబడినది.

ఇట్టి యీ వుద్యమవ్యాప్తికి, సఫలతకు కార్యకర్తలు అనుభవజ్ఞులై త్యాగశీలురై యుండి, సాఫల్యముచేసినచో గ్రంధాలయోద్యమము సత్ఫలితములు. సామాన్య ప్రజానీకమునకు అందజేసి, జాతి సర్వతోముఖాభివృద్ధికి నాందిగా యుండి, జాతీయ ప్రభుత్వములద్వారా "రామరాజ్య" స్థాపన కవకాశములు సుకరముజేయును.

ఈ గ్రంధాలయోద్యమ నాయకుల తపశ్శక్తిద్వారా సంపాదించిన యీ మహాశక్తి పూజఫలితమే, గ్రంధాలయోద్యమముగా యీనాడు వాడవాడలకూ గ్రాకి జాతికి వెలుగు బాటలనిచ్చి గమ్యస్థానమునకు ప్రతి ఫలాపేక్ష లేక జేర్చ గలుగుచున్నది.

ఆద్యంతములులేని యీ మహోద్యమములోని కార్యక్రమమునకు ప్రతియొక్కరును సహకరించి, అభివృద్ధికి తోడ్పడుట మన కర్తవ్యమని ప్రతిజ్ఞపూని పనిచేయవలసిన అవసరమున్నది.

జై హింద్

---

# గ్రంథాలయములు - సమాజ విద్య

శ్రీ నాగులపల్లి సీతారామయ్య.



భాష నేర్చుకొనడానికి, విజ్ఞానాన్ని సంపాదించడానికి అక్షరాస్యత అతి ముఖ్యమని ఈ కాలములో మన మందరం అంగీకరించుచున్నాం. ప్రాచీన కాలములో కూడ అక్షరాస్యతా ప్రచారము వివిధరకాలుగా జరిగినట్లు చరిత్ర వల్ల తెలియుచున్నది. అశోకుని కాలములో రాతి స్తంభముల మీద, శిలలమీద, రాగి రేకులమీద 'బౌద్ధ ధర్మము' లను చెక్కించిరి. ప్రజలు వాటిని చదువుకొని ప్రయోజనము పొందిరి. మరియు నలందా విశ్వవిద్యాలయంలోని గ్రంథాలయం, నాగార్జునుని గ్రంథాలయం, మహమ్మదీయుల కాలములో అభివృద్ధిగాంచిన గ్రంథాలయములు కూడ ప్రాచీన భారతావనియందు చదువుల ప్రచారమునకు ఉపయోగపడినవి.

ఆధునిక విజ్ఞాన పరిశోధనల ఫలితముగా అచ్చు యంత్రములు ప్రచారములోనికి వచ్చిన తరువాత ప్రతివారు చదువరియైన జీవిత మాధుర్యాన్ని గ్రోలుటకు అర్హులుగా చేయవలయుననే సిద్ధాంతము అమలులోనికి వచ్చినది. ముఖ్యంగా మనదేశము నిరక్షరాస్యులతో నిండియున్నది. ఈ స్థితిలో పాశ్చాత్యదేశాలన్నీ సత్వరాభివృద్ధి పొందుతూవుంటే, మన బ్రిటిష్ పరిపాలకులకు విద్యాభివృద్ధి విషయములో తగిన శ్రద్ధలేకపోయింది. అప్పుడు దేశములో రాజకీయ చైతన్యము బయలుదేరింది. మన దాస్య శృంఖలా లను త్రెంచుకోవలయుననే ఆవేదన నాయకులలో బయలుదేరింది. ప్రజాసామాన్యములో స్వాతంత్ర్య పిపాసను కల్పించడానికి, గ్రంథాలయాల స్థాపన, వయోజన విద్యా ప్రచారము విస్తారముగా సాగినవి. గాంధీజీ సూచించిన నిర్మాణ కార్యక్రమములో దీనినొక అంశంగా చేర్చుటతో వయోజనవిద్యా ప్రచారము ఒక ఉద్యమముగా రూపొందినది.

1935 వ సంవత్సరం మన దేశ పరిపాలనకై బ్రిటిష్ ప్రభుత్వమువారు ప్రవేశపెట్టిన 'గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఆక్టు' వలననే అక్షరాస్యతకు ఒక [illegible] కలిగిన దని చెప్పకతప్పదు. అందులో బ్రిటిష్ ప్రభుత్వమువారు చదువుకున్నవారికి ఓటు యివ్వడమనే విధానాన్ని ప్రవేశ పెట్టిరి. మనదేశములో రాజకీయ చైతన్యం ప్రారంభమయిన నాటినుండి వయోజన ఓటింగుహక్కు కొరకై ఆందోళన జరుగుచునేయున్నది. పూర్ణ ప్రజాస్వామ్యము విజయవంత మగుటకు యిదే ఆధారమని మన నాయకులు వాదించినారు. అక్షరాస్యత ఓటు మూలముగా వయోజనులందరికీ ఓటు సాధింపవచ్చుననే ఆశ జనించగానే ప్రజాసేవా సంస్థలన్నీ ఒక్కుమ్మడిగా వయోజన విద్యాప్రచారమునకు పూనుకొని ప్రజల నాకర్షించినవి.

ఆనాడు 'ఔంధు' సంస్థానాధీశ్వరుని. అతని సంస్థానములో స్వరాజ్యము స్థాపించుటకుగాను అక్షరాస్యులందరికి ఓటునిచ్చి, పంచాయితులను నేర్పర్చమని గాంధీజీ ఉపదేశించినారు. ఈ ఉద్దేశ్యాన్ని సాధించడానికి, ఆయన ఒక సంవత్సరములోగా అతని సంస్థానములోని ప్రజలందరిని అక్షరాస్యులను చేయ నిశ్చయించడముచేత అక్షరాస్యతా ప్రచారమునకు గొప్ప దోహదము కలిగినది. దీని ప్రభావముచేతనే మొదట రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలు ఏర్పడినప్పుడు, వారు విస్తారమైన అక్షరాస్యతా ప్రణాళికలనువేసి అమలులోపెట్టిరి.

కాని మద్రాసు రాష్ట్రములో ప్రభుత్వము ఈ ప్రణాళికను అమలులో పెట్టలేదు. అందుచేత యీ కార్యక్రమాన్ని గ్రంధాలయ సంఘాలు, యువజన సంఘాలు, రాత్రిపూట పాఠశాలలను స్థాపించి అక్షరాస్యతా ప్రచారమునకు విశేష కృషిచేసినవి. ఈ రంగంలో విశేషానుభవముకలిగిన డాక్టరు లాబక్, శ్రీ గో. రా., శ్రీ శనివారపు సుబ్బారావు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, శ్రీ కె. జె. సుందరం శ్రీ దేవరాజు, శ్రీమాన్ సి రాజగోపాలాచారి, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారలు వయోజనులకొరకై పెద్దల పుస్తకాలనువ్రాసి, అక్షరాస్యతా ప్రచారానికై పాటుపడిరి. 1939 వ సంవత్సరములో దక్షిణ భారత వయోజన విద్యా సంఘము స్థాపింపబడినది. బ్రిటిష్ ప్రభుత్వము యీ అభివృద్ధిని, ప్రజాచైతన్యాన్నిచూచి సహించలేక 1941 వ సం॥ములో అన్నివయోజన విద్యాతరగతులను, వయోజన విద్యా శిక్షణ తరగతులను నిర్బంధాలకు లోనుచేస్తూ ఉత్తర్వులను జారీచేసినది. దానితో ఈ కార్యక్రమవేగము తగ్గినది.

1947 వ సంవత్సరములో మనకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత వయోజనవిద్యా ఉద్యమానికొక నూతన స్వరూపము వచ్చినది. వయోజన ఓటింగుద్వారా యేర్పడిన ప్రజాస్వామిక విజయానికై, కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు, అక్షరాస్యతా వ్యాప్తికై దీక్షవూనినవి 1948 సంవత్సరములో 'వయోజనవిద్య'కు విశాలమైన ఉద్దేశ్యముతో 'సమాజ విద్య' (సోషల్ ఎడ్యుకేషన్) అను పేరు ఉంచబడినది. మన ప్రణాళికలలో తగిన నిధులను కేటాయించినారు. మొదటి పంచవర్ష ప్రణాళికలో చెప్పబడినట్లు 'సమాజాభివృద్ధికి సామాజికుల కృషిద్వారా సర్వ సమగ్రమైన ప్రణాళిక 'సమాజవిద్య'లో యిమిడియున్నది; గనుక వయోజనుల అక్షరాస్యత, ఆరోగ్యము, వినోద కాలక్షేపము, గృహ జీవనములతోపాటు పౌరశిక్షణ, ఆర్థికస్తోమతు నభివృద్ధి పర్చుకొనుటకు మార్గదర్శకత్వము, సమాజవిద్యలో భాగములై యున్నవి ప్రజాస్వామికము స్థిరపడటానికి లక్షలాది జనుల యొక్క అవసరాలతో ముడిపడియున్న ప్రణాళికా బద్ధమైన అభివృద్ధికి సమాజవిద్య ముఖ్యమైయున్నది. దీనికై యీ సమాజ విద్యా ప్రచారమునకై గ్రామాలలో సాంఘిక కేంద్రాలు, పఠనమందిరాలు, యువజన సమాఖ్యలు, వనితా మండలులు, గ్రామపంచాయితీలు పది సంవత్సరాలలో కొంత అభివృద్ధిని సాధించినవి. ఈ 1951-61 సం॥ముల లోపల అక్షరాస్యతా శాతము 17 నుండి 28 వరకు పెరిగినది.

1960 సంవత్సరాంతానికి మనదేశ జనాభా 40 కోట్లు. ఇందులో నూటికి 28 మంది మాత్రమే అక్షరాస్యులు. కాని అక్షరాస్యులలో పురుషులు నూటికి 41 మంది వుంటే స్త్రీలు 13 మంది మాత్రమే వున్నారు. కనుక మన స్త్రీలను విద్యావతులనుచేస్తే తప్ప వయోజనవిద్యా కార్యక్రమములో ఎక్కువ అభివృద్ధిని సాధించలేము. స్త్రీలు చదువుకున్నవారు అయితే వారిని పాతరోపద్ధతులపట్ల పట్టువల. అజ్ఞానము, మూఢనమ్మకాలు నశించి, మన ఆర్థికాభివృద్ధికి దోహదకారులగుదురు.

14 యేండ్ల వయస్సులో విద్యాలయాలను విడిచిపెట్టే పిల్లలకు, అనంతరవిద్యకు అవకాశం లేకుంటే ప్రాథమిక విద్యకు మనము వెచ్చించే ధనము, శ్రమ వృధాకాగలవు. చదువుకున్నవారిలో చాలమంది నిరక్షరాస్యులుగా మారకుండా వారిలోని విద్యాతృష్ణ నభివృద్ధి పరచడానికి సర్వ పరికరాలు అందచేయవలసియున్నది. వీరికిన్నీ, స్త్రీలకున్నూ, నిరక్షరాస్యులకున్నూ, పఠనాభిలాషను, విజ్ఞాన ప్రచారమునకు గ్రంథాలయములు ముఖ్యమని స్పష్టమైనది.

అందుకై కేంద్ర విద్యామంత్రిత్వ శాఖవారి కార్యక్రమములో నొకభాగము క్రొత్తగా అక్షరాస్యులైనవారి నిమిత్తము సాహిత్యసృష్టి సమాజ విద్యా క్షేత్రములో కృషిచేసే సేవా సంస్థలకు తోడ్పడుట, గ్రంథాలయ సేవ, విస్తరణ యున్నది. రాష్ట్రీల విద్యా ప్రణాళికలలోకూడ గ్రంథాలయములు, వయోజన విద్యా మందిరముద్వారా సమాజ విద్యకు కావలసిన సాంఘికాభివృద్ధి కార్యక్రమాలకై ప్రణాళికా బద్ధమైన బడ్జెట్టుద్వారా నిధులు కల్పింపబడినవి.

ఇప్పుడు చైనా భారత భూభాగముపై దండయాత్ర చేయుటంవల్ల దేశంలో అత్యయిక పరిస్థితి యేర్పడినది. ఈ స్థితిలో సమాజ విద్య ప్రత్యేక ప్రాముఖ్యము వహించుచున్నది. దీనిని ఒక మహోద్యమముగా చేయవలసియున్నది. చదువుకున్న ప్రతిఒక్కరు పది మందిని అక్షరాస్యులుగా చేయవలెననే దీక్ష పూనాలి. (ఈచ్ వన్ టీచ్ టెన్) సమాజ విద్యద్వారా దేశములో జాతీయైక్యత, క్రమశిక్షణ, ఆర్థికాభివృద్ధికి ప్రచారాన్ని, స్వచ్ఛంద సేవాసంస్థలు, సహకార సంఘాలు, పంచాయితీలు, పాఠశాలలు, గ్రామ స్వచ్ఛంద సేవాదళాలు, గ్రంథాలయాలు వనితా మండలులు, చేయవలసియున్నది.

జై హింద్.



# మన గ్రామీణ గ్రంథాలయాలు- కొన్ని సూచనలు

శ్రీ విజయకుమార్ సిన్హా

న్యూఢిల్లీ



నేడు మన గ్రామీణ ప్రాంతాల్లో నిర్మాణ మవుతున్న సామ్యవాద సమాజంలో అనేక కొత్త వ్యవస్థలు, సంస్థలు ఆవిర్భవిస్తున్నాయి. గ్రామీణ పునర్నిర్మాణానికి యివి ఎంతో ఉపకరిస్తాయి అలాంటి వాటిల్లో గ్రంథాలయాలను స్థాపించడం ఒకటి ఐతే సాంఘిక కార్యక్రమాలకు తగినంతగా వనరులు ప్రస్తుతం మనకు లేవు చైనా దురాక్రమణ వల్ల ఈ పరిస్థితి మరింత క్షీణించింది

ఉన్న పరిమితిలోనే అన్ని రంగాలలోను మనం కార్యక్రమాలను కొనసాగించాలి. ఇక విద్యా విషయం చెప్పనవసరంలేదు. ఇందుకు ప్రత్యేక శ్రద్ధ చూపవలసి వుంది.

విద్యా రంగంలో గ్రంథాలయాలు ప్రత్యేక స్థానాన్ని పొందుతాయి.

ఇంగ్లండు, అమెరికా లాంటి విదేశాల్లో సంచార గ్రంథాలయాలు జిల్లా గ్రంథాలయ వ్యవస్థలో అంతర్భాగంగా పనిచేస్తాయి. సంచార శకటాలు పుస్తకాలను జిల్లా అన్ని ప్రాంతాలకు కొనిపోతాయి. అనుభవం గల్గి, సమర్థుడైన 'లైబ్రేరియన్' వీటిలో పనిచేస్తాడు. పాఠకుల అభిరుచుల కనుగుణంగా అతడు పనిచేయడమేగాక వారి అవసరాలను కూడ గమనిస్తూ వుంటాడు.

ప్రస్తుత ఆర్థిక కారణాలవల్ల అలాంటి సంచార గ్రంథాలయాలను మనం వెంటనే ఏర్పాటు చేయలేకపోవచ్చు. కాని జిల్లాలోని ప్రధానమైన గ్రంథాలయ కేంద్రాలు క్రమపద్ధతిని, పుస్తకాలను మార్చుకొనే పద్ధతిని ప్రవేశపెట్టవచ్చు. ప్రజలు ఎక్కువగా చదువగోరే పుస్తకాలను ఈ పద్ధతిని అధికంగా వినియోగించుకోవచ్చు.

జిల్లాలోని ప్రతి పెద్ద గ్రంథాలయంలోను ఒక ఆచూకి విభాగం (రిఫరెన్సు సెక్షన్) వుండటం ఎంతో అవసరం. ఏ విషయం మీదనైనా సమాచారం వెంటనే తెలిసికొనడానికి దీనివల్ల వీలవుతుంది విద్యా సంస్థల సిబ్బంది, పంచాయితీ సమితి సభ్యులు, సిబ్బంది, విద్యార్థులు మున్నగు వారికి ఈ విభాగం ఎంతగానో వుపయోగపడుతుంది. తెలుగు విజ్ఞాన సర్వస్వం (ఎన్‌సైక్లోపిడియా) విజ్ఞాన గ్రంథాలు, ప్రామాణికమైన నిఘంటువులు,

గ్రామీణ వ్యవస్థకు సంబంధించిన శాసనాలు, ఆంధ్ర సంస్కృతిని తెలిపే పుస్తకాలు, భారతీయ వార్షిక గ్రంథం, ప్రపంచ భారతీయ చరిత్రకు సంబంధించిన కొన్ని పుస్తకాలు, శాస్త్రీయ గ్రంథాలు, రాష్ట్ర ప్రభుత్వ శాసనాలు మొదలైనవి ఈ విభాగంలో వుండవచ్చు.

క్రొత్త పుస్తకాలను కొనడంలో ఎంతో శ్రద్ధ వహించాలి. ఇందుకు విద్యా, సాంకేతిక రంగాలలో ప్రావీణ్యంగల సభ్యులతో ఒక కమిటీని నియమించడం మంచిది. పుస్తకాలను ఎన్నిక చేయడంలో వాటి ఉపయోగాన్ని దృష్టిలో వుంచుకోవాలి. అలాగే పాఠకుల అభిరుచి తగ్గకుండా వినోదాన్ని కల్పించే పుస్తకాలనుకూడ కొనవచ్చు. క్రొత్తగా విద్య నభ్యసించే వారికోసం వ్రాసిన పుస్తకాలు, గ్రామీణ జీవితంపై సరళమైన భావంలో వ్రాసిన పుస్తకాలు, గ్రంథాలయాల్లో ఎక్కువగా వుపయోగపడతాయి. ఆరోగ్య విషయాలకు సంబంధించిన గ్రంథాలు గ్రామస్థులకు ఎంతైనా విజ్ఞానాన్ని అందజేస్తాయి.

ప్రతి గ్రంథాలయములోను కూడలి స్థలంలో సూచనలకోసం ఒక పుస్తకాన్ని వుంచాలి. పాఠకులు, తదితర గ్రామస్థులు గ్రంథాలయ నిర్వహణ పుస్తకాలపై తమ అభిప్రాయాలను ఆ పుస్తకంలో వ్రాయవలసిందిగా కోరాలి. దీనివల్ల స్థానికుల అభిరుచులు, అవసరాలు తెలిసికొనడానికి వీలవుతుంది.

ప్రత్యేక సంచికల (సావనీరు) ప్రచురణవల్ల గ్రామీణ గ్రంథాలయోద్యమాన్ని రాష్ట్రమంతటా వ్యాప్తి చేయడానికి అవకాశం కలుగుతుంది. ఈ ప్రయత్నంతోపాటు జిల్లా, రాష్ట్ర స్థాయిల్లో చర్చాగోష్ఠులు (సెమినార్) ఏర్పాటు చేయడం గ్రంథాలయోద్యమానికి మరింత బలం చేకూర్చుతుంది. ♦

# గ్రంథాలయాలు : స్త్రీలు

శ్రీమతి రాజ్యం సిన్హా, B. A. శాంతినికేతన్
న్యూస్ ఎడిటర్, ఆలిండియా రేడియో, న్యూఢిల్లీ.

"స్వాతంత్ర్య పోరాటంలో స్త్రీలు చాలామంది పాల్గొన్నారు. నేడు స్త్రీలకు వోటింగు హక్కు వుంది. మన దేశంలో ప్రఖ్యాతి చెందిన నారీమణులు అనేకమంది ఉన్నత పదవులలో ఉన్నారు." ఇవన్నీ ఉదాహరణలుగా చెప్పి మన దేశంలో స్త్రీలు చాలా ముందుకువచ్చారనడం పరిపాటైపోయింది. కాని ఇది ఒక భ్రమ మాత్రమే. భారత స్త్రీలు మొత్తంమీద వెనుకబడే వున్నారు. వారిలో ఎక్కువ మంది ఇవాళ కూడ నిరక్షరాస్యులు. ఇంకా మూఢనమ్మకాలతోనే బ్రతుకుతున్నారు. జీవితాన్ని గురించిన వారి అభిప్రాయాలు ఇంకా సంకుచితంగానే వున్నాయి. తమ గృహ జీవితాన్ని నడుపుకోడానికి కావలసిన శక్తి సామర్థ్యాలే వారిలో తక్కువగా ఉన్నప్పుడు ఇతర రంగాలలో పనిచేయడానికి కావలసిన సమర్థత ఎక్కడనుండి వస్తుంది ?

ఈ పరిస్థితినుంచి వారిని తప్పించడానికి మొదటి మార్గం మానసిక వికాసం కలుగచేయడం. అందుకు విజ్ఞానం అవసరం విజ్ఞానానికి దోహదం చేసేవి పుస్తకాలు.

గ్రంథాలయాలలో పుస్తకాల ఎన్నిక అతి జాగ్రత్తగా చేయవలసి ఉంటుంది. ప్రతి గ్రామీణ గ్రంథాలయంలోను, పౌను గ్రంథాలయంలోను ఈ పుస్తకాలు తప్పనిసరిగా ఉండాలి

## 1. స్త్రీల జీవిత చరిత్రలు

సృష్ట్యాదినుండి నేటివరకూ ప్రపంచంలో అన్ని నాగరికత దేశాలలో పేరుపొందిన నారీమణులు ఎంతోమంది వున్నారు. వీరి జీవిత గాథలు తప్పక ఉండాలి.

## 2. స్త్రీ ఉద్యమం

స్త్రీల ఉద్యమాలకూ ఈ ఉద్యమాలు సాధించిన విజయాలకు చెందిన పుస్తకాలు.

## 3. సంస్కృతి, మతము

అర్థంలేని దురాచారాలను ఖండించే పుస్తకాలు సాంఘిక చైతన్యాన్ని పురికొల్పే పుస్తకాలు. రాజా రామ్మోహన్ రాయ్, వీరేశలింగం, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, వివేకానంద మొదలగు వారి పుస్తకాలు ఈ కోవకు చెందినవి.

## 4. గృహ శాస్త్రం

పొదుపు, పుష్టికరమైన ఆహారం, పిల్లల పెంపకం, ఇంటి అలంకరణ, తీరికసమయాలను సద్విని

యోగం చేసుకోవడం మొదలగు విషయాలకు సంబంధించిన పుస్తకాలు.

### 5. దాంపత్య జీవితం

అంటే కేవలం 'సెక్సు' మాత్రమే కాదు. స్త్రీ పురుషుల బాంధవ్యం ఆధ్యాత్మిక వికాసానికి తోడ్పడాలి. దాంపత్య జీవితాన్ని ఉదాత్తంగా ఉన్నతమార్గంలో చిత్రించే పుస్తకాలు ఎన్నో ఉన్నాయి దేశీయ భాషల్లో నైతేనేమి, ఇంగ్లీషులోనైతేనేమి, ఇంకో సంగతి ఈ రోజున మన దేశంలో 'జనాభా పెరుగుదల సమస్య' ఎంత తీవ్రంగావుందో అందరికీ తెలుసు. అందుచేత 'కుటుంబ నియంత్రణ' గురించి సభ్యతగా సంస్కారంతో చెప్పే పుస్తకాలు గ్రంథాలయాల్లో ఉండాలి.

### 6. వినోదం

ఈ కోవకు చెందిన పుస్తకాలు మరీ జాగ్రత్తగా ఎన్నుకోవాలి కనిపించిన ప్రతి చెత్తా మెదడులోకి వెళ్తే ఎంతో ప్రమాదం. దేశానికీ, మనిషికీకూడ శరత్, ప్రేమ్‌చంద్ వంటి ప్రఖ్యాత రచయితల పుస్తకాలు, యాత్రలను గూర్చి చెప్పే గ్రంథాలు ఎన్నికచేసి చేర్చాలి.

చిన్న చిన్న పట్నాలలో, గ్రామాలలోవున్న స్త్రీల తీరిక కాలం వ్యర్థమైన కాలక్షేపం కబుర్లలో పోతుంది. అందుచేత గ్రంథాలయాలు తమ సిబ్బందిలో ఒక రిద్దరిని స్త్రీలను నియమించి వారు ఇంటింటికీ వెళ్ళి పుస్తకాలు ఇచ్చి పుస్తక ప్రయోజనాలను వివరించేటట్లుగా చూడాలి. పుస్తకాలను చదివే అభిలాష కలిగేటట్లు చూడాలి. ఈ పని తీరిక సమయాలలో హైస్కూలు కాలేజీ విద్యార్థినులు చేయవచ్చు. ♦



# ఆంధ్ర ప్రదేశ్ గ్రంథాలయోద్యమం

## శాసన పరిపాలనా - ప్రజాఉద్యమం సమ్మిళితంగా నడవాలె.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, M. L. A.

[సభ్యుడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గ్రంథాలయ సంఘం]

భారత దేశంలో బాగా వున్నతముగా రాజకీయ చైతన్యము కలిగి విజ్ఞానయుతముగా ఉన్నది అని గుర్తింపబడిన ఆంధ్రప్రదేశ్ మొత్తానికి కలిపి ఒక గ్రంథాలయ బిల్లు రావడం చాలా సంతోషము ఆంధ్రప్రాంతంలో కానిండీ, తెలంగాణా ప్రాంతంలో కానిండీ, మన రాజకీయ చైతన్యము, మన ప్రజలలోవున్న ఉత్సాహము అంతా గ్రంథాలయ ఉద్యమముతో ప్రారంభమైనదని చెప్పక తప్పదు ఏ గ్రామములో అయితే గ్రంథాలయము వున్నదో, ఆ గ్రామము సాంస్కృతికముగా, వైజ్ఞానికముగా, రాజకీయముగా, సజీవముగా వున్నది అని చెప్పటానికి వీలుంది. గ్రంథాలయము లేని గ్రామము ఎల్లప్పుడు తగాదాలతో నిండియుంటుందిగాని, ఆ గ్రామము అన్ని రంగాలలో వున్నతస్థాయికి పోజాలదు. ఆంధ్రరాష్ట్ర వుద్యమములో ప్రధాన స్థానము వహించినది గ్రం థా ల యో ద్య మ ము. తరువాతకూడా గ్రంథాలయ వుద్యమములో ఎక్కువ కృషి చేశారు మాలాంటివారిని "మీరు ఏ కాలేజీలో చదువుకొన్నారు?" అని అడిగితే, మేము లైబ్రరీ యూనివర్శిటీలో చదువుకొన్నాము అని చెప్పటకు మాకు సహజంగా గర్వంగా వుండేది. ఒక గ్రంథాలయము ప్రారంభించటము అంటే—అది సాంఘిక సేవకు ఒక రూపమన్నమాట. మన కౌన్సిల్ అధ్యక్షులవారు ఒకసారి ఒకమాట చెప్పారు. మా వూళ్ళో గ్రంథాలయము పెట్టుదాము అని ఎవరైనా వుత్తరం వ్రాస్తే "అక్కడ వొక స్పార్క్ బయలుదేరింది. ఒక అగ్నిహోత్రం బయలు దేరింది. ఒక జ్వాల బయలుదేరింది. ఇది ఆంధ్రకు చాలా సహాయం చేస్తుంది." అని వారు చాలా వుత్సాహ పడేవారు. ఎవరైనా ఒక యువకుడు గ్రంథాలయము స్థాపించి, ఒక నెల పనిచేసి ఉండనివ్వండి; లేదా రెండు నెలలు పనిచేసి వుండనివ్వండి, తర్వాత అతడు ఏదైనా ఒక ఉద్యోగంలోకి వెళ్ళనివ్వండి. అతడు వెళ్ళిపోయిన తర్వాత మరియొక యువకుడు బయలుదేరి అక్కడ స్థాపింపబడిన గ్రంథాలయము నడపటం జరుగుతూవచ్చింది. ఆంధ్ర ఉద్యమములో గ్రంథాలయ ఉద్యమానికి చాలా విశిష్టత ఉండినది. ఆంధ్ర ఉద్యమములో గ్రంథాలయ ఉద్యమము చాలా ప్రధానముగా ఉన్నది. ఈ గ్రంథాలయ ఉద్యమము ఆంధ్రదేశములో 1913 వ సంవత్సరములో బయలుదేరింది. 1914 వ సంవత్సరములో శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి అధ్యక్షతన ప్రథమ గ్రంథాలయ మహాసభ రాజమహేంద్రవరములో జరిగినది. దానికి తమబోటి పెద్దలందరూ హాజరైనారు. అప్పటినుండి ఇప్పటివరకు ఎన్ని రాజకీయ అభిప్రాయాలు ఉన్నా, అందరు కలిసి కూర్చునేచోటు ఏదన్నా ఉన్నదా-అంటే అది ఒక గ్రంథాలయమేనని చెప్పగలను. గ్రంథాలయములో ఎవరికి కావలసిన 'ఇన్‌స్పిరేషన్' వారు తీసుకోవచ్చును. ఎవరికి కావలసిన పుస్తకాలు వారు చదువవచ్చును. ఏ సిద్ధాంతాలైనా చదువవచ్చును. ఆ చదువుకున్న ఉపయోగము బయటవుంటుంది అందరూ కలిసి చదువుకోటానికి, కూర్చోటానికి మాట్లాడుకోటానికి, సన్నిహిత సహచర్యం పొందటానికి వీలైన స్థలము గ్రంథాలయము మాత్రమే ఉన్నదని నా ధృఢ విశ్వాసము. అది ఎల్లకాలం వుంటుందనికూడ నా ధృఢవిశ్వాసము. ఆంధ్రదేశములో

గ్రంథాలయ ఉద్యమము ప్రజా ఉద్యమముగా బయలుదేరింది. దానికి ప్రభుత్వముయొక్క అండలేదు అండలేకపోగా, గ్రంథాలయం ఎక్కడైనా పెడితే దానిపైన కావలసినంత నిఘాలుండేవి. తెలంగాణాలో గస్తీ నిషాన్ అని చెప్పి గ్రంథాలయాలపైన నిఘా ఉంచేవారు. పొలిటికల్ విషయాలకన్నా కూడ ఎక్కువగా గ్రంథాలయాల వెంట పడి తరిమేవారు. మనవైపున గ్రంథాలయాలు పెడితే అందులో ఎవరెవరు పనిచేస్తున్నారు. అక్కడేమేమి మీటింగులు జరుగుతున్నాయి. జాతీయ ఉద్యమానికీ, దానికి ఏదైనా సంబంధం ఉన్నదా? జాతీయ ఉద్యమానికి సంబంధించిన పుస్తకాలు అందులో ఉన్నాయా? అనే విషయాలన్నీ ప్రభుత్వంవారు ఆలోచించేవారు. అందువల్ల మన ఆంధ్రదేశంలోని ఎనర్జీకి, పొటన్షియాలిటీకి విజ్ఞానానికి కేంద్రాలు గ్రంథాలయాలు మనము ఇతర రాష్ట్రాలలో ఉన్నటువంటి గ్రంథాలయ ఉద్యమముగురించి ఆలోచించుకొంటే-బరోడా గ్రంథాలయ ఉద్యమము చాలా గొప్పదిగా మనము చెబుతూఉన్నాము. అక్కడ ప్రజా సహకారము చాలా తక్కువగా ఉండినది అక్కడ ప్రభుత్వాన్ని డబ్బు అడిగి ఏవో కొన్ని పుస్తకాలు పెట్టి, కొన్ని గ్రందాలయాలను పెట్టటానికి ప్రయత్నం చేశారు. కాని గవర్నమెంట్‌మీద ఆధారపడి వారు చేశారు కాని ఆంధ్రదేశములో ఆవిధంగా కాదు...గవర్నమెంటు డబ్బు ఇవ్వకపోతే తామే అవసపడి, ఎక్కడనుంచో డబ్బు తీసుకువచ్చి, ఆత్మవిశ్వాసంతో "ఇదిగో మా గ్రంథాలయము" అని పెట్టటం జరిగింది ఆంధ్రదేశంలో గ్రంథాలయ ఉద్యమము ప్రజాఉద్యమంగా మారింది 1920 వ సంవత్సరంలో పెద్దలందరూ యీ గ్రంథాలయ ఉద్యమంలో పాల్గొన్నారనేది చెప్పక తప్పదు. అది ప్రభుత్వ దృష్టికి ఎప్పుడు తీసుకురాబడిందంటే, కొండా వెంకటప్పయ్య పంతులుగారు కౌన్సిల్‌కు మెంబరుగా వచ్చినపుడు గ్రంథాలయాలకు ప్రభుత్వం కొంత గ్రాంటు ఇవ్వాలనేవిషయాన్ని ప్రభుత్వం ముందుకు తీసుకువచ్చారు. దానిని చివరకు ప్రభుత్వంవారు ఒప్పుకున్నారు. పదివేల రూపాయలు గ్రంథాలయాలకు గ్రాంటు ఇవ్వాలన్నారు. గ్రంథాలయాలకు ప్రభుత్వము గ్రాంటు ఇచ్చినప్పటినుండి గ్రంథాలయాలకు ఒక బెడద వచ్చింది. "ఆ గ్రంథాలయంలో ఏఏ పుస్తకాలు ఉన్నవి? గాంధీగారి చరిత్ర వున్నదా? వారి ఆత్మకధ ఉన్నదా? ఆ పుస్తకాలు తీసిపారేయి" అని ప్రభుత్వం చెప్పే పరిస్థితి వచ్చింది. రాజకీయపు పుస్తకాలు, విజ్ఞానము ఇచ్చే పుస్తకాలు లేకుండా, ఇంగ్లీషువారి గొప్పతనాన్ని తెలిపే పుస్తకాలు మాత్రమే అందులో వుంచటం జరిగింది. చాలా గ్రంథాలయాలు గవర్నమెంట్ గ్రాంటు అక్కరలేదని చెప్పటం జరిగింది. బెంగాల్‌లో గ్రంథాలయ ఉద్యమం ఉన్నది. అది కాలేజీ ఉద్యమము పంజాబ్‌లో గ్రంథాలయ ఉద్యమము ఉన్నది, అది హైస్కూలు ఉద్యమంగా ఉన్నది. తమిళనాడులోని గ్రంథాలయ ఉద్యమము కేవలము బస్తీలలో మాత్రమే ఉన్నది. బొంబాయిరాష్ట్రంలో గ్రందాలయ ఉద్యమము, బొంబాయి, పూనా, సిటీలలో మాత్రమే ఉన్నది. ఆ రెండు సిటీలకు సంబంధించి ఉంది. కాని ఆంధ్రదేశంలో గ్రంథాలయ ఉద్యమం బస్తీలలో, గ్రామాలలో, పల్లెలలో బయలుదేరింది. ఎక్కడచూచితే అక్కడ యువకులు ఉత్సాహంతో ముందుకు వచ్చారు. "నా పెళ్ళికి వచ్చినవాడు నా తమ్ముడి పెళ్ళికి రాడు; నా తమ్ముడి పెళ్ళికి వచ్చినవాడు నా రెండవ తమ్ముడి పెళ్ళికి రాడు" అన్న పద్ధతిలో ఒక ఉద్యమం ప్రారంభించిన అతను కొంతకాలం పనిచేసి వెళ్ళిపోతే, మళ్ళీ యింకో యువకుడు వచ్చి ఆ జ్యోతిని వెలిగిస్తున్నాడు. ఈనాటివరకు ఆంధ్రదేశంలో ఆరిపోకుండా ఉన్నటువంటి జ్యోతి-గ్రంథాలయ జ్యోతి. ఈనాడు ఆంధ్ర ప్రఖ్యాతి ఏదన్నా ఉన్నదంటే-దానికి కారణం యీ గ్రంథాలయ జ్యోతేనని చెప్పక తప్పదు. ఈ గ్రంథాలయ జ్యోతికి తెలంగాణాలో ఒక రూపము, ఆంధ్రలో ఇంకో రూపం ఉన్నది. అక్కడ రెండు సంఘాలు ఉన్నవి. అయితే బొగ్గులోనుండి రత్నాలు, మణులు వచ్చినట్లుగా, బొగ్గుల సీమగా ఉన్న సింగరేణి ప్రాంతంలో నైజాంయొక్క ఛత్రఛాయల క్రింద ఏమవుతుందోననే భయం ఉన్న పరిస్థితులలో బూరుగుల రామకృష్ణారావుగారి అధ్యక్షతక్రింద ప్రథమంగా ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ జరిగింది. అదే

ఆంధ్ర తెలంగాణా చరిత్రలో బహిరంగంగా సమిష్టిగా జరిగిన మొట్టమొదటి సాంస్కృతిక సమావేశము. అదే విశాలాంధ్ర కొరకు ఆర్గనైజేషనల్‌గా, ఒక సంఘంగా ఏర్పడి జరుపుకొన్న సమావేశము. ఈ సమావేశము జరిగింది సింగరేణి కాలరీస్‌లో. బొగ్గులోనుండి రత్నాలు వస్తాయని మనం అనుకుంటూ ఉండినాము అదేవిధంగా మనము బొగ్గులోనుండి రత్నాలు ఏరుకున్నాము. ఆ రత్నమే యీనాడు ఆంధ్రప్రదేశ్‌గా పరిణామం చెందింది. ఈనాడు ఆంధ్ర ప్రదేశ్ భారతదేశం మొత్తములో వైజ్ఞానికంగా ముందు ఉన్నది అని అనుకొంటున్నాము.

అమెరికాలో గ్రంథాలయాలు ఉన్నవి. దానికి కావలసినటువంటి శాసనాలూ ఉన్నవి. ఇంగ్లండులో గ్రంథాలయాలు ఉన్నవి. దానికి కావలసిన శాసనాలూ ఉన్నవి. అయితే, మనదేశంలోకూడా గవర్న్మెంటుద్వారా గ్రంథాలయాలు నడిపితే బాగుంటుందనే అభిప్రాయం కొందరికొచ్చింది. అందుకు ముందు పుస్తకాలు ఎట్లా నిర్ణయించాలో తెలియదు. ఈ గ్రంథాలయాలకు సంబంధించి గొప్ప సేవ చేసినటువంటివారు - శ్రీ యస్ ఆర్. రంగనాథన్‌గారు. వారిని మనం చాల ఉన్నతంగా గౌరవించాల్సిన అవసరము ఉన్నది. వారు తమకు వచ్చిన డబ్బు దాచిపెట్టి ఆరు లక్షల రూపాయలు ప్రోగుచేసి సైన్సు లైబ్రరీకి ఒక సీటు ఏర్పాటు చేయటానికి మద్రాసు యూనివర్శిటీకి ఇచ్చారు. వారు గ్రంథాలయాలకొరకు సర్వము అర్పణచేసిన మహానుభావులని చెప్పాలి. ఈ గ్రంథాలయ ఉద్యమంలో పాల్గొన్న పెద్దలు - అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగారు, సూరి నరసింహశాస్త్రిగారు, కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు, పాతూరి నాగభూషణంగారు, శ్రీ కస్తూరి కుటుంబరావు, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, శరణు రామస్వామి చౌదరి, శ్రీ సురవరం ప్రతాపరెడ్డి, కోదాటి నారాయణరావు మున్నగు పెద్దలు. కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు లేకపోతే అసలు బహుశా గ్రంథాలయాలే ఉండేవికావు. ఎవరైనా కుర్రవాడు ఉత్తరం వ్రాసి పత్రిక కావాలంటే వెంటనే పత్రిక ఇచ్చేవారు. దాంతో అక్కడ ఒక కల్చరల్ సెంటర్ తయారై పత్రిక వచ్చేది. తర్వాత సంవత్సరంనుండి పుస్తకాలన్నీ తెప్పించుకొనేవారు. ఆవిధంగా మన ఆంధ్రజాతికి ఉన్నతస్థానం వచ్చింది. శ్రీ మాడపాటి హనుమంతరావుగారిలాంటి పెద్దలు ఆంధ్ర పితామహులుగా ఉండి, ఆంధ్రను ఉన్నతికి తీసుకొచ్చారు. ఈ పరిస్థితిలో ఇతర దేశాలలో ఉన్నటువంటి గ్రంధాలయ శాసనములయొక్క ప్రభావము మనమీద పనిచేసింది. గ్రంథాలయాలకు శాసనం ఉండాలా ? అక్కరలేదా అన్న ఆలోచన వచ్చింది. ఈ విషయంలో కొందరిమధ్య భేదాభిప్రాయము వచ్చింది. కొందరు, ప్రజలపైన పన్నులు వేయవలసి వస్తుంది కాబట్టి, శాసనము అక్కరలేదని అన్నారు. కొందరు, "ఆ డబ్బు ప్రజలు ఇచ్చుకొన్న డబ్బు. ఆ డబ్బు గవర్నమెంటుది కాదు; ప్రజల కుపయోగపడే లైబ్రరీలకు ప్రజలనుండి ఎందుకు డబ్బు వసూలు చేయకూడదు ? గ్రంథాలయాలకు ఒక శాసనం ఉండాలి" అని అభిప్రాయ పడ్డారు. శ్రీ పాతూరి నాగభూషణంగారిలాంటి యువకులు నిలబడి యీ ఉద్యమం నడిపారు. ఈ ఉద్యమం ఎట్లాంటిదంటే ఇది ఒక శివాలయం, ఇక్కడేమీ కోరికేది ఉండదు, ఇక్కడ పుస్తకాలుంటాయి. ఎవరినైనా తీసుకుపోయిన పుస్తకాలు ఇమ్మనమంటే "నీ తాతగారి ముల్లె అడిగేందుకు నీ వెవరవు ?" అంటారు రాష్ట్ర ప్రభుత్వం యీ గ్రంథాలయాలవైపు సానుభూతితో చూసేటట్లులేదు. గ్రంథాలయంలో పుస్తకాలు చదివినతర్వాత, మొనగాడై ఆ గ్రంథాలయాన్నే మరచిపోతుంటారు. ఈ జ్యోతియొక్క వెలుగును పొందినవాడు ఆ జ్యోతిని జ్ఞాపకం ఉంచుకోడు అందుకే మనవాళ్ళు ఒక సామెత చెబుతారు. దీపపు సెమ్మెకు క్రింద ఎప్పుడూ నీడయే ఉంటుందని దాంట్లో పనిచేసేవానికి ఆనందం ఒక్కటి-"నా లైబ్రరీలో చదువుకొన్నవాడు పెద్దవాడైనాడు" అనే ఆనందం ఒకటే అతనికి వుంటుంది. ఆవిధంగా అభిప్రాయ భేదాలు వచ్చినప్పుడు పుణ్యమూర్తుల రాజశేఖరంగారుకూడ అపుడు ఉన్నారు. అప్పుడు మద్రాసులో జరిగిన ఒక సమావేశంలో పెద్ద తీవ్రమైన చర్చ వచ్చింది. లైబ్రరీ యాక్టు ఉండాలా, అక్కరలేదా అన్న సమస్యపైన

చాలా తీవ్రమైన చర్చ వచ్చింది. ఆరోజున చివరకు కొట్లాటలు వచ్చేసి, వెళ్ళిపోతామేమోననే అనుమానం కూడ వచ్చింది. నేను, రాజశేఖరంగారు, పాతూరి నాగభూషణంగారు లైబ్రరీ శాసనం ఉండాలని చెప్పాము రెబలియస్ ట్రియో-అని మా ముగ్గురికి పేరు పెట్టారు. మేము లైబ్రరీ శాసనం ఉండాలనేదానిని అంగీకరించాము.

శ్రీ రంగనాధన్‌గారు, ఆంధ్ర గ్రంథాలయోద్యమాన్ని తిట్టారు. తిడితే ఆయనకు వ్యతిరేకంగా నేను పోట్లాడాను. అప్పుడాయన "నేను పొరపాటు చేశాను. గ్రంథాలయోద్యమాన్ని గౌరవిస్తున్నాను" అన్నారు. అందువల్ల గ్రంథాలయోద్యమం పడిపోలేదు ఇప్పటికీకూడా వుంది. బషీర్ అహమ్మద్ మొదలైన వాళ్ళంతా ఒత్తిడిచేసి మద్రాసులో మొట్టమొదట ఈ బిల్లు కృష్ణస్వామి అయ్యంగారు తీసుకువచ్చారు. తక్కిన రాష్ట్రాలుకూడా గ్రంథాలయంబిల్లు పెట్టడమా, వద్దా అని ఆందోళన పడుతున్నాయి. హైదరాబాదులో కూడా ఒక బిల్లు వున్నది. ఆంధ్రలో ఒక బిల్లు వున్నది. ఈ రెండింటిని కలిపి జరాసంధుడి మాదిరిగా కాకుండా ఏకీకరణ కొరకు ప్రత్యేకంగా ఒక బిల్లు తీసుకురావడం చాల సంతోషం. గ్రంథాలయోద్యమం గురించి మనం ఇంత పని చేస్తుంటే ఇండియాప్రభుత్వానికి యివ్వాళ జ్ఞాపకం వచ్చింది. వారు ప్రత్యేకంగా ఒక కమిటీని వేశారు. వారు దేశమంతా తిరిగారు గ్రంథాలయ ఉద్యమం దృష్ట్యా ఆలోచించుకున్నప్పటికీ, శాసనాన్ని పరిపూర్ణంగా అమలుజరపటం దృష్ట్యా ఆలోచించుకున్నప్పటికీ గ్రంథాలయాలకొరకు ప్రజలపై పన్నులు వేసినా చెల్లించుకుంటాం అని చెప్పగలిగే శక్తి చట్టగానే వుంది. అందులోనూ ముఖ్యంగా ఆంధ్రకే వున్నది. అందువల్ల డబ్బు ఇవ్వటానికి మనం ఎప్పుడూ భయపడడంలేదు. ఎంత యివ్వాలి అనేది వేరే విషయం. ఇండియా ప్రభుత్వం వారు 25 సంవత్సరాల ప్రణాళిక ఒకటి వేయాలని నిర్ణయించారు. ఆ 25 సంవత్సరాలలో ఇండియా మొత్తానికి 33 కోట్ల రూపాయలు ఖర్చుచేయాలని, అందులో ఒక్కొక్క రాష్ట్రానికి, 6 కోట్లవరకు ఖర్చుచేయాలని దానికి కావలసిన స్కీమ్స్ అన్నీ తయారుచేశారు గ్రంథాలయాలు అంటే పుస్తకాలు ఊరికే పెట్టడంకాదు ఆ గ్రంథాలయాలను ఎవరు నిర్వహించాలి. ఎట్లా నిర్వహించాలి అనేది ముఖ్యం. అన్నింటికంటే ముఖ్యమైనది డబ్బు ఇవ్వాల్సిన అవసరం లేకుండా ప్రతివాడు పుస్తకాలు చదివే అవకాశం వుండాలి ప్రజల సేవ కొరకు ఉపయోగపడాలనేదే ప్రధానమైన అంశం. అందుకు సంబంధించిన బిల్లు తీసుకువచ్చాము. దీనిలోకూడా కొంత అసమగ్రత వుంది ఈ బిల్లు సంపూర్ణం అని అంగీకరించటానికి వీలులేదు. రంగనాధన్‌గారితోకూడ మాట్లాడాము అన్నారు రంగనాధన్‌గారు చెప్పినదేమిటంటే- నేను చెప్పిన 33 పాయింట్లలో 3 పాయింటులు మాత్రం ఒప్పుకోలేదు. తక్కిన 30 ఒప్పుకున్నారన్నారు. కాని అసలు ముఖ్యమైనవి ఆ మూడు పాయింట్లే అనికూడ చెప్పారు. జిల్లా లైబ్రరీ అథారిటీని జిల్లా విద్యాశాఖాధికారి క్రింద సరాసరి వుంచడంవల్ల వారు ఎక్కువ శ్రద్ధ చూపించలేకపోయారు అందువల్ల పనులు జరగకుండా పోయాయి. తెలంగాణాలో జిల్లాల ప్రకారం ఒక్కొక్కచోట ఒక కేంద్ర లైబ్రరీని ఏర్పరచడం, వాటికి కావలసిన కేంద్రాలను ఏర్పాటుచేయడానికి ప్రయత్నించడం, ఇవన్నీ జరుగుతున్నాయి కాని క్రోడీకరణ జరిగి పని జరగటంలేదు. గ్రంథాలయ శాసనం వచ్చినందువల్ల లైబ్రరీ వ్యవహారాలు అంతా గవర్నమెంట్ డిపార్టుమెంటు అయిపోయి యిదివరకు పుష్టిగా నడిచిన ఉద్యమం బలహీనమై ప్రజాఉద్యమంగా రూపొందదేమోనని నాకు భయంగావుంది. ఎందుకంటే— గవర్నమెంటు సహాయం కోరినప్పుడు అది సంపాదించే ఉపాయం ఆలోచిస్తాము. ఇక్కడనుంచి జరగాల్సిన పనిని మర్చిపోతాము. అందువల్ల గ్రంథాలయ కార్యకర్తలందరికి ఒక మనవి చేస్తున్నాను ఈ శాసనం ఉన్నపనిని సాకల్యం చేయడానికి పనికి వస్తుందని అభిప్రాయపడాలి. ఇదివరకు గ్రంథాలయోద్యమాన్ని ఎంత ఉన్నతంగా నడిపామో అంతకు మూడు రెట్లు ఉన్నతంగా ప్రజాఉద్యమంగా నడిపించాలి. ప్రజలచేత పుస్తకాలు చదివించేటట్లు చేయవలసిన అవసరం ఉన్నది. ఆంధ్రదేశంలో విజ్ఞానస్థాయిని పెంచాలి. ఎక్కువమందిచేత పుస్తకాలు చదివించాలి. ఎక్కువమందికి పుస్తకాలు అందించాలి. తెలుగులో ఒక సామెత వున్నది. "వచ్చేంతవరకు వల్లించాలి, చచ్చేంతవరకు చదవాలి" అని కనుక మనం పుస్తకాలన్నీ వచ్చేంతవరకు వల్లించి చచ్చేంతవరకు చదువుతూవుండి 'సర్వత్రా విద్యార్థి' అనే పద్ధతిలో ఉండడానికి ప్రయత్నించాలి.

# గ్రంథాలయోద్యమము - నవశకము

శ్రీ కోపూరు వెంకటసుబ్బారావు

అధ్యక్షుడు, గ్రామ పంచాయత్, గంగినేనిపాలెం - మెంబరు L. L. A. కృష్ణా.

ఆంధ్ర దేశములో గ్రంథాలయోద్యమము ప్రజా వుద్యమముగా వర్ధిల్లి, అనేక వుద్యమములకు నాందీవచనం పలికింది. ఎంతోమంది దేశ భక్తులు, సాహిత్యాభిలాషులు దీని వ్యాప్తికి తోడ్పడినారు. స్వాతంత్ర్య వుద్యమమునకు బాసటగా నిలచిన యీ వుద్యమమునకు ఆంగ్ల ప్రభుత్వము ఎన్నో అవరోధములు కల్పిస్తూవుండేది. స్వాతంత్ర్య పిపాసువులైన యువకులు వీటి నన్నింటిని అధిగమించి, అకుంఠితమైన కార్యదీక్షతో, దక్షతతో యీ వుద్యమాన్ని గ్రామ, గ్రామాలకు విస్తరింపచేసి, తద్వారా ప్రజలకు దేశభక్తిని ప్రబోధించి, స్వాతంత్ర్య సమరయోధులుగా తయారు చేయటానికి సాధనంగా చేసుకున్నారు. దానివలననే ప్రజల్లో విప్లవాత్మకమైన చైతన్యము తీసుకురాగలిగారు బ్రిటిషు ప్రభుత్వంపై ద్వేష భావముతోవున్న ప్రజలను యీ వుద్యమం ఆకర్షించగలిగింది. ఉద్యమ వ్యాప్తికి మూలకారణం ఇదే. అంతేగాని మేమే యీ వుద్యమానికి మూల పురుషులమని, మా త్యాగమువల్లనే యీ వుద్యమము యింతవరకు రాగలిగినదని యీనాడు చెప్పుకునే కొందరు (అందరూ కాదులెండి) పెద్దల ప్రయోజకత్వంవల్ల మాత్రమేగాదు.

దేశ స్వాతంత్ర్యం అనంతరం, అన్ని ప్రజా వుద్యమముల వలెనే యీ వుద్యమంయొక్క పురోగమనం చెప్పుకోదగినంతగా లేదు. అన్ని వుద్యమ కార్యకర్తలలాగ వీరిలోకూడ అలసత్వం యేర్పడింది. అధికారవాంఛ, వ్యక్తిత్వములు యిందులోగూడ వ్యాపించినందువలన తన కార్యకలాపాలను విరివిగా కొనసాగించలేకపోయినది. అందువలన క్రమంగా ప్రజలకు దూరమైనది. జాతీయోద్యమంలో యిది నిర్వర్తించిన ప్రముఖ పాత్రను, యీ వుద్యమావశ్యకతను గుర్తించి, మన ప్రభుత్వము చట్టముద్వారా దాని అభివృద్ధికి మార్గం చూపింది. అప్పటినుండి క్రమేణా వుద్యమము ప్రభుత్వ సహాయముతో అభివృద్ధిని గాంచినది. ఆంధ్రప్రదేశ్ అవతరణానంతరం సమగ్ర గ్రంథాలయ శాసనం విస్తృత ప్రాతిపదికపై రూపొందించబడి అమలుజరుపబడుచున్నది

పై చట్టంవల్ల యేర్పడిన ప్రతి జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీ కమిటీలు, మునిసిపాలిటీలు, పంచాయితీలు, ప్రయివేటు గ్రంథాలయములు ఎన్నుకొనిన సభ్యులు; ప్రభుత్వము, ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘములచే నామినేటు చేయబడిన

సభ్యులచే యేర్పాటుకాబడియున్నవి. గ్రంథాలయ సంఘం చేసిన పూర్వ సేవా ఫలితంగా ప్రభుత్వం తన స్థాయిని ఒక అనధికార సంస్థకు కల్పించటం చాలా హర్షించదగ్గది. ఇందువలన ప్రయివేటు గ్రంథాలయాలనుండి మరియు అనధికార సంస్థ నామినేషనుద్వారా తన సంస్థ కార్యకర్తలను కమిటి సభ్యులుగా యెన్నుకొనుటకు వీలు కలిగినది. కాని కొందరు ప్రముఖులు దీనిని మభ్యపరచి "గ్రంథాలయ సేవకులు" కమిటి సభ్యులుగా వచ్చే అవకాశము చట్టం కల్పించలేదని వాపోవుచున్నారు. ఇది సత్యదూరము. ఇంతేగాక ప్రభుత్వం నామినేషనులు సక్రమంగా లేవని వుద్యమ సంబంధం లేనివారికి పాక్షికదృష్టితో నామినేటుచేసి తమ ఆశయములను వమ్ముచేసినారని వీరి ఆక్రోశం. అయితే వీరిచేతిలోవున్న అనధికార సంస్థ నామినేషనులు పరిశీలించినచో యీ విమర్శకులకంటె ప్రభుత్వమే సమదృష్టితో నామినేషన్లు చేసియున్నట్లు ఋజువుకాగలదు. ఈ విషయాన్ని నిగ్గదీస్తే వారు ఒప్పుకొనక తప్పదు. దీన్నిబట్టి చూస్తే పవిత్రమైన సంస్థలు స్వార్థానికి, వర్గతత్వాలకు ఆలవాలము లగుచున్నవా అని తోస్తుంది

ప్రస్తుతం ఆంధ్రదేశంలో లోకల్ లైబ్రరీ అధారిటీలచే నడుపబడుచున్న బ్రాంచి గ్రంథాలయాలు, గ్రామ పంచాయితీ, మునిసిపాలిటీలు, ప్రయివేటు కమిటీలు, సహకార సంస్థలచే నడుపబడుచున్న గ్రంథాలయములు వున్నవి. ప్రభుత్వ దృష్టిలో యివి అన్నియు సమానమే. ఇండ్లపన్నుపై వచ్చు లైబ్రరీసెస్సు ఆదాయముతో లోకల్ లైబ్రరీ అధారిటీలు పనిచేయుచున్నవి. పంచాయితీల మునిసిపాలిటీల గ్రంథాలయాలకు వాటి నిధులనుండే ఖర్చుపెట్టుచున్నవి. ప్రయివేటు గ్రంథాలయములకు ప్రభుత్వము ప్రతి సంవత్సరము గ్రాంటురూపమున సహాయము చేయుచున్నది. ప్రయివేటు గ్రంథాలయములు చిన్న చూపు చూడబడుతున్నవనేది కేవలం ప్రచారం నిమిత్తం సాగించే ఆందోళనయే.

అయితే యిన్నిరకములైన గ్రంథాలయముల ఉనికిని కాపాడుతూ, సమిష్టి కార్యక్రమమును రూపొందించుకొని, గ్రంథాలయ సేవను ప్రతి గ్రామమునకు అందించు లక్ష్యముతో పనిచేయవలసి యున్నది. ప్రయివేటు గ్రంథాలయములతో స్థానిక సంస్థలచే నడుపబడు గ్రంథాలయములతో లోకల్ లైబ్రరీ అధారిటీ నిత్యము సంబంధము పెట్టుకొని, గ్రంథాలయములు లేని లోటును తీర్చవలసి యున్నది. ఇందుకు లోకల్ లైబ్రరీ అధారిటీ, తన బ్రాంచీలను విస్తరింపజేయవలసియున్నది. కాని యిందుకు ప్రధానంగా కావలసింది ధనం. గ్రంథాలయాలు విరివిగా నెలకొల్పటానికి యితోధికంగా డబ్బు కేటాయింపు అత్యంతావశ్యకతను, ఉద్యమ ప్రాధాన్యతను ప్రభుత్వం యిప్పటికంటె ఎక్కువగా గుర్తించాలి.

ప్రభుత్వంనుండి వచ్చే అదనపు సహాయం కోసం చూసేకంటే, యీలోపల మనం తక్కువ డబ్బుతో ఎక్కువ ఉద్యమ వ్యాప్తి చేయుటకు ప్రయత్నించాలి. ఇప్పుడు మన రాష్ట్రంలో ప్రతి గ్రామానికి ఒక పంచాయితీ వున్నది. కొన్ని పంచాయితీలకు ఒక సమితి వున్నది. ఈ రెండిటి సహాయంతో దాదాపు చాలా గ్రామములలో పఠన మందిరములు నెలకొల్పబడి పంచాయితీల

ఆధ్వర్యమున పనిచేయుచున్నవి. వాటికి పార్టు టైము గుమాస్తాల నేర్పరచియున్నారు. వాటితో లోకల్ లైబ్రరీ అథారిటీ బ్రాంచీగ్రంథాలయాలు సంబంధములు పెట్టుకొని, గ్రంథములు బదులు యిచ్చు పద్ధతిని ప్రవేశపెట్టి ప్రతి గ్రామమునకు తక్కువ ఖర్చుతో (అనగా సిబ్బంది అవసరము లేకుండా) గ్రంథముల నందజేయవచ్చును. అట్లు చాలా సులువుగా గ్రంథాలయోద్యమ వ్యాప్తిని చేయవచ్చును. పైవిధముగానే ప్రయివేటు గ్రంథాలయములతోగూడ సంబంధములు పెట్టుకొనవచ్చును

ఇది ప్రజాస్వామిక యుగం. ప్రజల అధికార యోగ్యతనుబట్టీ, అవసరాలనుబట్టీ గ్రంథాలయాల స్వరూపంగూడ మారక తప్పదు. విజ్ఞానాన్ని వెదుక్కుంటూ ప్రజలు ఎక్కడెక్కడికో పోవలసిన పనిలేకుండా, విజ్ఞానమే వారిని వెతుకుతూ మారుమూల గ్రామాలకు సైతం పోవలసిన కాలం. ఈ విద్యుక్త ధర్మాన్ననుసరించే గ్రంథాలయాలను గ్రామ గ్రామాన స్థాపించాలని బయలుదేరినదే ఈ వుద్యమం.

నేడు మనం ప్రణాళికా యుగంలో వున్నాము. దేశ పురోభివృద్ధికి సోషలిస్టు సమాజ వ్యవస్థ లక్ష్యంగా మన ప్రణాళికలు వేసుకుంటున్నాము. అందులో ప్రజల సహకారం, పాత్ర లేనిదే యే ప్రణాళికా లేదు. అన్ని వర్గాలవారికి అవకాశాలేర్పడుతున్నవి. పురోగమన దృక్పథంగల యే దేశమైనా యిలాగే ఆలోచిస్తుంది. గ్రంథాలయ కార్యకర్తలమైన మనమంతా విప్లవదృష్టితో కార్యాచరణకు పూనుకొని, సోషలిస్టు సమాజ వ్యవస్థకు గ్రంథాలయోద్యమముద్వారా పుష్టిని చేకూర్చవలసియున్నది.

గ్రంథాలయ చట్టము ఆధారంగా నడిచే యీ వుద్యమంపై అపోహలు కలిగించక, కరుడుగట్టిన పాత - మామూలు మనస్తత్వమును విడనాడి, అసంతృప్తిని వదలి, ప్రస్తుత ప్రపంచ పరిస్థితిని గ్రహించి నవ సమాజ నిర్మాణానికి దోహదం చేసే యీ వుద్యమాన్ని బలపరచండి.

"కుక్కపిల్లా, అగ్గిపుల్లా, కాదేది కవిత కనర్హం" అని శ్రీశ్రీ నుడివినట్లుగా, యీ ప్రజాస్వామిక యుగంలో యే వుద్యమములోనైన, యే సంస్థలోనైనా పనిచేయటానికి అందరికీ అవకాశమూ వుంది - చేయవలసిన అవసరమూవుంది. ఈ నగ్న సత్యాన్ని కాదనక క్రొత్తతరం వారితో కలసి మెలసి వారికి సలహాలను, ఆశీస్సులనిస్తూ, ఈ గ్రంథాలయోద్యమములో నవశకానికి నాందీ ప్రస్తావన చేయవలసిందిగా విన్నవిస్తున్నాను.



గోపరాజు రామచంద్రరావు

నాస్తిక కేంద్రము,
పటమట
విజయవాడ
ది. 29-8-63

మిత్రులు, సూర్యప్రకాశరావుగారికి,

నమస్కారం. ప్రథమ గ్రంథాలయ సదస్సుకు ఆహ్వానం అందింది. కృతజ్ఞతలు.

ఈ రోజులలో ఏ ఉద్యమానికైనా రాజకీయ దృక్పథము లేనిదే దూరము కొనసాగజాలదు. అయితే రాజకీయాలు వేరు, పార్టీ రాజకీయాలు వేరు. రాజకీయాలు అనగా ప్రభుత్వంద్వారా ప్రజలు తమ పనులను నెరవేర్చుకొనుట. ప్రజాస్వామికమునకు అర్థము, ప్రయోజనము యిదే. పార్టీలు వచ్చి ఈ ప్రయోజనమును వ్యర్థపరచుచున్నవి. సక్రమ ప్రజాస్వామిక స్థాపనకు ఈ సదస్సు చర్చలు తోడ్పడునని ఆశించెదను.

గో. రా.

# గ్రంథాలయములు - విజ్ఞాన ప్రచారం

శ్రీ యన్. వీరయ్య చౌదరి, బి. ఎ., బి. యిడి.,
పశ్చిమ కృష్ణాజిల్లా విద్యాశాఖాధికారి, విజయవాడ.



ఈ జిల్లాలో ప్రతి గ్రామాని కొక ఎలిమెంటరీస్కూలు యున్నది. మరియు జిల్లాలో 130 హైస్కూళ్ళు కలవు. వీటిలో గ్రామాలలో వుండే పిల్లలు చదువుకొంటున్నారు. ఈ చదువుకొనేవారంతా ఉద్యోగాలకోసం చదువుట లేదు. కాని కొంతమందిమాత్రం బ్రతుకుతెరువుకోసం ఉద్యోగాల కొరకు వెళ్ళువారుంటారు. స్కూళ్ళలో చదువు మాని వేసిన తరువాత వారు నిరక్షరాస్యులుగా మారే అవకాశముంది. అట్లు మారినయెడల విద్యకొరకు మనం వెచ్చించిన మొత్తం వృధాకావడమేకాక జాతి అజ్ఞానంలో పడిపోయే ప్రమాదం కూడా వున్నది కాబట్టి అట్టివారిలో విజ్ఞానాన్ని కలిగించడానికి, శీలాన్ని పెంపొందించడానికి, పుస్తక పఠనాభిలాషను కలిగించడానికి గ్రంథాలయాలు చాల అవుసరం. ప్రతి గ్రామానికి ఒక ఎలిమెంటరీస్కూలు, ఒక పంచాయితీ, ఒక సహకార సంఘం ఏవిధంగా అవుసరమో అట్లే ఒక గ్రంథాలయంకూడ అవుసరమైయున్నది. అప్పుడే స్కూళ్ళ నుండి చదువుకొనిన వారందరిలో విజ్ఞాన తృష్ణ కలిగించడానికి యీ గ్రంథాలయం ఒక ముఖ్యసాధనంగా ఉపయోగపడుతుంది.

పూర్వకాలంలో గ్రంథ భాండాగారులు సేవాభావంతో నిస్వార్థమైన దృష్టితో పనిచేసినారు. ఆనాడు వారు ఆవిధంగా దేశభక్తితో ప్రజాసేవ చేసినారు. ఈనాడు ప్రభుత్వమువారు ప్రజలనుండి ఇంటిపన్నుపై గ్రంథాలయ సెస్సు విధించుచున్నారు ఆవిధంగా వచ్చు ఆదాయంతో గ్రంథాలయాలు నిర్వహింపబడుచున్నాయి. గ్రంథభాండాగారులకు పూర్తి వేతనాలు లభించుటలేదు. మరి గ్రంథాలయ సేవ చేయడానికి వారి పూర్తి వేతనము యివ్వవలసి వుంటుంది. దానికి మన లోకల్ లైబ్రరీ అథారిటీ ఫండ్సు తగినంతగా లేక పోవచ్చును. అప్పుడు దానికిగల ఫండ్సునుబట్టి సిబ్బంది నియమించపలెను. ప్రతి గ్రామాని కొక గ్రంథాలయం అనే నినాదం ప్రకారం ప్రతి గ్రామానికి ఒక గ్రంథాలయం వుండాలి. మన లోకల్ లైబ్రరీ అథారిటీకి వున్న నిధుల ప్రకారం యిప్పటికి మన జిల్లాలో 46 శాఖా గ్రంథాలయాలు వున్నవి. మొత్తం మన జిల్లాలో 800 గ్రామాలు వున్నవి. మిగిలిన 754 గ్రామాలలోను మన ఆశయం ప్రకారం ఒక్కొక్క గ్రంథాలయం నెలకొల్పవలసి వుంటుంది. దీనిని సాధి చేయానికి ఏదైనా ప్రణాళిక అవసరమైయున్నది.

తంతి తపాలాశాఖవారు గ్రామాలలో బ్రాంచి పోస్టు ఆఫీసులను నిర్వహించి ప్రాథమిక పాఠశాలోపాధ్యాయునకు ప్రతిఫలమును నెలకు కొంత యిచ్చి వారిచేత పాఠశాల పనికి అభ్యంతరంలేకుండా వారిచేత చేయించుకొనుచున్నారు. అదేమాదిరిగా ప్రతి గ్రామములోను ప్రాథమిక పాఠశాలలో వుండు ఒక ఉపాధ్యాయునకు కొంత ప్రతిఫలమిచ్చి, మన బ్రాంచినుంచి కొన్ని పుస్తకాలను వారికి యిచ్చి వారిచేత గ్రంథాలయసేవ ఆ గ్రామవాసులందరకు అందునట్లు చేయవచ్చును. ఈనాడు మనకున్న ఆర్థిక వసతులదృష్ట్యా మన లోకల్ లైబ్రరీ అథారిటీ ఛైర్మన్‌గారైన శ్రీ కలపాల సూర్యప్రకాశరావుగారి ప్రణాళిక ననుసరించి, జిల్లాలో ప్రతి గ్రామానికి గ్రంథాలయసేవ విస్తరింపచేయవచ్చును తదనుగుణంగా ప్రభుత్వమువారి యుత్తర్వులు సాధించుకొని కృషి చేస్తే మన యుద్యమమెంతో ముందుకు త్వరగా సాగిపోవడానికి అవకాశమున్నదని భావిస్తున్నాను.

# గ్రంథాలయాలు - గ్రామ సేవ

యలమంచిలి. వెంకటేశ్వరరావు
విద్యావనం

ఒకప్పుడు దేవాలయాలు మన గ్రామాలలో విజ్ఞానపీఠాలుగా వుండేవి. తెల్లవారుఝామున గుడిగంటలరవళి చెవుల్లో పడితే, కొన్ని శతాబ్దాల భారతీయ సాంస్కృతిక పరంపర అలా కంటిముందు సాక్షాత్కరిస్తూ వుంటుంది. గ్రామం మధ్యలో దేవాలయం మొత్తం గ్రామానికి మేలుకొలుపులు పాడే వైతాళికులవలె పనిచేసేది ఆ దేవాలయం శుచిశుభ్రతలకు నిలయంగా వుండేది. గ్రామస్థుల ఆరోగ్య భాగ్యాలు కాపాడడానికి కావలసిన మూలికలు, పూల మొక్కలు అక్కడ పెరిగేవి. వారి మానసిక, ఆధ్యాత్మిక వికాసం కొరకు అందు భారత, భాగవత, రామాయణాది పురాణ పఠనం జరుగుతూ వుండేది దేవాలయపు భగవదార్చన గ్రామప్రజల మాలిన్యక్షాళనాలకు ఎంతగానో దోహదమిచ్చేది. నిత్యజీవితానికి కావలసిన నైతికదృష్టి, మానవజీవితం సార్థకం కావటానికి అవసరమగు పురుషార్థం మన పూర్వులు ఆ దేవాలయంనుంచే సంపాదించేవారు. వ్యక్తిబాట తప్పకుండా, సంఘదృష్టిని అలవర్చుకోవడానికి దేవాలయం ఒక అకృత్రిమము, సహజమైన సాధనంగా అలరారింది. గ్రామంలోవున్న పాఠశాలతోపాటు దేవాలయం కూడ సాంఘిక కట్టుబాట్లకు, ప్రజల చిత్తశుద్ధికి తోడు పడేది. ఆనాడు ఈనాటివలె, నిర్బంధ ప్రాథమిక విద్య వుండితీరవలెననే తలంపు ప్రజలలో వున్నట్లు ఎక్కడా కనుపించదు. అక్షరాస్యుల సంఖ్య ఇప్పటిదృష్టితో చూస్తే అప్పుడు నగణ్యమనే చెప్పాలి. అయితే సంఘజీవనం ప్రశాంతంగా ఎలా నడిచిపోయింది? ప్రజల నైతికస్థాయి దిగజారకుండా వుండడానికి కారణ మేమిటి? ఈ దేవాలయమే సంఘ జీవితానికి కావలసిన వెలుతురు నిచ్చిందనీ, ప్రజల స్వార్థదృష్టిని, అహంకారాన్ని తగ్గించడానికి ఎంతగానో తోడుపడిందనీ అనిపిస్తుంది. ఈ దేవాలయంలో వెలిగే జ్యోతి మన హృదయాలలో అదృశ్యంగావున్న ఆత్మజ్యోతికి ప్రతిచిహ్నం. ఈ దినం గ్రంథాలయాన్ని గురించి ఆలోచించవలసి వచ్చినప్పుడు నాకంటిముందు సనాతనంగా గ్రామాన్ని సరిదిద్దుతూవచ్చిన ఆ దేవాలయ చిత్రం ప్రత్యక్షమౌతున్నది.

అయితే కాలం మారింది. ఈనాడు ఆ దేవాలయాలు పాతపడిపోయినవి ఇప్పటి దృక్పథానికి. ఇప్పటి అవసరాలకు అనుగుణ్యమైనది గ్రంథాలయమే. అందువల్లనే చిన్నదో, పెద్దదో ఏదోఒక గ్రంథాలయం కాలానుగుణ్యంగా ప్రతి గ్రామంలోనూ కన్పడుతూవుంటుంది. కొంతమంది దాతలు వెనుకటిరోజుల్లో దేవాలయాలకు దానమిచ్చినట్లే ఈ రోజుల్లో గ్రంథాలయ నిర్మాణానికి పూనుకుంటున్నారు. గ్రంథసంచయంలో పోటీలుపడి, ఎక్కువ గ్రంథాలు సేకరించడం, పక్కాబిల్డింగులు ఏర్పరచడం జరుగుతున్నది. గవర్నమెంటుకూడ ఈ ఉద్యమానికి సహకరించ పూనుకోవడం మరింత శుభావహమైన విషయం.

పోతే పక్కాబిల్డింగులు ఏర్పడినంతమాత్రాన, అలమరల నిండా వేలసంఖ్యలో గ్రంథాలు పోగయినందువల్లనే పూర్తి ప్రయోజనం లభించినట్లు కాదు. గ్రంథాలయాల అవసరం ఎంతైనా వున్నది. విజ్ఞానవీధిలో నిర్విరామంగా, నిరపధికంగా ముందుకుసాగిపోతున్న ప్రపంచాన్ని అందుకోవలెనంటే వ్యక్తుల ప్రయత్నాలు సరిపోవు. ఏ ఒక వ్యక్తి అహరహము వెలువడే నూతన గ్రంథాలను సేకరించగలగటం సాధ్యమయ్యేపనికాదు. ఇందుకు సామూహిక ప్రయత్నం కావాలి. అనేకమంది ఉత్సాహము, ఆసక్తి ఈ ఉద్యమానికి

వున్నప్పుడే ఒక సర్వాంగ పూర్ణమైన గ్రంథాలయం గ్రామానికి లభిస్తుంది,

ఇక్కడ ఒక్క సంగతి ఆలోచించవలసి వున్నది. గ్రామీణగ్రంథాలయాలలోవుండే వందలు, వేలాదిపుస్తకాలు, డజన్లకొలదీ వచ్చే దినవార పత్రికలు ఆయాగ్రామీణ ప్రజల మానసిక ఔన్నత్యానికి ఎంతవరకు దోహదమిస్తున్నవి? ప్రపంచంలో ప్రతిక్షణము జరిగే వైజ్ఞానిక పరిశోధనలు, వచ్చే మార్పులు మన గ్రామస్తుల నెంతవరకు కదిలించగలుగుతున్నవి? నిరంతరం పొంగిపొర్లే జ్ఞాన విజ్ఞాన ప్రవాహాలలో పల్లెటూరి రైతు ఎంతవరకు అవగాహన చేయగలుగుతున్నాడు? అనే ప్రశ్నలు నన్ను నిత్యమూ పీడిస్తూ వుంటవి. అనేక గ్రామాలలోవున్న గ్రంథాలయాలు యువకుల చీట్లాటకు నిలయాలుగావుంటే, మరికొన్ని పదిమంది రైతులూ ఒకచోటచేరి బాతాఖానీ చెప్పుతూ, చుట్టముట్టించి తాళ్ళు పేనుకుంటూ కూర్చోవటానికి పబ్లిక్ స్థలాలుగా ఉపయోగపడుతూ వుంటాయి. అంతేకాని, వెనుకటిరోజులో దేవాలయమంటే గ్రామప్రజలకు మనస్సులో వుండే పవిత్రత, స్నిగ్ధత ఈ నాటి గ్రంథాలయాలపట్ల సాధారణ ప్రజలకు ఇంతవరకు కలిగినట్లు అగుపించదు. ఇప్పుడు నడిచే గ్రంథాలయోద్యమం సాధారణ ప్రజానీకానికి సన్నిహితం కావాలన్నా, గ్రామజీవితం ఇంతకంటే పురోగమించాలన్నా ఇందులో కొన్నిమార్పులు తప్పక జరిగితీరాలి.

భారతీయ గ్రామాభివృద్ధిని గురించి నాకు అవసరంగా తోచేమార్పులు రెండు. ఒకటి గ్రంథ సేకరణ. రెండు వాని వినియోగం. గ్రామీణ గ్రంథాలయంలో పెట్టే పుస్తకాలు రైతుల నిత్య సమస్యలను తీర్చి దిద్దేవిగా వుండాలి. వారికి అనాది సిద్ధంగా లభించిన జ్ఞానాన్ని ఆధారంచేసుకుని, నూతనజ్ఞానం వారికి దోహద మీయగలగాలి. కావలసింది గ్రంథశోభకాదు, వారికి ఎక్కువలో ఎక్కువ ప్రయోజనం చేకూరే మార్గం చూపగలగాలి. డిటెక్టివ్ నవలలు, సంఘజీవితాన్ని ప్రతినిత్యమూ తారుమారుచేసే అపరిపక్వమైన ప్రణయగాథలకు అందులో తావు వుండకూడదు. 'పాత-క్రొత్తల మేలు కలయిక' అనే లక్ష్యాన్ని అన్నిరంగాలలోనూ సాధించగలిగే గ్రంథాలను జాగ్రత్తగా సేకరించి భద్రపరచవలసి వుంటుంది. గ్రామప్రజలు చదివే ప్రతి పుస్తకము వారికున్న జీవితానుభవాన్ని మెరుగు పరచేదిగా వుండాలి. మనగ్రామ జీవితాన్ని తలక్రిందులుచేసి, ఏదో ఒక విశేషమైన, మహాద్భుతమైన గ్రామనిర్మాణం చేద్దామనే తలంపుతో ఏ అమెరికామంచో ప్రతిచిన్న విషయాన్ని దిగుమతి చేసుకోవలెనని ఆలోచించడం కంటే అపచారం, ఆత్మహత్య మరియొకటి ఉండబోదు. వ్యవసాయము, పాడి పశువులు, సహకార సంఘాలు, ఆరోగ్యము, పారిశుద్ధ్యము నైతిక, ఆధ్యాత్మిక జీవనములను జీవింపజేసే గ్రంథాలు ప్రజల కంటిముందు పెట్టగలగాలి.

ఇక రెండవది గ్రంథాలయ ప్రయోజన్ని గురించి. నాదృష్టిలో, వున్న డబ్బంతా పుస్తకాలు, అలమరలకొఱకే ఖర్చుపెట్టడంకంటే, ఉత్తమోత్తమమైన గ్రంథాలను ఒక పరిమితిలో సంపాదించి, ఆ గ్రంథాలలోవున్న జ్ఞానాన్ని గ్రామం నలుమూలలకు అందేటట్లు, వారికి ఉపయోగపడేటట్లు చూడడంలో ఒక విశేషమున్నది. అంటే గ్రంథం ప్రతి ఒక్కరిచేతికి అందిరాడమేకాదు అందించవలసింది విజ్ఞానం. జ్ఞానానికి ఆధారం శబ్దం. అక్షరాలు నేర్చుకుని శబ్దం చదవడం ప్రతి ఒక్కరికి సాధ్యపడవచ్చునుకాని, ఆ శబ్దంలో ఇమిడివున్న భావాన్ని సమగ్రరూపంలో అందుకోవడానికి కొంత సాధన, అభ్యాసం కావాలి. శబ్దసాధన చేయించి తద్వారా జ్ఞానమందిరంలో ప్రవేశం కల్పించడానికి చిన్నపిల్లలకు ప్రతి గ్రామంలోను ఒక స్కూలు అంటూ ఏర్పాటుజరుగుతున్నది. కాని వయోజనులకు కూడ ఒక క్రమంలో జ్ఞానాభినివేశం కల్గడానికి ఏర్పాట్లు ఎక్కడా ఇంతవరకు జరుగుట లేదు. ఇందుకు ఉత్తమోత్తమైన సాధనం గ్రంథాలయమే. కాని గ్రంథాలయం ఇప్పుడున్న రూపంలో ప్రజలకు అంతగా ఉపయోగపడదు దీనికి సంపూర్ణప్రయోజనం కలగాలంటే, దేవాలయమునకు ఒక అర్చకుని ఏర్పాటుచేసినట్లే, ప్రతి గ్రంథాలయానికి ఒక ఉత్తమతరగతికి చెందిన ఉపాధ్యాయుడు, అనగా ప్రజల నైతిక, ఆధ్యాత్మికస్థాయిని పెంపొందించుటకు అహరహం

పాటుపడవలెననే సంకల్పశుద్ధి, సేవాభావంకలిగి నిష్ణాతుడైన ఆచార్యుని, కొంచెం ఎక్కువ వ్యయప్రయాసలకు ఓర్చుకు నైనాసరే నియమించాలి. అప్పుడే ఆ గ్రంథాలయంలో వున్న గ్రంథాలకు సద్వినియోగం జరుగుతుంది. అట్టి ఆచార్యుడు పార్టీభేదాలకతీతుడై గ్రామప్రజల చిత్త సంస్కారమే తన జీవిత లక్ష్యంగా పెట్టుకోవాలి. అవసరమైతే పురాణం చెప్పేటట్లు ఉండాలి. ప్రపంచం నలుమూలలజరిగే వివిధ ఘట్టాలను తటస్థభావంతో ప్రజలకు విశదపరచాలి గ్రామ ప్రజలలో తారతమ్యాన్నిబట్టి ఎవరే పుస్తకాలు చదివితే ఉపయోగపడుతుందో ఆలోచించాలి. తనకు నచ్చిన ఏ పార్టీనో సమర్థించక, దూరదృష్టితో, తన నిశితమైన మేధా సంపత్తితో సత్యాన్ని. ప్రపంచగమనాన్ని ప్రజలదృష్టికి తెచ్చి, వారిలో ఒక స్థైర్యం, ఒక ప్రశాంతతను కలుగజేయ ప్రయత్నించాలి. తన ఆచరణ, తన వాక్కు, తన విజ్ఞాన వైదుష్యంవల్ల ఆ గ్రంథాలయం గ్రామమంతటికీ ఒక లైటు హౌసుగా, సర్వార్థఫలప్రదాయిగా, ఒక శుచి సంస్కార కేంద్రంగా ఏర్పడులాగ చూడాలి, ప్రజలు విరివిగా పుస్తకాలు చదవడమే గ్రంథాలయాల లక్ష్యం కాకూడదు చదివినది కొద్దిఅయినా అవి వారికి జీర్ణమై, వారి భౌతిక, ఆధ్యాత్మిక సంస్కారములకు తోడ్పడునట్టిదిగా వుండాలి. వయోజనుల అక్షరాస్యతతో తృప్తిచెందక వారికున్న ప్రాపంచిక అనుభవం, వారిలో మరుగునపడిఉన్న ప్రజ్ఞాప్రాభవములు వికసించి, రాణించులాగ గ్రంథాలయవ్యవస్థ జరగాలి చీకటిలో ఎలక్ట్రిక్ స్విచ్ నొక్కితే అకస్మాత్తుగా క్రొత్త ప్రపంచం కంటిముందుకు వచ్చినట్లవుతుంది అటులనే అక్షరాస్యతవల్ల చదువురాని వారికి ఒక - క్రొత్త- పుస్తక- ప్రపంచంతో సంబంధం ఏర్పడుతుంది. అయినా ఇది బయటి వెలుగు మాత్రమే. ఈ బయటి వెలుతురులో వెళ్ళ కావాలంటే మార్గదర్శిగా, మానవుని సర్వాంగ వికాసమును కాక్షించు ఒక ఆచార్యుడు గ్రంథాలయానికి లభించాలి.

సాధారణంగా ప్రస్తుతం గ్రంథాలయ వ్యవస్థచేసే లైబ్రేరియన్‌లచూపు పుస్తకవర్గీకరణ, పుస్తకాలు క్రమంగా ఇచ్చి పుచ్చుకోవడం, అందంగా పరికరాలు వుండులాగ చూడడం వరకే పరిమితమై ఉంటున్నది. గవర్నమెంటు, వారికిచ్చే తర్ఫీదు, వారివల్ల ఆశించే ఫలితంకూడ బహుశా అదే అయ్యుండవచ్చు. అందులో తప్పులేదు. కాని ఇంతటితో గ్రంథాలయం యొక్క పరమ లక్ష్యం పూర్తికాదు. రొటీన్‌వర్కు పూసిరి సల్పనంతగా వారికి పెడితే, అందువల్ల వచ్చే ప్రయోజనం తక్కువ, ఇతరంగా వచ్చే నష్టం ఎక్కువఉంటుంది. ఒక వేళ ఆ లెక్కలు అవసరమైతే బోధకుడు వేరుగా, గుమాస్తా వేరుగావుంచడం మంచిది.

ఇక్కడ ఇంకొక ప్రశ్న వెన్వెంటనే ఉదయించడం కద్దు— ఇంత డబ్బు ఎక్కడినుంచి వస్తుందా అని. ఈ గ్రంథాలయోద్యమం ప్రభుత్వ వుద్యమంగా వున్నంతకాలం ఖర్చంతా ప్రభుత్వమే భరించవలసివస్తుంది. అందువల్ల వచ్చే ఫలితమూ పూజ్యమే. ప్రభుత్వం నియమించిన పట్టభద్రులు వారి డ్యూటీవారు చేసుకుపోతూవుంటారు. ప్రభుత్వం కూడ, ప్రతి నెలావచ్చే అంకెల గారడీతో తనివి చెంది సంతోషపడడానికి అవకాశమున్నది కాని ఇది మార్గం కాదు. గ్రంథాలయం ప్రజావుద్యమం కావాలి. ప్రజలనిత్య జీవితంలో గ్రంథాలయానికి విడరాని సంబంధం ఏర్పడాలి. దేవాలయం గ్రామస్థులందరిదీని. గ్రంథాలయంకూడ గ్రామ ప్రజల అవసరాలను తీర్చగలిగితే.. వారి విజ్ఞాన వికాసాలకు, వారి మనోరంజనానికి నిలయం కాగల్గితే ప్రజలు దానిని తమదిగా భావించి పెంపొందించ ప్రయత్నిస్తారు. డబ్బుకొరత రానేరాదు. అలా కాలేనప్పుడు, ప్రతి గ్రంథాలయం ఒక విశ్వవిద్యాలయమనీ, అది ఒక విజ్ఞానభాండాగారమనీ పెద్ది వ్యాఖ్యలు చెప్పినందువల్ల వచ్చేలాభం లేదు.

గ్రామంలో అనేకమంది సంగీతజ్ఞులు, కవులు, పౌరాణికులు, పండితులు, అభినయ ప్రవీణులు వుంటారు. వారందరినీ గ్రంథాలయంద్వారా సమీకరించాలి. అప్పుడు వ్యక్తులుగా చాటుపడి వున్న వారందరు గ్రంథాలయం ద్వారా వెలుతురులోకి వచ్చి ఇంకా రాణించడానికి అవకాశం

ఏర్పడుతుంది. అలాగే చుట్టుపక్కల గ్రామాలవారిని కూడ ఆహ్వానించినందువల్ల, గ్రామాల మధ్య విజ్ఞాన ఆదాన ప్రదానాలకు గ్రంథాలయం ఆటపట్టు కాగలగుతుంది. గ్రంథాలయోద్యమమంటే, నా దృష్టిలో ఒక చైతన్యం. మట్టిలోనుంచి మాణిక్యాలను ఏర్చికూర్చడం, గ్రామంఅన్నా, గ్రామప్రజలన్నా మట్టిముద్దలనీ, ఎక్కడినుంచో జ్ఞానం మనం అక్కడికి ప్రసారంచేస్తున్నామనే భావం పోవాలి. బయట వెలుతురుఉంటే, తీసుకోడానికి మనకు అభ్యంతరం లేదు. కాని మనలోపల కూడ వెలుతురు తక్కువ లేదు. అది మేలుకొలుపు కోరుతున్నది. గ్రామంలోని మట్టి బంగారం కావాలి. గ్రామంలోని ప్రజలు విజ్ఞానధనులు కావాలి. ఇందుకు గ్రంథాలయంలోని పుస్తకాలు స్వయంగా తోడుపడలేవు. ఆ గ్రంథాలలోవున్న విజ్ఞానజ్యోతిని వెలిగించి ప్రజలముందుపెట్టే సంస్కారులు అవసరం. అట్టి సంస్కారులను వెతికి సమీకరించడం, అట్టివారితో గ్రంథాలయాలకు సబంధం కల్పించడం గ్రంథాలయాధికారుల పరమ కర్తవ్యం. అప్పుడే గ్రామాలలో వున్న కారుచీకట్లు, పండువెన్నెలలై గ్రామస్థుల్ల జీవితం కళకళలాడుతుంది. గ్రంథాలయం గ్రామసేవలో చరితార్థమౌతుంది.



# అభినందన తీర్మానము

ప్రతిపాదకులు :- శ్రీ జాస్తి వెంకటనరసయ్య

ఆమోదకులు :- శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్య

ఆంధ్రప్రదేశ్‌లో ప్రప్రథమంగా జిల్లా లోకల్ లైబ్రరీ అధారిటీల పక్షాన, ఆదర్శమైన పద్ధతులలో ప్రముఖ గ్రంథాలయ సేవకులను, కార్యకర్తలను, పెద్దలను ఆహ్వానించి యీ రెండు రోజులు చర్చచేసి, "ప్రతి గ్రామానికి గ్రంథాలయం" అనే సూత్రాన్ని ఆచరణరూపములో కూడిన ప్రణాళికాబద్ధంగావున్న ఒక ప్రణాళికను తయారుచేయుటకు నిరంతర కృషిచేసిన కృష్ణాజిల్లా లోకల్ లైబ్రరీ అధారిటీ చైర్మన్ శ్రీ కలపాల సూర్యప్రకాశరావుగారిని యీ సదస్సు హృదయపూర్వకంగా అభినందించు చున్నది.

120

గ్రూప్ : 1

# గ్రంథాలయ సదస్సు సూచనలు

## గ్రంథాలయములు విజ్ఞానవ్యాప్తి

అధ్యక్షులు :- శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారు
బీసెంటురోడ్, విజయవాడ - 2

కన్వీనరు : శ్రీ డి. విజయకుమార్

సభ్యులు : 1. శ్రీ కె. రంగారావు,
2. శ్రీ బి. వెంకటేశ్వరరావు,
3. శ్రీ ఎస్. సత్యనారాయణ,
4. శ్రీ ఎ. భాస్కరరావు,
5. శ్రీ వి. వెంకటేశ్వరరావు.

పైన ఉదహరించిన సభ్యులేగాక ఇతర ప్రముఖు లనేకులు యీ చర్చలలో పాల్గొనిరి.

### గ్రంథాలయముల ధ్యేయము

గ్రంథాలయము గ్రామ విశ్వవిద్యాలయముగా గ్రామీణులకు వారికి సంబంధించిన అన్ని విషయములలోను విజ్ఞానము నందజేసి వారి జీవితములను ఉన్నత స్థాయికి తీసుకొనిపోవుటయు, ఉత్తమ సంస్కారము నలవడ జేయుటయు గ్రంథాలయముల ముఖ్యముగా గ్రామ గ్రంథాలయపు ధ్యేయమై యున్నది.

### గ్రంథ భాండాగారికి బాధ్యత

చదువరుల నాకర్షించి వారి కోర్కెలకనుగుణ్యమైన గ్రంథములను వారికి సులభముగా అందించి, క్రమేణా వారి పఠనాభిలాషను ఉన్నత పథమున గొనిపోవుట గ్రంథభాండాగారి ప్రధాన కర్తవ్యము.

### సలహా సమితులు

గ్రంథాలయాభివృద్ధికి దోహదముచేయు సలహాలనిచ్చుటకును పాఠకుల అభిరుచిని పరిశీలించి

గ్రంథ వర్ణములో తోడ్పడుటకును గ్రంథాలయమునకు ప్రజలకును సన్నిహిత సంబంధము కల్పించుటకును గ్రామ స్థాయిని ప్రతి గ్రంథాలయమునకును ఒక సలహాసంఘముండవలెను.

## గ్రంథాలయాలు - సాంస్కృతిక కార్యకలాపాలు

ప్రజా సామాన్యములో విజ్ఞానవ్యాప్తి జరుగుటకును, వాని సాంస్కృతిక స్థాయిని పెంపొందించుటకును ప్రజలలో పరంపరానుగతముగా వస్తున్న సుసాంప్రదాయాలను ఆధారముగా చేసుకొనుటయవసరము కాబట్టి గ్రామాలలో సంప్రదాయసిద్ధముగా ననుసరిస్తున్న, పండుగలు పబ్బములు గ్రామస్తుల సహకారముతో ఉపన్యాసములు చర్చలు సాంస్కృతిక వైజ్ఞానిక కార్యకలాపాలు ఏర్పాటు చేయవలెను. వీటితోపాటు జాతీయైక్యతకు తోడ్పడు ఇతర వుత్సవములుకూడ జరుపవలెను.

## నిరక్షరాస్యులకు పుస్తకములు చదివి వినిపించుట

చదువు రానివారికి వారి పఠనాభిలాషను గమనించి వారికి పుస్తకములను చదివి వినిపించి వారి సంస్కార స్థాయి ఉన్నతికి కొనిపోవుటకు గ్రంథభాండాగారికి తోడ్పడవలెను. ప్రజల జీవిత సమస్యలను నిర్వర్తించుకొనుటలోను వృత్తి విజ్ఞానము పెంపొందించుకొనుటను గ్రామీణులకు కావలసిన సలహాలను గ్రంథభాండాగారిచ్చుచుండవలెను. గ్రామ పంచాయితీ సహకారముతో నిరక్షరాస్యతను నిర్మూలించుటకు గ్రంథ భాండాగారి ప్రయత్నించవలెను.

## వార్షికోత్సవాలు - కార్యక్రమము

గ్రామీణులలో పఠనాభిలాషను పెంపొందించుటకును, గ్రామీణుల దృష్టిని గ్రంథాలయము వైపు మరల్చుటకును వారి పఠనాభిలాషను పెంపొందించుటకును ప్రతి గ్రంథాలయమునకును వార్షికోత్సవ మవసరము. వార్షికోత్సవములో కార్యక్రమము ఈ దిగువ పద్ధతులపై ఏర్పడుట అనుచితము.

(ఎ) సంవత్సర మంతయును గ్రంథాలయము నిర్వర్తించిన కార్యక్రమ మంతయు సాధించి అభివృద్ధి ప్రజల దృష్టిని ఆకర్షించునట్లు ఏర్పాటు చేయవలెను.

(బి) గ్రంథాలయములోగల పుస్తక సంచయమును గ్రామస్తుల అభివృద్ధికి ఎట్లు ఉపయోగపడినదో, ఇంకనూ ఉపయోగపడుటకు సావకాశము ఎట్లున్నదో ఈ వార్షికోత్సవ సందర్భమున గ్రామస్తులకు తెలుపవలెను.

(సి) సంవత్సర మంతటిలోను హెచ్చు గ్రంథములను చదివినవారిని, ఉత్తమ గ్రంథము

లను చదివినవారిని, గ్రంథాలయాభివృద్ధికి మిక్కిలిగా తోడ్పడినవారిని పేర్కొని తద్వారా గ్రామీణు లలో స్ఫూర్తిని కల్గించుటకు ప్రయత్నించవలెను.

(డి) వార్షికోత్సవము గ్రామీణుల సమిష్టి పర్వదినమును భావనను కలిగించుటకు అనుగుణ్యమైన సమిష్టి కార్యక్రమమును రూపొందించవలెను. ముఖ్యముగా బాలబాలికలకు గ్రంథాలయోద్యమమునెడ ఉత్సాహము కలిగించు ఏర్పాట్లు చేయవలెను. ఉదా: వివిధ రకముల పోటీలను ఏర్పరచి బహుమతులను వార్షికోత్సవమునాడు పంచవలెను.

## గ్రంథాలయములు ప్రణాళికా నిర్వహణలో చేయగల తోడ్పాటు

ప్రణాళికా కార్యకలాపాలకు సంబంధించిన భోగట్టాను గ్రంథాలయములు తెప్పించి గ్రామస్థులకు అందించవలెను. ప్రతి గ్రామ గ్రంథాలయము ఆ గ్రామమువారికి సమాచార కేంద్రముగా వుపయోగపడవలెను. ప్రభుత్వమువారు మధ్య అంతరాలు లేకుండా వేరుగా గ్రంథాలయాలకు ప్రణాళికా ఉద్యమమునకు సాహిత్యమును అందించునట్లు చూడవలెను ప్రణాళికా ప్రచారములకు ఉపయోగించు అన్ని దృశ్య శ్రవ్య సాధనములను గ్రంథాలయములద్వారా ప్రజలకు అందించుటకు ప్రభుత్వమును కోరవలెను

గ్రంథాలయముగల గ్రామములలోను, పరిసర గ్రామములలోను ప్రణాళికా కార్యక్రమాలు ఏవిధముగా అమలుజరిగినదీన్నీ ఇంకనూ ఆ గ్రామముయొక్కయు. పరిసర గ్రామములయొక్కయూ అభివృద్ధికి ఏవిధంగా దోహదంచేయు అవకాశం వున్నదన్నీ వివరించగల పోస్టర్లను వ్రాసి గ్రంథాలయములో అంటించవలెను. అందుకు ప్రజలు నిర్వర్తించవలసిన బాధ్యతలనుకూడా వివరించవలెను.

## పాఠకులను ఆకర్షించుటకు గ్రంథభాండాగారి దృష్టిలో వుంచుకొనవలసిన విషయములు

(ఎ) 1. గ్రంథ భాండాగారి తానుత్సాహవంతుడై, ఇతరుల నుత్సాహపరచుచూ యుండవలెను. 2. ఇతరులఎడ సహనంతో మెలగవలెను. 3. గ్రామమునందు, సంఘ కార్యకలాపాల్లో గ్రంథాలయాధికారి ఉచితపాత్ర నిర్వహించవలెను. 4. పుస్తకముల కొరకు పాఠకులు వచ్చినప్పుడు పుస్తకము లిచ్చుట వాయిదా వేయరాదు. 5. పాఠకుడు కోరిన గ్రంథము లేనియెడల ఆ గ్రంథమునకు సన్నిహితమైన మరియొకదానిని సూచించవలెను. 6. పాఠకులకు కావలసిన గ్రంథములు లేనియెడల సమీప గ్రంథాలయమునుండియు, కేంద్ర గ్రంథాలయము నుండియు తెప్పించి ఇవ్వవలెను. గ్రామస్థులలో ముఖ్యంగా చదువరులలో గ్రంథ భాండాగారి ఆదరాభిమానములతో మెలగవలెను.

తనకంటె వయస్సులో పెద్దలైనవారిఎడల వారు నిరక్షరాస్యులైనను వినయంగా మెలగవలెను.

(బి) చదువరులలో గల బిడియమును పోగొట్టి వారిలో ఉత్సాహం కలుగునట్లు ప్రవర్తించవలెను.

(సి) చదువరుల రుచులను, కోర్కెలను గ్రహించుచు క్రమంగా వారి మనస్తత్వమును గ్రంథభాండాగారి అర్థముచేసికొనుటకు ప్రయత్నించవలెను. వారి అభిరుచులకు అనుగుణ్యామైన పుస్తకాలను అందిస్తూ క్రమేణా వారి అభిరుచిని ఉన్నత స్థాయికి తీసుకొనిపోవలెను.

డి. చదువరి ప్రశాంతముగా చదువుకొనుటకు గ్రంథాలయములో తగు ఏర్పాట్లు చేయవలెను.

పాఠకుల దృష్టి నాకర్షించు పటములు, చార్టులు, ప్రదర్శనములు ఏర్పాటు చేయవలెను.

(సి) నిర్ణీత సమయములందు రేడియోలద్వారా వార్తలను ఇతర ముఖ్యవిషయములను వినిపించునట్లు చేయవలెను. ప్రతి గ్రంథాలయములోను ఆ గ్రామము, తాలూకా, జిల్లా, రాష్ట్రము, దేశములకు సంబంధించిన పటము లుండవలెను. ప్రతి గ్రంథాలయములోను ముఖ్యమైన దేశనాయకుల పటముల నుంచవలెను.

ప్రతి గ్రంథాలయములోను అ గ్రామ చరిత్రను వ్రాయించి పెట్టవలెను. ప్రతి సంవత్సరము ఆ గ్రామ చరిత్రయందు జరిగిన ముఖ్యఘట్టములను అందులో వ్రాసిపెట్టవలెను. ఇట్టి లిఖిత పుస్తకమును ఆచూకీపుస్తకములలో చేర్చవలెను ఆ గ్రామాభివృద్ధికి తోడ్పడిన వ్యక్తుల జీవితములను అందులో పొందుపర్చవలెను. అట్లే పేరుప్రతిష్ఠల నార్జించి గొప్పవారైన గ్రామస్థుల జీవితములను ఆ పుస్తకములో వ్రాయించవలెను.

## చదువరులను ఆకర్షించుటకు పుస్తకముల డిపాజిట్ పద్ధతిని ఈ క్రింది విధముగా మార్పు చేయవలెను.

డిపాజిట్టు మొదట ఒక్కరూపాయితో ప్రారంభించవలెను. ఒక క్రమపద్ధతిని దానిని పెంచుతూ ఐదు రూపాయలవరకు ఆ డిపాజిట్టును హెచ్చించవలెను. 5/- రూపాయల డిపాజిట్టు వచ్చువరకూ డిపాజిటు ధనములకు మించిన విలువగల పుస్తకముల నీయరాదు.



గ్రూప్: 2

## గ్రంథాలయాల సేవ — స్త్రీలు, పిల్లలు

అధ్యక్షురాలు: శ్రీమతి ఈడ్పుగంటి బాపమ్మగారు
మహిళా సంఘం, గుడివాడ

కన్వీనరు: శ్రీ తోడేటి లక్ష్మణరావు

సభ్యులు: శ్రీమతి పి రత్నమాల
,, ఎ. కల్పన
,, జె. ఇందిర
,, యన్. నాగేశ్వరమ్మ
శ్రీ జె. రామచంద్రరావు
శ్రీ పి సాంబశివరావు
శ్రీ కె వెంకటేశ్వరరావు
శ్రీ జి. వి. వి. రాఘవస్వామి

1) సాధ్యమైనంతవరకు ప్రతి గ్రంథాలయములోను పిల్లల విభాగము నొకదానిని నెలకొల్ప వలెను. వారిని ఆకర్షించే బొమ్మలు, చార్టులు, పటాలు గ్రంథాలయములో పెట్టవలెను. పిల్లలచేత పేపర్ కటింగులు, ఆల్బములు తయారుచేయించవలెను. పిల్లలలో విజ్ఞానమును పెంపొందించు పుస్తకములను, నీతికథలను, హాస్యకథలను, బొమ్మల పుస్తలములను, పురాణ గాథలను అందించవలెను. పిల్లల పుస్తకములు తేలిక భాషలోను, పెద్ద అచ్చులోను, సచిత్రములుగా నుండునట్లు చూడవలెను.

2) డిటెక్టివ్ నవలలును, శృంగార సాహిత్యాన్ని. సినిమా వాజ్ఞయాన్ని, మానసిక వికాసము నకు దోహదము చేయని పుస్తకములను చదువుటను నిరుత్సాహపర్చవలెను.

3) బాలబాలికలలో మానసిక వికాసము కలుగు ఆటలు, పాటలు మొదలైన వినోద కార్యక్రమాలను జరిగించుట అవుసరము

4) బాలశాఖలకు అనుకూలమైన ఫర్నిచరును ప్రతి గ్రంథాలయములకు సప్లయి చేయవలెను.

### మహిళలు

ఆరోగ్యమునకు, ముఖ్యంగా ప్రసూతి, శిశుపోషణకు సంబంధించిన పుస్తకములను, గృహ నిర్వహణ, గృహాలంకారణకు సంబంధించిన పుస్తకములను, గృహ పరిశ్రమలను అలవరచుకొను పుస్తకములను, పురాణ గాథలు. ధార్మిక గ్రంథములు స్త్రీలు చదువునట్లు ప్రోత్సహించవలెను. స్త్రీలకు

అభిరుచిని, పఠనాభిలాషను పెంపొందించు సరళమైన భాషలోగల గ్రంథములను ప్రతి గ్రంథాలయ ములో నుంచవలెను.

మహిళావిభాగమున గ్రంథాలయములలో సరస్వతి పటమును విధిగానుంచవలెను.

2 సంచార గ్రంథాలయములద్వారా మహిళలకు ఇళ్ళకు పుస్తకముల నందించవలెను.

3. మహిళావిభాగమున్న గ్రంథాలయములలో వినోద కార్యక్రమములు, పురాణశ్రవణము అప్పుడప్పుడు ఏర్పాటుచేయుచుండవలెను. ప్రత్యేక సందర్భములలో వ్యాసరచన పోటీలను కూడా యేర్పాటుచేయుచుండవచ్చును.

గ్రూప్ :- 3.

ప్రజలకు గ్రంథాలయాభిరుచిని పెంపొందించుటకు అవలంబించవలసిన సాధనలు :-

అధ్యక్షులు :- శ్రీ నాగులపల్లి శీతారామయ్య గారు, ముదునూరు, కృష్ణాజిల్లా.
కన్వీనరు :- శ్రీ బి ఎ రంగారావు
సభ్యులు :- శ్రీ కె వసంతకుమార్
శ్రీ యస్ పాండురంగారావు
శ్రీ హెచ్. కృష్ణమూర్తి
శ్రీ వై. వెంకటేశ్వరరావు.

ఇతోధికంగా పాఠకులను ఆకర్షించుటకు గ్రంథాలయాలను చేయవలసిన ఏర్పాట్లు :

ఎ. అవకాశమున్నచోటెల్ల గ్రంథాలయభవనమున ఎలక్ట్రిక్ దీపాలు, పంకాలు ఏర్పాటుచేయవలెను.

బి. పాఠకులు సుఖముగాను సౌకర్యముగాను కూర్చొని చదువుకొనుటకు అనువగు ఫర్నీచర్‌ను ప్రతి గ్రంథాలయమున ఏర్పాటు చేయవలెను.

సి అప్పుడప్పుడు పాఠకులతో పుస్తకగోష్ఠిని ఏర్పాటుచేయవలెను. వార్తలలోని ముఖ్యవిషయములు ప్రతి దినము నల్లబల్లపై వ్రాసి గ్రంథాలయము వెలుపల నుంచవలెను.

డి. స్థానిక పాఠకుల అభిరుచిని గమనించి గ్రంథాలయమునకు విలువైన పుస్తకములు కూడా సరఫరా చేయవలెను.

ఇ. ప్రతి గ్రంథాలయమునకు పత్రికలకు కనీసము సం॥ 1కి రు 500 లు కేటాయించవలెను.

యఫ్. ప్రతి నెలలోను వచ్చిన క్రొత్తపుస్తకముల అట్టలను ఒక బోర్డుపైయుంచి ప్రదర్శించు ఏర్పాటుచేయవలెను.

జి. పుస్తకములన్నియు క్రొత్తగా కొనగానే బైండు చేయించవలెను. బైండుచేసిన పుస్తకములను వెంటనే పంపవలెను.

హెచ్. లోకల్ లైబ్రరీ అథారిటీలో బైండింగు శాఖను నెలకొల్పవలెను.

## వయోజన విద్య

అవకాశమున్నచోటల్లా పంచాయతీబోర్డు సహకారముతో స్థానికసేవకుల సహాయముతో గ్రంథాలయమున కనుబంధముగా వయోజన విద్యాకేంద్రమును నెలకొల్పవలెను.

ఎ. అక్షరాశ్యతాప్రచారముతోపాటు ఇతర శ్రవ్య, దృశ్యప్రదర్శనములద్వారా కూడ వయోజనవిద్యాప్రచారానికి ఏర్పాటుచేయవచ్చును. అమెరికన్ సాంస్కృతిక కేంద్రము, ప్రభుత్వ సమాచారశాఖ మొదలైన సంస్థలనుండి సహకారము పొంది ఫిల్ముల ప్రదర్శనము ఏర్పాటుచేయవచ్చును.

బి. ఇతర సాంస్కృతిక ప్రదర్శనములను ఏర్పాటుచేయవచ్చును. స్థానికముగా ప్రచారములోనున్న భజన. కోలాటము. వీధిభాగోతము మొదలగువానిని ఉపయోగించుకొనవచ్చును నిపుణులచే ఉపన్యాసములను ఏర్పాటుచేయించు కొనవచ్చును. వార్షికోత్సవసమయములలో వ్యాసరచన. వక్తృత్వపోటీలు వైజ్ఞానికకార్యక్రమాలు ఏర్పాటుచేయవచ్చును.

## గ్రంథాలయాలు – పరస్పర సహకారము

శాఖా గ్రంథాలయాలకు పరస్పరమున్ను శాఖా గ్రంథాలయాలకు కేంద్ర గ్రంథాలయములనుండిన్నీ. కేంద్రగ్రంథాలయానికి స్టేట్ కేంద్ర గ్రంథాలయమునుండిన్నీ పుస్తకములను అరువు ఇచ్చి పుచ్చుకొను పద్ధతిని ఏర్పాటు చేయవచ్చును. (ఇంటర్ లైబ్రరీ లోన్)

బి. ధరావత్తు పైకమును సభ్యులు కోరితే మరొక శాఖా గ్రంథాలయమునకు బదిలీచేయు అవకాశమును కల్పించవలెను.

## సంచార గ్రంథాలయములు

సంచార గ్రంథాలయాలద్వారా పరిసర గ్రామాలకు పుస్తకములు తీసుకొనివెళ్ళి అందించుటకు ప్రత్యేకముగా ఒక అటెండరును శాఖా గ్రంథాలయాలలో నియమించ వలెను.

బి. ఒక సైకిలు, ట్రంకుపెట్టె, రైన్‌కోటు అటెండరుకు సరఫరా చేయవలెను.

సి. పంచాయతీబోర్డువారి సహకారముపొందుచూ అటెండరు స్వయముగా గృహములకువెళ్లి ధరావత్తు పద్ధతి పైన పుస్తకముల నందించవలెను.

డి ప్రతి మునిసిపల్ పట్టణములో విధిగాను. రహదారి సౌకర్యములుగల గ్రామములమధ్య యున్న శాఖా గ్రంథాలయములలోను సంచార గ్రంథాలయములు ప్రవేశపెట్టవలెను.

గ్రూప్ :- 4.

## గ్రంథాలయాలు – పుస్తకవర్ణము (Book Selection)

అధ్యక్షులు :- శ్రీ జాస్తి వెంకటనరసయ్యగారు, చిలుకలూరిపేట, గుంటూరుజిల్లా.

కన్వీనర్ :- శ్రీ డి. రాజారావుగారు

సభ్యులు :- శ్రీ షేక్ ఖాసిం

శ్రీ బి. ఆర్. తులసీరావు

శ్రీ పి. డి. ప్రసాదరావు

శ్రీ పి. వి. శీతాపతిరావు

శ్రీ మహ్మద్ జాఫర్

శ్రీ కె. వి. నరసింహారావు

శ్రీ కె. యస్. ఆర్. కోటేశ్వరరావు.

1. ప్రతి గ్రంథాలయములోను గ్రంథ భాండాగారమును కొంతమంది మేధావుల సహకారముచే పుస్తకములను ఎన్నికచేసి లోకల్ లైబ్రరీ అథారిటీకి పంపవలెను

ఈపనిని సలహాసంఘము ఏర్పాటైతే అట్టి సంఘమునకు అప్పచెప్పవచ్చును. లేక ప్రత్యేక కమిటీనిగాని ఏర్పాటుచేయవచ్చును. ఇట్టి సంఘమునకు, లేక కమిటీకి గ్రంథాలయ భాండాగారానికి కన్వీనర్‌గాయుండవలెను.

2. పుస్తకము కొనుగోలు కనీసము మూడునెలల కొకసారైనా ఏర్పాటుకావలెను. వీలుంటే ఈ మధ్యనే ఎప్పుడు అవసరమైతే అప్పుడు తెప్పించే ఏర్పాటుచేయుట మంచిది.

3. శాశ్వతపుస్తకనిధిని (పరమనెంట్ బుక్ ఫండ్) ఏర్పాటుచేయవలెను.

4. పత్రిక సలహాసంఘము వారి సంప్రతింపులతో తెప్పించవలెను. పత్రికలను తెప్పించుట శాఖా గ్రంథాలయాధికారిగారి ద్వారానే జరుగవలెను. చందాలనుకూడా శాఖా గ్రంథ భాండాగారులద్వారా చెల్లించు ఏర్పాటుచేయవచ్చును. అవసరమైనచో దీని తనిఖీకి ఏర్పాటుచేయవలెను.

గ్రూప్ :- 5.

## పోయిన పుస్తకములను రాబట్టు పద్ధతులు :

అధ్యక్షులు :- శ్రీ

కన్వీనర్ :- శ్రీ వి. సత్యనారాయణ

సభ్యులు :- శ్రీ కె. వి. రత్తయ్య

శ్రీ నాంచారయ్య

శ్రీ వి జితేంద్రనాథ్

శ్రీ యస్. రామారావు

శ్రీ బి. తులసీదాస్

శ్రీ కె. సత్యనారాయణ

శ్రీ వి. ఘంటయ్య

### పుస్తకములు సరిచూచుట

పుస్తకములను గ్రంథభాండాగార అటెండర్ల సహాయముతో సంవత్సరమున కొకతూరి సరిచూడవలెను. యాక్సెషన్ రిజిస్టర్ ప్రకారము కాగితముపై వెయ్యివరకు సంఖ్యలువేసుకొని, పుస్తకములను సరిచూచుకొని ఉన్న పుస్తకముల నెంబర్లను గుర్తుపెట్టుకొనవలెను. కాని యాక్సెషన్ రిజిష్టరులో పెట్టరాదు.

గ్రంథాలయ భవనమున భద్రత కొరకై ఏర్పాట్లుచేసుకొనవలెను. ఉదా:- కిటికీలకు ఇనుపగడియలు వేయించుట, రాకపోకలు ఒకే ద్వారమున ఏర్పరచుట మొదలైనవి

బి 5000 లకు పైగా పుస్తకములు ఉన్నట్టిన్నీ సగటున దినము ఒకటికి 150 చదువరులు వచ్చునట్టిన్నీ గ్రంథాలయములందు అదనముగా మరొక అటెండరును నియమించవలెను.

సి. పుస్తకములు పోవుచున్నందువల్ల కలిగేనష్టమును పాఠకులకు వివరించుట.

డి. ప్రతి వెయ్యి పుస్తకములు ఇచ్చినప్పుడు 3 గ్రంథములు చొ॥న పోయినవాటి ఖరీదును (రైట్ ఆఫ్) రద్దు చేయవలెను. ఇంతకు మించి పుస్తకములు పోయినచో అట్టి పుస్తకముల నిఖరమైన విలువలో ఆరవవంతు క్రింద భాండాగారి వద్దనుండి వసూలు చేయవచ్చును.

ఇ. అన్ని గ్రంథాలయములలోను రిజిష్టర్లు ఒకే విధమైన నమూనాను అనుసరించవలెను.

యఫ్. లోకల్ లైబ్రరీ అథారిటీ వారి పంపిన నమూనాలు సరిగాయున్నవని అంగీకరించుట జరిగినది.

### డిపాజిట్లు :-

జి. గ్రూపు 2 లోని చివరి సిఫారసు ప్రకారము డిపాజిట్లు వసూలుచేయవలెను. సభ్యులతోపాటు హామీదారు ఉండుట అవసరము

డిపాజిట్లద్వారా వసూలైన మొత్తము స్థానిక సేవింగ్స్ బ్యాంక్ ఎకౌంటులో ఉంచవలెను. శాఖా గ్రంథాలయ భాండాగారి ఈ ఎకౌంటును ఆపరేట్ చేయవలెను.

పుస్తకములకు ఏవిధమైన హానికలిగిన పుస్తకము ధర బైండింగు ఖర్చులు కలిపి కాని అంతకు మించకుండా గ్రంథాలయాధికారి నిర్ణయించిన మొత్తమునుగాని సభ్యుడు చెల్లించవలెను.

గ్రూపు :- 6.

## సిబ్బంది సమస్యలు

అధ్యక్షులు :- శ్రీ జి నాగేశ్వరరావు, జగ్గయ్యపేట, కృష్ణాజిల్లా.
కన్వీనర్ :- శ్రీ ఎ. వెంకటేశ్వరరావు
సభ్యులు :- శ్రీ యం. కోటేశ్వరరావు
శ్రీ ఎం. రామారావు
శ్రీ ఎ. రామమూర్తి
శ్రీ జి. వి. సూర్యనారాయణ
శ్రీ బ్రహ్మానందచౌదరి

ఈ గ్రూపు సమావేశమై సిబ్బందికి జరుగవలసిన సౌకర్యముల గురించి కొన్ని తీర్మానములను చేసిరి. విస్తృత సమావేశములో ఈ సిఫార్సులను సిబ్బంది ప్రత్యేకముగా ఆలోచించి లోకల్ లైబ్రరీ అథారిటీకి నివేదించవలెనని నిర్ణయించుట జరిగినది. అందువల్ల వివరములు ఇందులో ఇవ్వబడలేదు.



గ్రూపు :- 7.

## పుస్తక వర్గీకరణము —— కేటాలాగింగు

అధ్యక్షులు :- శ్రీ పాతూరి నాగభూషణంగారు, పటమట పోస్టు, కృష్ణాజిల్లా.
కన్వీనర్ :- శ్రీ టి. వి. నరసింహారావు
సభ్యులు :- శ్రీ కె. వి. పి. కృష్ణవిఠల్
శ్రీ కె. విఠల్‌శాస్త్రి
శ్రీ వి. వెంకటప్పయ్య

లోకల్ లైబ్రరీ అథారిటీ నిర్ణయించు అన్ని గ్రంథాలయాలలోను అమెరికన్ అసోసియేషన్ కోడ్ ఆధారపరచుకొని నిఘంటు స్వరూపములో కేటాలాగులను కార్డులపై తయారుచేయవలెను.

బి. ఇంగ్లీషుపుస్తకాలకు కార్డులను టైపుచేయవలెను.

సి. తెలుగుపుస్తకాలకు టైపు ఏర్పాటులేనిచో దస్తూరి బాగా వ్రాయనేర్చినవారిలో కార్డులను విడివిడి అక్షరములలో వ్రాయించవలెను.

2. పుస్తకాల వర్గీకరణము. జాబితాల వ్రాతపనులను త్వరగా జరుగుటకుగాను బందరు, విజయవాడ, గుడివాడలోని ఒకటవగ్రేడు లైబ్రరీయన్లు కలసి నిర్వహించవలెను.

3. గ్రంథాలయములలో ప్రజాదరణ ఎక్కువగా నుండి సాహిత్య గ్రంథములను ఎన్నికచేసి వాటి జాబితా నొక దానిని జిల్లా స్థాయిపైన తయారుచేసి, అచ్చువేసి స్వల్పమైన వెలను నిర్ణయించి పాఠకులకు అమ్మవచ్చును.

4. దశాంశవర్గీకరణలోని లోపాలవిషయమై చాల పరిశీలింప అవసరమున్నదని దీనిని రాష్ట్ర వ్యాప్తముగా ప్రచురించి ఆంధ్రప్రదేశ గ్రంథాలయమహాసభ సాంకేతికశాఖా సమావేశములో చర్చించుట ఉచితమని భావించడమైనది.



గ్రూపు 8.

## గ్రంథాలయాలు - పంచాయతీరాజ్ - సహకారము

అధ్యక్షులు :- శ్రీ కోపూరు వెంకటసుబ్బారావు, గంగివేనిపాలెం, కృష్ణాజిల్లా.

కన్వీనర్ : శ్రీ వి. వెంకటేశ్వరరావు

సభ్యులు : శ్రీ కె. సూర్యప్రకాశ రావు
శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య
శ్రీ టి. వి. ఎస్. చలపతిరావు
శ్రీ పేట బాపయ్య
శ్రీ కె. భావన్నారాయణ
శ్రీ యం. శేషయ్య
శ్రీ వి. నాగభూషణం
శ్రీ గురజాడ వెంకటేశ్వరరావు
శ్రీ శరణు రామస్వామిచౌదరిగారు.

1. ప్రతి పంచాయితీ సమితి కేంద్రములో కనీసము ఒక గ్రంథాలయమును స్థాపించి దాని కనుబంధముగా పరిసర గ్రామములలో డెలివరీ స్టేషన్లుపెట్టిన్నీ, స్థానికముగా పంచాయతీ గ్రంథాలయముంటే దాని ద్వారా సుపుస్తకములు అందించవలెను. ఈ విధముగా ప్రతిగ్రామమునకు ఒక గ్రంథాలయము అను ఆశయము నెరవేర్చవచ్చును.

మిగిలిన వివరములకు శ్రీ సూర్యప్రకాశరావుగారు ఇచ్చిన స్కీమును అంగీకరించడమైనది.

ప్రతి పంచాయతీ సమితి కేంద్రమునందు ఏర్పాటుచేయు శాఖాగ్రంథాలయములో సమితి సమాచార కేంద్రమును జతపర్చి పరస్పర సహకారముతో నడపవలెను.

పంచాయితీలు నెలకొల్పిన పఠనమందిరములకు దినపత్రికలను వారపత్రికలను పంచాయతీలే తెప్పించు ఏర్పాటుతో, మాసపత్రికలను గ్రంథములను లోకల్ లైబ్రరీ అథారిటీకి అందించవలెను.

## మునిసిపల్ ప్రాంతాలు :-

మునిసిపల్ ప్రాంతాలలో మున్సిపాలిటీ చక్కగా గ్రంథాలయములను నిర్వహించిన చోట్ల లోకల్ లైబ్రరీ అథారిటీ గ్రంథాలయములను నెలకొల్పక వారి పుస్తకములను అరువిచ్చు పద్ధతిని ప్రవేశపెట్టవలెను.

1. మున్సిపాలిటీ భవనము ఇచ్చి సిబ్బంది ఖర్చును భరించుటకు అంగీకరించినచో పుస్తకములు, పత్రికలు లోకల్ లైబ్రరీ అథారిటీ సప్లయి చేయవచ్చును.

2. పట్టణములలో వ్యాన్‌ద్వారా సంచార గ్రంథాలయమును నడపవచ్చును. అందువల్ల అదనంగా గ్రంథాలయములను స్థాపించనవసరములేకుండా పట్టణమంతయును పుస్తకములను పంపవచ్చును.

3. మహిళాసంఘములు ప్రత్యేకముగా తమకార్యాలయములో అవసరమైన ఏర్పాటుచేసుకొనిన పక్షమున సంచార గ్రంథాలయముద్వారా స్త్రీలకు ప్రత్యేకముగా పుస్తకములను అందించే ఏర్పాటు చేయవచ్చును.

4. విజయవాడ పట్టణములో ప్రత్యేకముగా బాలల గ్రంథాలయము నెలకొల్పి అందులో సుశిక్షితురాలైన ఒక గ్రంథభాండాగారిణిని నియమించవలెను. బాలులను ఆకర్షించు ప్రత్యేక ఏర్పాట్లను చేయవలెను.

శ్రీ కలపాల సూర్యప్రకాశరావుగారు ప్రతిపాదించిన స్కీమును వెంటనే ప్రయోగాత్మకముగా ఉయ్యూరు పంచాయతీ సమితి ప్రాంతములో ఆచరణలోపెట్టుటకు సిఫారసు చేయటమైనది.



# ప్రతి గ్రామానికి గ్రంథాలయం

ఈ ఆశయంతో లోకల్ లైబ్రరీ అథారిటీ పనిచేయవలసియున్నది. సమితులు, పంచాయతీలతోకూడిన సహకార పద్ధతిలో యీ కార్యక్రమం వుండాలి. ప్రతి పంచాయతీ "లైబ్రరీసెస్సు" వసూలుపర్చి లోకల్ లైబ్రరీ అథారిటీకి జమకట్టు చున్నది. ఇదే ప్రధానమైన ఆర్థిక వనరుగా లోకల్ లైబ్రరీ అథారిటీ పనిచేయుచున్నది అందువల్ల గ్రంథాలయ ఉద్యమ ప్రగతికి పంచాయితీలు పునాదిరాళ్ళుగా గుర్తించవలసియున్నది. ఈ పంచాయితీలవల్ల ఏర్పడినదే సమితి. కనుక సమితి. పంచాయితీ, లోకల్ లైబ్రరీ అథారిటీ ఈ మూడు సంస్థలు అనుబంధించబడితేనే ఈ ఉద్యమం ప్రగతి చెందగలదు.

ఈ జిల్లా 24 సమితులుగా విభజించబడియున్నది. ఒక్కొక్కసమితిలోనే షుమారు 40 పంచాయితీలున్నవి. ప్రతి సమితి కేంద్రస్థానములో ఒక శాఖాగ్రంథాలయమును ఏర్పరచి, దానికి అనుబంధముగా రెండు ఉపశాఖలను ఏర్పాటు చేయవలయును అప్పుడు జిల్లా మొత్తమునకు 24 శాఖాగ్రంథాలయాలు 48 ఉపశాఖలు ఏర్పాటు అవుతవి. మొత్తం 72 వరకు వుంటవి. ఒక్కొక్కశాఖకు 10 నుంచి 15 వరకు గ్రామాలు అనుసంధించాలి. ఆ విధంగా ప్రతి గ్రామంలోను గ్రంథాలయం పెట్టవచ్చును.

ప్రస్తుతము సమితులు ప్రతిగ్రామంలోను పంచాయితీలద్వారా పఠనమందిరములను ఏర్పాటుచేస్తున్నారు ఇందుకు కొంత గ్రాంటు కూడా యిస్తున్నారు. వాటిలో మనశాఖలకు అను సంధానం చెయ్యవచ్చును సమితి. పంచాయతీ కలిసి వారి ఆర్థికపరిస్థితినిబట్టి పత్రికలు తెప్పించవచ్చును. పంచాయతీ గుమాస్తాకు స్వల్ప బహుమానము యిచ్చి గ్రంథాలయ పని కూడ అప్పగించవచ్చును. లోకల్ లైబ్రరీ అథారిటీనుంచి. గ్రంథాలు. మాసపత్రికలు. పక్షపత్రికలు వగైరా సాహిత్యం అందించవచ్చును. ఈ విధముగా పరస్పర సహజీవనపద్ధతిలో వుద్యమం అభివృద్ధి చెందగలదు.

## ఆర్థిక వనరులు :

మన జిల్లాలోని 800 పంచాయితీలనుండి రెండు లక్షల రూపాయలవరకు లైబ్రరీసెస్సు వస్తుంది. ఇదిగాక మున్సిపాలిటీలనుండి ఒక లక్ష రాగలదు. ఈ మొత్తం మూడులక్షలు సంవత్సరానికి వచ్చే సావకాశంవుంది అందరకూ గ్రంథాలయసేవ అందితేనే ఇంత మొత్తం వస్తుంది. లేనిచో నిరుత్సాహం, అశ్రద్ధవల్ల కొన్ని పంచాయితీలు సెస్సును చెల్లించుటలేదు. ఈ నాడు పంచాయితీలు, మున్సిపాలిటీలు కలిసి 1½ లక్షలకు మించి సెస్సు కట్టుటలేదు. అయినప్పటికి 46 శాఖలను నడుపగలుగుచున్నాం. పైస్కీము ప్రకారం 72 శాఖలు జిల్లాకు కావాలి.

ప్రస్తుతం 150 మంది సిబ్బందితో పని జరుగుచున్నది. మరొక 70 మంది అటెండర్లను గాని సేవక్‌లను నియమిస్తే మొత్తం స్కీము అమలుజరుగుతుంది ఇందుకు యింకొక 60 వేలు స్టాపు జీతాల క్రింద ఖర్చుపెరుగ గలదు.

| ఖర్చులు | 46 శాఖలకు | ఖర్చులు | 100 శాఖలకు |
|---|---|---|---|
| రు. 1,20,000 | జీతాలకు | రు. 1,80,000 | జీతాలు |
| 60,000 | పుస్తకాలు | 1,40,000 | పుస్తకాలు |
| 10,000 | ఫర్నిచరు | 50,000 | ఫర్నిచరు |
| 8,000 | స్టేషనరీ | 16,000 | స్టేషనరీ వగైరా |
| 10,000 | కంటింజెన్సీ | 10,000 | కంటింజెన్సీ |
| 20,000 | భవనాలమరమ్మతు | 20,000 | భవనాలమరమ్మత్తు |
| 18,000 | పేపర్లు | 32,000 | పేపర్లు |
| 8,000 | ప్రయాణభత్యములు | 12,000 | ప్రయాణభత్యములు |
| 6,000 | ఇతరములు | 40,000 | ఇతరములు |
| 2,60,000 | మొత్తం. | 5,00,000 | మొత్తం |

## గ్రంథాలయ సదస్సు సూచనలు

| ప్రస్తుత ఆదాయం | | | రాగల ఆదాయం | |
|---|---|---|---|---|
| రు. 1,40,000 | సెస్సులు, మున్సిపాలిటీలు కొన్ని పంచాయితీలు. | | రు. 2,00,000 | అన్ని పంచాయితీలు |
| 1,40,000 | ప్రభుత్వగ్రాంటు | | 1,00,000 | మున్సిపాలిటీలు |
| 2,80,000 | మొత్తం. | | 3,00,000 | |
| | | | 3,00,000 | ప్రభుత్వ గ్రాంటు |
| | | | 6,00,000 | మొత్తం. |

### పట్టణము (మున్సిపాలిటీ) లకు

| | |
|---|---|
| విజయవాడ జనాభా $2\frac{3}{4}$ లక్షలు గనుక | 4 శాఖలు |
| విజయవాడ మహిళాశాఖ | 1 ,, |
| బందరు జనాభా 1 లక్ష గనుక | 2 ,, |
| బందరు బాలల శాఖ | 1 ,, |
| గుడివాడ జనాభా 50 వేలు | 2 ,, |

ప్రతి శాఖకు ఒక బండిద్వారా సంచార శాఖను యేర్పాటుచేయవలసి వుంటుంది.

### ఉయ్యూరు సమితి

ప్రధమసోపానంగా వుయ్యూరు సమితిలో యీ స్కీమును అమలు చేయవచ్చును. ప్రస్తుతం 2 శాఖలు, 6 గురు ఉద్యోగులు ఉన్నారు. ఈ రెండు శాఖలనుంచి మరొక క్రొత్తశాఖను పెట్టవచ్చును. ఇందుకు అదనంగా ఖర్చు అవసరం లేదు. ఒక్కొక్క శాఖకు 13 గ్రామాలు సంబంధం కల్పించవచ్చును.

విజయవాడ
31-8-63

ప్రతిపాదకులు :
కలపాల సూర్యప్రకాశరావు,
ఛైర్మన్, లోకల్ లైబ్రరీ అథారిటీ, కృష్ణా.



|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA107B186 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 135 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 134 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ch. Ramya |
| పేజీలు విడదీసినది | Ch. Ramya |
| స్కాన్ చేసినది | Dharyuli |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |